## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit,<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

వైదిక వాఙ్మయము:

# మహాసౌరము

(సాయణభాష్య-ఆంధ్రీకరణతో)



ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః ।
దృశే విశ్వాయ సూర్యమ్ ॥ (ఋ 1-50-1)

డా॥ వేదుల సుబ్రహ్మణ్యము

# విషయ సూచిక

# కృ త జ్ఞ త లు

ఈ గ్రంథపు వ్రాతప్రతిని ఆమూలాగ్రము పరిశీలించి దయతో ఆశీస్సులను, వేయి రూపాయలను ఇచ్చిన పరమ పూజ్య శ్రీశ్రీశ్రీ చినజియ్యరుస్వామి వారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథ రచనకు ప్రధాన ఆర్థిక సహాయమును అందజేసిన శ్రీ తిరుమలేశునకు - శ్రీవారి కార్యనిర్వహణాధికారులకు కృతజ్ఞుడను.

ఈ గ్రంథమును సుందరముగా ముద్రించి అందజేసిన శ్రీ శర్వాణి ప్రింటర్స్ వారికి సదా కృతజ్ఞుడను.

ఇట్లు
గ్రంథకర్త

H.H. Tridandi Srimannarayana
Ramanuja Chinna Jeear Swamy

శ్రీమతే నారాయణాయ నమః

అనేక మంగళా శాసనములు!

భూమిపై నివసించే ప్రాణులందరికీ మహోపకారం చేయుచున్న వాడు సూర్యుడు. ప్రాణికోటికి పోషకమగు ఆహారాన్ని అందివ్వడం, ధారకమగు నీటిని మేఘ రూపముగ తయారు చేయడం, భోగ్యములకు వివిధ పదార్థములను తయారు చేయడం, ఇవన్ని కేవలం సూర్యుని వల్లనే జరుగుతున్నాయి. కనుక సూర్యునకు ఆ పేరుంచబడినది. 'సుష్టు ఈరయతి' బాగుగ ఈ ప్రాణులన్నింటిని పోషించువాడు కనుక "సూర్య"అని.

సూర్య స్పర్శలేని నాడు ప్రాణులలోని చైతన్యము కాంతి హీనమై నశిస్తుంది. ఈ ఉపకారాన్ని మానవులు తప్ప ఏ ఇతర ప్రాణులు గుర్తించలేవు. గుర్తించే శక్తి ఉన్నందున మన మానవజాతికి మార్గనిర్దేశికులగు ఋషిపుంగవులు ఆ సూర్యునికి కృతజ్ఞతాంజలులు ఘటిస్తూ, అతని శక్తిని వివిధ స్తోత్రములు, మంత్రములు ద్వారా కీర్తించిరి.

స్వార్థం మనిషికి అత్యధికం కనుకనే ఏమి చేస్తున్నా స్వార్థంలేనిదే చేయడు. స్వార్థస్వభావుడైన వీనిని సన్మార్గంలో నడుపదలచిన భగవానుడు స్వార్థం తీరే మార్గాలు తానే అన్వేషించి వేద మంత్రము ద్వారా ప్రసాదించాడు. దీనిని భగవద్గీత 3వ అధ్యాయంలో "సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా...... ఏషవోస్త్విష్ట కామధుక్" అంటూ ఈ మంత్రములద్వారా కోరికలను పెత్తుకు కొండు' అని శాసించెను. అయితే ఆ ప్రక్రియకు "యజ్ఞ" మని పేరిడెను. అనగ దేవతా ప్రీతి కరమగు క్రియా విశేషము. ఇవి రకరకాలు. అవి గూడ 4 వ అధ్యాయంలో తానే వివరించాడు. అస్తు.

కోరికలన్ని తీర్చే సాధనమైన యజ్ఞమనదగిన దివ్యభవనాన్ని భగవాను

డనుగ్రహించి, ఆ యజ్ఞముల కధి దేవతలను ఏర్పరచి, వారికందరకు సూర్యుని మధ్యవర్తిగ నిలిపి పరస్పరము శ్రేయః ప్రదులు కమ్మని ఆజ్ఞాపించగ, అటు సూర్యుడు, తదితర దేవతా విశేషములు తమవంతు ఉపకారం మానవులకు అందిస్తున్నారు. వాటిననుభవిస్తూ, ఇంకా వృద్ధి చేసుకొన గోరిన మానవుడు, ఎట్లు చేసుకొనవలెనో తెలియక తికమక పడుచు, ఉన్న వసతులను గూడ నశింపచేసుకొనే రీతిలో విజ్ఞానాన్ని వక్రమార్గంలో దురుపయోగ పరచు కుంటు న్నాడు.

మానవునికి దేవతలకు మధ్య నిలచి ప్రత్యక్షముగ ఉపకరించే జగచ్చక్షు వగు సూర్యుని ఉపకారాన్ని గుర్తించి తిరిగి కృతజ్ఞత తెలుపు యోగ్యత ఉన్నా, ఆ తెలుపుటగూడ కేవలము స్తుతి మాత్రంగాక, దాని వ్యాజముగ తన ఇష్ట కామ్యార్థసిద్ధిని గూడ పొందదగియున్నా, అట్టి సాధనమైన సూర్య ప్రసన్న కరములగు మంత్రములు అందుబాటులో ఉన్నా, తెలియని తనముచే దానికి దూరమయ్యే లోకులకు, అందునా తెలుగు ప్రజలకు దానినందించి తరింపజేయు సంకల్పముతో ఋగ్వేదాంతర్గతములగు సూర్యదేవతాక మంత్ర భాగములనుద్ధ రించి మన పెద్దలందించిన 'మహా సౌరము' అను భాగమునకు సాయణభా ష్యంతోపాటు, సులలిత సరళ తెలుగు వివరణతోగూడ శ్రీమాన్ - వేదుల సుబ్రహ్మణ్యంగారందించే ఈ కోశము అత్యద్భుతమైన రీతిలో తయారైనది.

అర్థము తెలియకున్నా, కోకిలకూజితములవలె, వీణా నిక్వాణమువలె, వేదశబ్దానికే దివ్యశక్తి ఉన్నది. అర్థముగూడ కొంత తెలిస్తే అనుసంధించు వారికది త్వరగ మానసిక సాక్షాత్కారమగు నవకాశము కలదని డా. శ్రీ వేదులవారు చేసిన ఈ ప్రయత్నము బహుజన భాగధేయమై విరాజిల్లుగాకయని అనేక మాంగళాశాసనములు చేయుచున్నాము.

సం॥ చిన్న జియ్యరు స్వామి.

# సమర్పణము.

1. భానో భాస్కర మార్తాండ చండరశ్మే దివాకర ।
శ్రావయామి స్వకీయం తే జన్మాది చరితం ప్రభో ॥

2. శ్రూయతాం శ్రద్ధయాదేవ క్రియతాం శం దయానిధే ।
త్వంహి బ్రహ్మాచ విష్ణుశ్చ శివస్కందః ప్రజాపతిః ॥

3. మాతా కామేశ్వరీ సాధ్వీ పితా కామేశ్వర స్సుధీః ।
లలితాంబా చ మే జాయా జ్ఞాన విజ్ఞాన దాయినః ॥

4. పేరూర్ద్రావిడ శాఖీయః వేదులాన్వయ సంభవః ।
కృష్ణావ ధానినః పౌత్రః - సుబ్రహ్మణ్య స్సుధీరహమ్ ॥

5. తవైవ మహిమా ఖ్యాతా - మహాసౌరే ప్రభాకర ।
ప్రబుధ్యసే తతో ఋగ్భిః - మహా సౌర గతై ర్భవాన్ ॥

6. కుర్వేహ మాంధ్రభాషాయాం - తస్య వృత్తిం సుబోధినీమ్ ।
తవ ప్రీత్యర్థమే వేయ - మతస్తుభ్యం సమర్ప్యతే ॥

7. గృహాణేదం మహాసౌరం - సహస్ర కిరణైర్ముదా ।
సాయణ వ్యాఖ్యయా యుక్తం - సుబోధిన్యా సమన్వితమ్ ॥

8. కిం యాచే త్వమహం రాజన్ - సర్వం జానాసి మే స్థితిమ్ ।
నేచ్ఛామ్యన్యత్కిమప్యద్య - వినాముక్తిం శుభంకర ॥

9. త్వమేవాత్ర సమర్థోసి - దేహి మే వాంఛితం ప్రియం ।
విలంబనేన కిం సూర్య అపకీర్తిస్తవైవ భోః ॥

10. సర్వదేవాధి దేవస్త్వం - ఆధివ్యాధి వినాశకః ।
రక్షాముం లోక మాదిత్య - కలి దోషభయాత్ప్రభో ॥

* * *

# ధ్యాన శ్లోకములు.

ఓమ్।

ఉదయే బ్రహ్మస్వరూపో మధ్యాహ్నేతు మహేశ్వరః।
అస్తమానే స్వయం విష్ణుః త్రయీ మూర్తిర్దివాకరః॥

ధ్యేయస్సదా సవితృ మండల మధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః।
కేయూరవా న్మకరకుండలవా న్కిరీటీ
హారీ హిరణ్మయ వపుర్ధృత శంఖచక్రః॥

నమ స్సవిత్రే జగదేక చక్షుషే
జగత్ప్రసూతి స్థితి నాశ హేతవే।
త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే
విరించి నారాయణ శంకరాత్మనే॥

భానో భాస్కర మార్తాండ చండరశ్మే దివాకర।
నమస్తుభ్యం నమస్తుభ్యం నమస్తుభ్యం నమోనమః॥

భానో భాస్కర మార్తాండ చండరశ్మే దివాకర।
ఆయురారోగ్యమైశ్వర్యం పుత్రాన్ చ దేహి మే ప్రభో॥

ఓం తత్సత్॥

# 1. గ్రంథరచనా లక్ష్యము.

ఈ నాడనేకమంది తమ తమ ఆరోగ్యములకై సూర్యోపాసనమును,
౹౽ర పారాయణమును వారి వారి కుల గురువులచేకాని, ఇంటి పురో
:చేగాని చేయించు కొనుచున్నారు. కొందరు స్వయముగనె చేసుకొను
ౖరు.

మంత్రము యొక్క అర్థమును, భావమును తెలిసికొని పారాయణము
ోే ఫలితము శీఘ్రముగను, ఇబ్బడి ముబ్బడిగను సిద్ధించును. అర్థమును
ుకొనకుండ చేయు పఠనము, బూడిదలో వేసిన ఎండుకట్టెలవలె, ఎట్టి
ꣳమును ఇవ్వజాలదు. ఈ విషయమునే స్మృతులలో-

ుత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే ।
ౖవివ శుష్కైధో న తజ్జ్వలతి కర్హిచిత్ ॥

రయం భారహారః కిలాభూదధీత్య వేదం న విజానాతి యోఽర్థమ్।
ర్థజ్ఞ ఇత్సకలం భద్రమశ్నుతే నాకమేతి జ్ఞాన విధూతపాప్మా ॥

-- ఇత్యాదిగ వివరించిరి. అర్థము తెలియని పఠనము (పారాయణ,
ము) వ్యర్థమని వారిభావము.

కనుక నేడు పౌరోహిత్యము వహించు వారికొరకు, స్వయముగ పారాయ
చేసుకొను వారి కొరకున్ను ఈ మహాసౌర మంత్రములకు తెలుగున అర్థ
ర్య భావ వివరణము చేసితిని. "మహాసౌరము"నకు ప్రత్యేకముగ తెలుగులో
ంరకు నీ విధమగు అర్థ తాత్పర్య వివరణము చెప్పు గ్రంథము రాలేదు
ను భావనతో, ఆ లోటు తీర్చవలెనను లక్ష్యముతో ఈ గ్రంథరచనము
ది.

ఈ లక్ష్య ప్రయోజన సాఫల్యములను లోకమే నిర్ణయించవలెనను భావ
, దీనిని విజ్ఞులగు మీ ముందుంచు చున్నాను.

ఇట్లు
రచయిత.

# 2. ప్రస్తావన - నివేదన.

సూర్యోపాసకులకు, మంత్రార్థ జిజ్ఞాసువులకు నమస్కృతులు.

సూర్యుడు ప్రత్యక్ష దైవము. మనము కోరినను కోరకున్నను సర్వ జీవ రాశికి మేలు చేయుటయే అతని లక్ష్యము. అతను మనకై చేయు అనేక పనులను మనమర్థము చేసుకొనలేక భగవంతుని నిందింతుము. కాని వానినెల్ల విశాల దూరదృష్టితో చూడగలిగినచో అవి యెల్ల మన శ్రేయస్సునకేయని మనము గ్రహించగలము.

ఈనాడు ఆధునిక వైజ్ఞానిక శాస్త్రరీత్యా చూసినను, లేక ప్రాచీన సంప్రదాయముననుసరించి చూచినను, సూర్యుని శక్తి అనంతము. అతని నుండి వచ్చు కిరణములను సక్రమముగ విశ్లేషించి ఉపయోగించుకొన గల్గినచో, అవి మానవాళికి సర్వ శ్రేయస్సును కూర్చగలవు. అట్లే అవి సర్వవినాశనమును కూడ చేకూర్చగల సమర్థములు. కనుకనె సూర్యుని పరమాత్మగ భారతీయ ఋషులు గ్రహింతురు. సూర్యుడు ప్రధానముగ ఆరోగ్య ప్రదాత. సర్వ శత్రు నాశకుడు. కనుక, ఈ రెండింటిలో దేనిని కోరు వారైనను సూర్యోపాసనము చేసినచో వారి కోరికలు సిద్ధించును.

ఇట్టి అభీష్ట సిద్ధికి సూర్యమంత్రములను రెండు గ్రంథములుగ మహర్షులు కూర్చిరి. అందు ఒకటి "మహాసౌరము". ఇది ఋగ్వేదమందలి కొన్ని ప్రత్యేక మంత్రములను (ఋక్కులను) ఏర్చి కూర్చి చేసిన సంపుటీ కరణము. ఇది నేటి మిషన్‌గన్ (Machine Gun) వలె మిక్కిలి శక్తివంతమైనది. ఇక రెండవది "అరుణము" - ఇది కృష్ణయజుర్వేదీయ ఆరణ్యకము నుండి గ్రహించబడినది. దీని శక్తిని ఏటంబాంబు శక్తితో పోల్చవచ్చును. అయితే అంతటి శక్తివంతమగు కార్యసిద్ధిని పొందవలెనన్న సాధకుడు అనేక నియమములను పాటించవలెను. అందునా అరుణము మిక్కిలి ప్రమాద కరమైనది. అనుష్ఠానమున దోషములు, లోపములు ఉన్నచో అధిఫలింపదు. మరియు విపరీత వినాశకర ఫలితములనిచ్చును. కాని సౌరము అట్టిది కాదు. సామాన్య భక్తులందరు కూడ ఉపాసన (గానము) చేసుకొనవచ్చును. ఫలితములు ఉపాసనా (గాన) శుద్ధిననుసరించి యుండును.

ఒక్క విషయము. ఏ మంత్రమునైనను సిద్ధి పొందవలెనన్నచో, లేదా ఆ

మంత్ర ఫలమును పొందదలచినచో, సాధకుడు లేక మన్త్రి పారాయణ చేయు భక్తుడు సత్త్వగుణ ప్రధానుడై యుండవలెను. సాత్వికాహారమునె గ్రహించ వలెను. సత్యవాక్య పాలనము చేయు చుండవలెను. అనుష్ఠానమునకు అవసరమగు శుచి శుభ్రతలను పాటించు చుండవలెను. మానవత్వమును మనసు నిండుగ నింపు కొని, దానిని సర్వజీవులకు అందించు వాడై యుండవలెను. ఇట్టి గుణములతో కూడిన నిష్ఠాగరిష్ఠుడు వేదమంత్రములను స్వరయుక్తముగ గానము చేసిన, వాని పవిత్రతనుబట్టి ఫలసిద్ధి కలుగును.

## బైరాగి చిట్కాలు :

మహాసౌరము "మిషన్‌గన్" వంటిదని చెప్పుకున్నాముకద. అయితే ఇది అందరకు అందుబాటులో నుండదు. దానికి వాక్శుద్ధి, సిద్ధి గావలెను. సౌరపా రాయణమునకు వేద స్వరము ప్రధానము. అర్థము తెలిసినను, మంత్రములను స్వర యుక్తముగ పఠించనిచో పూర్తి ఫలముండదు. అర్థము తెలియకుండ, స్వరయుక్తముగ చదివినను కొద్దిపాటి ఫలమే వచ్చును. కాని ఈ చెప్పబోవు మంత్రములకు స్వర నియమము లేదు. ఎవరైనను వాని నిత్య పారాయణముచే సూర్యుని అనుగ్రహము నొంది ఆయురారోగ్యైశ్వర్యములను పొందవచ్చును. అవి రోగగ్రస్తులకు బాధితులకు బైరాగి చిటికలు (గోసాయి మందులు) వంటివి. వానిలో ముఖ్యమైనవి. 1. సూర్యాష్టకము 2. భాస్కరాష్టకము. 3. సూర్య కవచము. 4. ఆదిత్య హృదయము.

సామాన్యులు, మహాసౌరమును సాధించలేనివారు, స్వయముగ సూర్యో పాసన చేసుకొనుటకుగాను ఈ సూర్యాష్టకమును, భాస్కరాష్టకమును, సూర్య కవచమును ఈ గ్రంథమున చేర్చితిని. వీనిని నిత్యము పారాయణ చేయుట వలన ఆయురారోగ్యైశ్వర్యముల నొందుదురు.

## గ్రంథ స్వరూపము :

ఈ మహాసౌర గ్రంథమును రెండు భాగములుగ చూపితిని. అందు ప్రథమ భాగమున పారాయణము కొరకుగాను పారాయణ విధానమును చూపి, "మహాసౌరమంత్రపాఠము"ను ఋషి, దేవతా, ఛందస్సులతో నిచ్చితిని. ఈ మంత్రముల కర్థ వివరణము రెండవ భాగమున చెప్పబడినది.

ద్వితీయ భాగమున ఎడమవైపు పుటయందు, మంత్రమును, పదచ్ఛేద

మును, సాయణభాష్యమును కూడ నిచ్చితిని. అయితే ఈ భాష్యములోని వ్యాకరణ విషయములను వదలివేసి, అర్థ భావములకు సంబంధించిన భాష్యమును పూర్తిగ యథాతథముగ నిచ్చితిని. సామాన్యులకు వ్యాకరణ ప్రక్రియా వివరము అనవసరము గద.

ఇక కుడి ప్రక్క పుటయందు మంత్రమునకు వాక్యాన్వయమును చూపి, దానికి తెలుగులో అర్థ తాత్పర్య భావములను విశదీకరించితిని.

మంత్రములకు అకారాది క్రమమును కూడ చూపితిని. అట్లే మంత్రముల యొక్క ఋషి దేవతా ఛందస్సులను పట్టికగ నిచ్చితిని.

ఒక ముఖ్య విషయము. ఈ గ్రంథమునకు, వ్యాకరణాలంకార చక్రవర్తి, సాహిత్య విశారదులు, మద్గురువులు పూజ్యపాదులునగు శ్రీ అవ్వల్ల సోమేశ్వర శర్మగారు పీఠికగ వ్రాసిన "సంస్తవము" మహాసార మహత్త్వమునుచాటి చెప్పుచున్నది. ఇది వారు ఈ గ్రంథావశ్యకతను ఆమోదించుచు, ప్రోత్సాహకమునుగ ఈ మహాసార సౌరభమును గుబాళింపచేసిరి. వారికి సదా కృతజ్ఞుడను.

ఇట్లు
రచయిత
గురుజన విధేయుడు
**వేదుల సుబ్రహ్మణ్యము.**

# 3. ఋగ్వేదము నుండి మంత్రములు ఎంపిక

| | | క్రమ సంఖ్య | మం. సూ. ఋ |
|---|---|---|---|
| ప్రథమ వర్ణము | ఉదుత్యం జాతవేదసమిత్యాది | 1-13 | 1-50 (1-13) |
| ద్వితీయ " | చిత్రం దేవానా మిత్యాది | 14-19 | 1-115(1-6) |
| తృతీయ " | ఇంద్రం మిత్రం...ఇత్యాది | 20-21 | 1-164(46,47) |
| చతుర్థ " | హంసశ్శుచిషత్ | 22 | 4-40-5 |
| పంచమ " | యత్త్వా సూర్యేత్యాది | 23 | 5-40-5 |
| షష్ఠమ " | యదద్యేత్యాది | 24 | 7-60-1 |
| సప్తమ " | ఉత్సూర్యే త్యాది | 25-27 | 7-62-(1-3) |
| అష్టమ " | ఉద్వేతీత్యాది | 28-32 | 7-63-(1-5) |
| నవమ " | ఉదుత్యద్దర్శత | 33-35 | 7-66(14-16) |
| దశమ " | బణ్మహానిత్యాది | 36-37 | 8-101(11,12) |
| ఏకాదశమ " | నమోమిత్ర స్యేతి | 38-49 | 10-37(1-12) |
| ద్వాదశమ " | సూర్యో న ఇత్యాది | 50-54 | 10-158 (1-5) |
| త్రయోదశమ " | విభ్రాడ్బృహ దిత్యాది | 55-58 | 10-170 (1-4) |
| చతుర్దశమ " | ఆయం గౌరిత్యాది | 59-61 | 10-189(1-3) |
| పంచదశమ " | ఋతం చేత్యాది | 62-64 | 10-190(1-3) |
| షోడశమ " | సవితాపశ్చాత్తా దిత్యాది | 65 | 10-36-14 |

మొత్తము :

పదునారు వర్ణముల : పదునారు సూక్తముల
నుండి ఏర్చి కూర్చబడిన ఋక్కులు 65

మం = మండలము, సూ = సూక్తము, ఋ = ఋక్కులు

# 4. మన్త్ర- ఋషి - దేవతా ఛన్దస్సూచి

| మంత్ర స్వరూపము | మంత్ర క్రమ సంఖ్య | ఋషి | దేవత సూర్యః | ఛందస్సు |
|---|---|---|---|---|
| ఉదుత్యం జాతవేద | 1 నుంచి 9 | ప్రస్కణ్వః | " | గాయత్రీ |
| ఉద్వయం తమ | 10 - 13 | ప్రస్కణ్వః | " | అనుష్టుప్ |
| చిత్రం దేవానాం | 14-19 | కుత్సః | " | త్రిష్టుప్ |
| ఇంద్రం మిత్రం | 20-21 | దీర్ఘ తమాః | " | త్రిష్టుప్ |
| హంగుంసశ్శుచిష | 22 | వామ దేవః | " | జగత్ |
| యత్వాసూర్య | 23 | అత్రిః | " | అనుష్టుప్ |
| యదద్యే | 24-32 | వసిష్ఠః | " | త్రిష్టుప్ |
| ఉదుత్యద్దర్శతం | 33 | వసిష్ఠః | " | బృహతీ |
| శీర్ష్ణః శీర్ష్ణో | 34 | " | " | సతోబృహతీ |
| తచ్చక్షుర్దేవ | 35 | " | " | పురుఉష్ణిక్ |
| బణ్మహాగుం అసి | 36-37 | జమదగ్నిః | " | బార్హత ప్రగాథ |
| నమో మిత్రస్య | 38-46,48,49 | అభితపః | " | జగతీ |
| శంనో భవ చక్షసా | 47 | అభితపః | " | త్రిష్టుప్ |
| సూర్యోనో దివస్పా | 50-54 | చక్షుః | " | గాయత్రీ |
| విభ్రాడ్బృహత్ | 55-57 | విభ్రాడ్ | " | జగతీ |
| విభ్రాజజ్జ్యోతిషా | 58 | " | " | ప్రస్తార పంక్తి |
| ఆయంగౌః | 59-61 | సార్పరాజ్ఞీ | " | గాయత్రీ |
| ఋతం చ సత్యం | 62-64 | అఘమర్షణః | భావవృత్తః | అనుష్టుప్ |
| సవితా పశ్చాతాత్ | 65 | ధానాకలుశః | విశ్వేదేవాః | త్రిష్టుప్ |

* * *

వ్యాకరణాలంకార చక్రవర్తి, సాహిత్య విశారద
**అప్పల్ల సోమేశ్వర శర్మ,** M.A, P.O.L
ఉపాచార్యులు (Reader) (విశ్రాంతుడు)
సంస్కృత విభాగము,
ఆంధ్ర విశ్వ విద్యాలయము
విశాఖ పట్టణము.

# 5 సంస్తవము.

ఓమ్

**తత్సవితుర్వరేణ్యమ్ । భర్గో దేవస్య ధీమహి ।**
**ధియో యో నః ప్రచోదయాత్ ॥**

జగద్విఖ్యాతమైన గాయత్రీ మంత్రమిది. ప్రపంచమందలి సనాతన ధర్మానుయాయులు, ఆర్షమతావలంబులు, అందరున్ను ప్రతిదినముపాసించు మంత్రరాజమిదియే. "న గాయత్ర్యాః పరం మన్త్రమ్" (గాయిత్రిని మించిన మంత్రము లేదు) అని జేగీయమానమవుతున్న మహామంత్రమిదే. సంధ్య, సావిత్రి, సరస్వతి మొదలయిన నామాన్తరములతోను, రూపాంతరాలతోను, సంభావింపబడుచున్న దేవతలను ప్రతిపాదించు మంత్రమహా మేరువు ఇదే. "పరమ పవిత్రమైన సూర్య దేవుని తేజస్సును ధ్యానింతుము. అది మా మంచి బుద్ధులను ప్రేరించుగాక" అని దీనియొక్క సామాన్యార్థము. ఈ అర్థమే సర్వసులభంగా ఉండడానికని, ఒక శ్లోకరూపంలో నిబద్ధమై ఉంది. యో దేవః సవితాఽస్మాకంధియో ధర్మాది గోచరాః । ప్రేరయేత్ తస్య యద్భర్గః తద్వరేణ్య ముపాస్మహే ॥ (సర్వోత్తమమైన సూర్యుని తేజస్సును ధ్యానించెదము. అది మాకు సద్బుద్ధులను ప్రసాదించుగాక!). గాయత్రి మన్త్రమును మూడు పాదములుగ విభజించేరు. ఒక్కొక్క పాదానికి ఎనిమిదేసి అక్షరాలుంటాయి. మూడు పాదాలను మూడు వేదాలనుంచి (ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం) సిద్ధింప చేసేరని సంప్రదాయము. అందువలననే గాయత్రిని "త్రయీసారము" అని వ్యవహరిస్తూ ఉంటారు. ఈ మన్త్రానికి గల జపౌన్నత్యము, ఉపాసనా ప్రతిష్ఠ, ప్రచార ప్రాభవమున్ను మరొక మంత్రానికి దేనికిన్ని లేదు. దీని జపఫలితాలు కూడ అసంఖ్యాకంగ వర్ణించబడినాయి. అయురారోగ్యైశ్వర్యాలు సమగ్రంగ సమకూరుతాయని సారరూపంలో చెప్పవచ్చు. ఇదే దీని వైశిష్ట్యము. భవతు॥

గాయత్రీ మంత్రమునకు విషయమైన, లేదా - ప్రతిపాదింపబడు - ఉపాసింపబడు దేవుడు ఎవరు? ఆ బాలగోపాలమున్ను ప్రత్యక్షంగ అనుభవించే సూర్యుడే. సూర్యునికి పరిచయవచనాలు రాయటం పరిహాస ప్రాయమే అవుతుంది. అయినా అతనిని గురించిన దృష్టి బేధము, భావనా భేదమున్ను చిరకాలం నుండే పుష్కలంగా ఉన్నాయి. అవి పరస్పరం విరుద్ధాలుగా కూడ కనబడుతున్నాయి. వీనిలో ప్రసిద్ధమైనవి రెండు. ఒకటి కేవలం భౌతిక దృష్టి, రెండవది కేవలం ఆధ్యాత్మిక దృష్టి. భౌతిక భావనలో ఆధ్యాత్మికానికి సామాన్యంగ అవకాశం ఉండదు. కాని - ఆధ్యాత్మిక భావనలో భౌతికానికి మాత్రం కొంత చోటు ఉంటుంది. భౌతిక భావనకు పాశ్చాత్య విజ్ఞానం అవలంబము. ఆధ్యాత్మిక భావనకు ప్రాచ్యజ్ఞాన విజ్ఞానాలు మూలాధారం - ముఖ్యంగ భారతీయ సనాతన ముని సంప్రాదాయం జీవగర్ర. కాగా పాశ్చాత్యవిజ్ఞానానుసారంగా సూర్యుని గురించిన సిద్ధాంతాలు కొన్ని నేటికి ఈ విధంగా ఉన్నాయి.

అనాదియైన, అనంతమైన విశ్వరంగంలో కోట్లకొలది "జ్యోతిర్విశ్వములు" (గెలాక్సీలు) ఊహాతీతమైన వేగంతో దూరదూరంగా పరుగులు తీస్తున్నాయి. వీటి గమ్యం స్పష్టంగా తెలియదు. మన భూగోళానికి కనిపించే "గెలాక్సీ"లో సుమారు పదివేల కోట్ల నక్షత్రాలుంటాయి. మన భూగోళానికి కనిపించే "గెలాక్సీని" "పాలపుంత" అనిఅంటారు. "సముద్రంలో ఇది ఒక నీటిబొట్టు" ఇందులో కూడ పదివేల కోట్ల నక్షత్రాలున్నట్లు అంచనా. ఆ నక్షత్రాలలోని ఒక నక్షత్రమే సూర్యుడు. "మహా పర్వత పంక్తిలో ఒక ఇసుక రేణువు" అన్న మాట. సతతము మండుచున్న మహాగ్నిగోళమే సూర్యుడు. ఈ గోళం యొక్క వ్యాసం ఎనిమిది లక్షల అరవై అయిదువేల మైళ్ళు. భూగోళం యొక్క వ్యాసానికిది వందరెట్లధికం. భూగోళానికి తొమ్మిది కోట్ల ముప్పది లక్షల మైళ్ళ దూరంలో సూర్యగోళం ఉంది. భూమి యొక్క ద్రవ్యరాశి కన్న సూర్యుని ద్రవ్యరాశి మూడులక్షల ముప్పది వేల రెట్లు అధికంగా ఉంటుంది. సూర్యకేంద్రంలోని వేడి కొన్ని కోట్ల డిగ్రీలు. సూర్యుడు స్వయం ప్రకాశం కలవాడు. ఇతని వెలుగే ఇతని కుటుంబంలోని గ్రహాలన్నిటికిన్ని వెలుగును కలిగిస్తుంది. భూమ్యాది గ్రహాలన్ని తమతమ కక్ష్యలలో సూర్యుని చుట్టు తిరుగుతున్నాయి.

ప్రతి గ్రహానికిన్ని పరిభ్రమణ కాలమానం వేరు వేరుగ ఉంటుంది.. సూర్యుడే కేంద్రం. పరస్పరాకర్షణ శక్తి వలన ఈ పరిభ్రమణములు జరుగుచున్నవి. సూర్యుని, అతని చుట్టూ తిరిగే గ్రహాలను "సూర్యకుటుంబము" అని వ్యవహరిస్తారు. వాస్తవానికి సూర్యుడు కూడ తన "పాలపుంత" అనే

"గెలాక్సీ"లో తిరుగుతూనే ఉంటాడు. కావున "సూర్యకుటుంబాలు" కూడా కొన్ని వేల కోట్లు ఉండే అవకాశం ఉంది. వెలుతురు , ప్రాణశక్తి, వర్షం, వేడిమి, సూక్ష్మక్రిమి సంహారం , ఆరోగ్యం మొదలైనవి సూర్యుని వలన భూమిపై నివసించే జీవరాశికి కలిగే, ముఖ్య ప్రయోజనాలు. ఇటువంటి విషయాలన్నీ ఖగోళవిజ్ఞానంలో పొందుపరుపబడి ఉన్నాయి. ఇంకను పరిశోధనలు జరిపి విశ్వరహస్యాలను వెలికి తీస్తున్నారు విజ్ఞానులు. వారి దీక్ష అది. దీనినే "భౌతిక విశ్లేషణము" లేక "పదార్థ విశ్లేషణము" అని పిలుస్తారు. ఇది "శుష్కతర్కము" వంటిది. ఈ విధానంలో భావనకుగాని , దివ్య సంభావనకు గాని, ఆరాధనకు గాని, ఉపాసనకు గాని ఏమాత్రము చోటుండదు.

ఇటువంటి సంవిధానానికి పూర్తిగ వ్యతిరేకంగా ఉంటుంది భారతీయమైన ఋషి దర్శనం. దీనిని "సమ్యగ్దర్శనము" అని తాత్త్వికంగా వ్యవహరిస్తారు. "ఆత్మ - పరమాత్మ" అన్నది దీనిలోని ముఖ్యాతి ముఖ్యమైన తత్త్వము. అది అఖండానంద సంవిత్స్వరూపం - శుద్ధ బుద్ధ ముక్త చైతన్యాత్మకం - స్వయం ప్రకాశం - సర్వమూలకారణం - సర్వ సమర్థం - సర్వాంతర్యామి - అదొక్కటే ఉన్న వస్తువు "ఏకం సత్" ఆ సద్వస్తువే తన శక్తిచేత ప్రపంచంగా మారుతూ ఉంటుంది. అనేక నామరూపాలతో వ్యవహారాన్ని పొందుతూ ఉంటుంది. "విప్రాః బహుధా వదన్తి" (జ్ఞానులు సద్వస్తువునే వేయి విధాలుగ వర్ణిస్తూ ఉంటారు). జగత్తులో ఆత్మకానిది ఏదీ లేదు. చరా చరం అంతా ఆత్మమయం. ఈ సత్యాన్ని అభ్యాసాతిశయంతోను, జ్ఞానవైరాగ్యాలతోను, ఒక్క మానవుడె తెలిసికొనగలుగుతాడు. ఆ తెలివే "సోహం బ్రహ్మ" (నేనే బ్రహ్మను) అన్న పరాకాష్ఠ. అదే అసలైన జ్ఞానం. అదే "సమ్యగ్దర్శనము" మిగిలిందంతా అనిత్యమైన జీవ సామాన్యమైన వ్యవహారం మాత్రమే. వ్యవహారంలో కూడ పరమాత్మను గుర్తించడానికిన్ని, అనుసంధానం చేసి అనుభవించడానికిన్నీ ఎన్నో ఉపాయాలను ఋషి సంప్రదాయం చూపింది. ఎక్కడెక్కడైతే తేజస్సు ఓజస్సు మహిమ సౌందర్యం మొదలైన గుణగణాలు రాశీభూతమై ఉంటాయో అక్కడక్కడ పరమాత్మ ఉనికిని గుర్తించవచ్చును.

"యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా।

తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశ సంభవమ్॥" మొదలైన భగవద్గీతావచనముల తాత్పర్యం ఇదే. చెట్టు, పుట్ట, నది, సముద్రం, కొండ, కోన మొదలైన భౌతిక వస్తువుల నారాధించడంలోని రహస్యమిదే. అక్కడ ఆరాధ్యం ప్రాతిస్వికస్వరూపం కాదు. అంతర్యామియైన భగవత్స్వరూపం మాత్రమే. సత్యాన్వే

షణం, సత్యాను సంధానం, సత్యజ్ఞానం - అంటే ఇదే. అని వైదికార్యులు దృఢంగ విశ్వసించారు. వారి విశ్వాస మహా గంగా ప్రవాహమే అనుస్యూతంగ భారతదేశంలో నేటికీని ప్రవహిస్తున్నది - ప్రవహించుగాక!

కాగ, ప్రాచ్య పాశ్చాత్య సత్యాన్వేషణ మార్గముల గమ్యం చివరకు ఒకటే అవుతుంది. సందేహం లేదు. కాని అనుసరణ పద్ధతి వేరు. మహా వృక్షమైన మర్రి చెట్టు యొక్క విత్తనాన్ని పరిశీలించి, మిగిలిన అంశములకు పరిశీలనను ప్రాకించడం ప్రాచ్యపద్ధతి అయితే, చిగుళ్ళనుండి పరిశీలిస్తూ చిట్టచివరకు విత్తనంవరకు రావటం పాశ్చాత్య పద్ధతి అని, స్థూలంగా చెప్పుకోవచ్చు. రెండింటి లక్ష్యం ఒకటి కాకతప్పదు. "నదీనాం సాగరో గతిః!" ఈ అంశాన్ని "ఐన్‌స్టీన్" వంటి ఉత్తమోత్తమ విజ్ఞానులు విశదీకరించియే అన్నారు.

పై సందర్భాన్ని బట్టి భారతీయ ఋషి సంప్రదాయం భౌతిక వ్యవహారాన్ని సమన్వయం చేస్తూ పారమార్థికమైన "ఆధ్యాత్మిక విశ్లేషణ"ను స్థిరపరచినదని గ్రహించవచ్చు. ఈ విశ్లేషణంలో కేవలం నిత్యవ్యవహారమే కాక, కావలసినంత మానసిక వ్యాపారానికి కూడ అవకాశం కలుగుతుంది. అనగా, ఉత్ప్రేక్ష, ఊహ, భావన, ఆరాధన, ఉపాసన మొదలైన ప్రక్రియలకు సమగ్రమైన ప్రాంగణం ఏర్పడుతుందన్నమాట. సృష్టిలోని ఎటువంటి మహోజ్వలమైన వస్తువును చూచినా ప్రప్రథమంగా అద్భుతాశ్చర్య భావములున్ను, క్రమంగా ఆరాధనా భావమున్ను, కలిసి చివరకు "సోఽహమ్" అన్న అద్వైత స్థితిలో పర్యవసిస్తుంది. ఇదే సూర్యుని విషయంలో సంభవించింది.

సనాతన సంప్రదాయం ప్రకారం , సూర్యుడు "అసావాదిత్యో బ్రహ్మ, సోఽహంబ్రహ్మ" అని అనిపించుకున్నాడు. ఇక్కడ "అసావాదిత్యోబ్రహ్మ" అన్నది ఒక ప్రస్థానం. "సోహంబ్రహ్మ" అన్నది రెండవ ప్రస్థానం. ఇదే చరమ లక్ష్యం. మొదటి ప్రస్థానాన్ని అనుసరించి వేదములలో వివిధములైన వర్ణనలు వెల్లివిరిసెనవి. సూర్యమండలం, కిరణాలు, రంగులు, కాంతి, ఉష్ణం మొదలైన సహజ గుణాలను పురస్కరించుకొని వైదికార్యులు తమ భావనలను మనోహరంగ తీర్చి దిద్దినారు. ఉపమ, ఉత్ప్రేక్ష రూపకం మొదలైన అలంకారాలు వారి వర్ణనలో పూర్తిగ స్థానం సంపాదించేయి. తరువాత రెండవ ప్రస్థాన ప్రక్రియ కూడ (పరమాత్మ భావన) ఎడనెడ ప్రస్ఫుటం చేయబడింది. "సూర్యుడు గ్రహాలకు అధిపతి, మహాతేజస్వి, విసుగు నసుగు లేకుండా లోకసంరక్షణార్థం అతడు ఎల్లప్పుడున్ను ప్రయాణం చేస్తూ, ప్రాణులకు యోగక్షేమాలను సమకూరుస్తూ ఉంటాడు. అతడే ప్రాణదాత, అతడే శక్తి సంధాత. అతడే పోషకుడు. ముఖ్యంగా

ఆరోగ్యభాగ్యానికి అతడే అధిష్ఠానదేవత - సూర్యుడు లేకపోతే లోకానికి మనుగడే లేదు. అతనికి ఒక రథం ఉంది. దానికొకటే చక్రం. గుర్రాలు ఏడు, సారధి అరుణుడు, అరుణునికి కాళ్ళు లేవు" మొదలైనవి మొదటి ప్రస్థానానికి సంబంధించిన సారాంశములు. "సూర్యుడు సాక్షాత్తుగ పరమాత్మయే నామ రూపాలను స్వీకరించి, లోకశ్రేయస్సుకై అవతరించాడు. సతతో పాసన వలన క్రమంగా "తత్ త్వమసి" అన్న మహావాక్యార్థ బోధ కలిగి, చివరకు "సోऽహం బ్రహ్మ"" అన్న అధ్యయస్థితికి చేరుకోవాలి." మొదలైనవి రెండవ ప్రస్థానం యొక్క భావనా భాష్యములు. ఈ రెండు విధములైన ప్రవాహాలున్న ప్రజలను పవిత్రం చేయాలనే తాత్పర్యంతోనే, ప్రధానమైన రెండు సూర్యోపస్థాన మంత్రా లను సంధ్యావందన ప్రక్రియలో కర్మ బ్రహ్మతత్త్వవేత్తలు పొందు పరచినారు. "మిత్రస్య చర్షణీ ధృత శ్రవో దేవస్య సానసిమ్" అన్నది మొదటి మంత్రం యొక్క మొదలు. "ఆసత్యేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ" అన్నది రెండవ మంత్రం యొక్క ఆరంభం.

ఇటువంటి మహామహిమాన్వితమైన, గంభీరభావనా భావితమైన వర్ణన లతో వెలుగుతున్న మంత్రరాజములకు "మహోదధి" ఋగ్వేదము. ఒకానొక దేవతను ప్రశంసించే అర్థచ్ఛందో బంధము ఋక్కు. ఋక్కులతో పరిపూర్ణమైన వేదం ఋగ్వేదం. దీనిలో ఋషుల దివ్యభావనలు, వాక్కులున్ను, వెయ్యివిధా లుగా పరవళ్ళు తొక్కినవి. ఇంద్రుడు, అగ్ని, సోముడు, వరుణుడు, సూర్యుడు మొదలైన ముప్పది ముగ్గురు దేవతలను స్తుతించే ఋక్కులు, సుమారు పదివేలు ఋగ్వేదంలో నేటికిన్ని దర్శనమిస్తాయి. ఋగ్వేదవర్ణనలే ఇతిహాస పురాణాలలోని శతసహస్రోపాఖ్యానాలకు భిక్ష పెట్టినవి.

ఋక్సంహిత వర్ణించిన ముఖ్యమైన దేవతలలో సూర్యుడొకడు. సూర్య, సవితృ, మిత్ర, పూషన్ అను నాలుగు నామములు శీర్షికలుగ గల ఋక్కులు పర శ్శతంగ ఉన్నాయి. ఇంతటి ఋషి సంప్రదాయం, గురుపరంపర, విశ్వాసప్రాభవం, శ్రద్ధా వైభవం, ప్రత్యక్ష ప్రమాణమున్ను ఉన్నది కాబట్టే - సూర్యోపాసనము నిత్యకర్మలకు మకుటమై నాటికిని నేటికిని విరాజిల్లుతున్నది. "అహరహస్సంధ్యా ముపాసీత" (ప్రతిదినం సంధ్యావందనం తప్పక చేయాలి) అన్న ధర్మసూత్రం అందువల్లనే ఏర్పడింది. సంధ్యావందనం చేయనిదే వేరొక కర్మకు దేనికిని యోగ్యతయే లేదు. కలుగదు. సంధ్యావందమనగా సూర్యారాధనమే. ఆయా మంత్రములతో భౌతికంగాను, భావనామయంగాను, ఆధ్యాత్మికంగాను, సూర్యుని ప్రశంసించుచు, నమస్కరించుటయే. వైదికమైన ఈ ప్రక్రియను పౌరాణికంగ

కూడా తీర్చిదిద్ది - సామాన్యజనులు కూడ అనుసరించుటకు వీలగు మార్గంలో స్తోత్రాదులను అందించేరు అలనాటి మహానుభావులు కొందరు. వానిలో అతి ప్రసిద్ధమైన శ్లోకాలు రెండున్నవి.

1. ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసన సంనివిష్టః ।
కేయూరవాన్మకర కుండల వాన్కిరీటీ
హారీ హిరణ్మయ వపుర్ధృత శంఖ చక్రః ।

(బంగారు శరీరమును కలిగి, శంఖ చక్రములను ధరించి, కిరీట కుండలాదులతో పద్మాసనంలో ఉన్న నారాయణుడె సూర్యమండల మందున్నాడు.).

2. నమస్సవిత్రే జగదేక చక్షుషే
జగత్ప్రసూతి స్థితినాశ హేతవే।
త్రయీమయాయ త్రిగుణాత్మ ధారిణే
విరించి నారాయణ శంకరాత్మనే॥

(సూర్యుడు బ్రహ్మ విష్ణు శివ స్వరూపుడు - సత్త్వరజస్తమోమయుడు - ఋగ్యజుస్సామాత్మకుడు - సృష్టి స్థితిలయ కారుడు - లోకైక చక్షువు - అతనికి నమస్కారము).

ఈ శ్లోకాలతోగాని, వీని భావాలుగల అనువాదాలతో గాని, (ప్రతిదినం నిద్ర లేచి ముఖం కడుగుకుని) సూర్యుని ధ్యానించే జనులు నేటికిని (అతిసంకులమైన నవ్య సమాజంలో) కోట్లకొలది ఉన్నారు. దీనివలన సూర్య ప్రశస్తి ప్రకటితమవుతున్నది. ఇంతటి నిత్యారాధనా సౌభాగ్యం వేరొక దేవునకు లేదన్నను అతిశయోక్తి కాజాలదు.

- తథాస్తు॥

ప్రకృతం : వైదికమైన మంత్రములతో కల్పోక్తమైన పద్ధతులతో ఆచరించే సూర్యోపాసనా ప్రక్రియకే "సౌరము" లేక "మహాసౌరము" అనిపేరు 'సూర' అను శబ్దం కూడ సూర్యుని బోధిస్తుంది. "సూరునకు సంబంధించినది" సౌరము. ఋగ్వేదము యొక్క పది మండలాలలోను ఉన్న సూర్యదేవతాకమైన మంత్రాలలో ముఖ్యమైన మంత్రాలను ఏర్చికూర్చిన మంత్రమండలమిది. ఇందులో ఇంచు మించు అరవై అయిదు ఋక్కులున్నవి. ఈ ప్రక్రియను

ఆచరిస్తే ఆయురారోగ్యైశ్వర్యాది సకల సంపదలును సమకూరును ముఖ్యంగ ఆరోగ్య భాగ్యానికిది "అమృతమే" సందేహం లేదు. వేదాలలోను, ఇతిహాస పురాణాదులలోను, సమకాల సమాజంలోను కూడ ఈవిషయాన్ని సమర్థించడానికి అసంఖ్యాకమైన దృష్టాంతాలు కనబడుతున్నాయి.

సౌరమునకు శ్రీసాయణాచార్యులు వ్రాసిన భాష్యం (వ్యాఖ్యానం) చిరకాలంగ, అనూచానంగ, ప్రకాశిస్తున్నది. కాని అది అందరికును అందుబాటులో ఉండదు గదా! అందువలనే ఆంధ్రులందరకును అందుబాటులో ఉండాలనే సత్సం కల్పంతో డాక్టర్. వేదుల సుబ్రహ్మణ్యంగారు, సౌరమునకు ప్రతిపదార్థ తాత్పర్యములను వ్రాసి ప్రకటించారు. వారి కృషి ప్రశంసార్హమైయున్నది.

శ్రీ సుబ్రహ్మణ్యంగారు నా ప్రియశిష్య రత్నములలో ఒకరు నాయందు ఎనలేని భక్తి ప్రపత్తులను పెంచుకొన్నారు. వారు ఈ కృతికి భూమికను వ్రాయ గోరడం. శైష్యోపాధ్యాయికా సంబంధ సౌభాగ్యమే. అందువలననే ఆనందంతో అంగీకరించి సముచితమని తోచిన కొన్ని మాటలను వ్రాసినాను. అవశ్యకమైన వైదిక గ్రంథములకు ఆంధ్రాను వాదములను, వివరణములను, వ్యాఖ్యలను వ్రాయుటయు, ప్రచురించుటయును ఈ కృతికర్త యొక్క ముఖ్యమైన దీక్షయై ఉన్నది. ఆ దీక్షతోనే "శిక్షలు, నిరుక్తము, తైత్తిరీయ ప్రాతిశాఖ్యము మొదలైన గ్రంథాలను ఇదివరకే ప్రకటించియున్నారు. వీరి వైదిక దీక్ష విద్యార్జన విశిష్ట శ్లాఘా పాత్రము కాక తప్పదు. వీరి గ్రంథాలను ముద్రించుటకు శ్రీ తిరుమల - తిరుపతి దేవస్థానము వారు సకల సాహ్యమును చేయుచున్నారు. అది వారి కర్తావ్యాలలో ఒకటి గదా!" చేయకపోతే వింతగాని, చేస్తే వింత అవుతుందా! అన్నది మావంటివారి అభిసంధి. ఆ విధమైన సాహాయ్యం వర్ధిల్లునాక! శ్రీ సుబ్రహ్మణ్యంగారి ప్రకృత రచనలో ఒక విశేషం కూడా ఉంది. దీనిని చివరనే చెప్పాలని తోచింది. మూలమును, సాయణభాష్యమును కూడ ఒక్క ప్రక్క చేర్చి యున్నారు. పరిశీలకులకిది పనికి వస్తుంది. ఇటువంటి గ్రంథాలను పదింబదిగా రచించి ప్రకటించుటకు తగిన సాధన సంపదను, కృతికర్తకు సతతము ప్రసాదించుమని శ్రీ తిరుమలేశుని సదా ప్రార్థింతును.

అప్పల్ల సోమేశ్వర శర్మ
తే 3-12-1989

# 6. మహాసౌర పారాయణ విధానము.

[ఉపనయన మొందిన బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులు, సంధ్యావందన మాచరించిన తర్వాత ఈ పారాయణ మాచరించవలెను.

శూద్రులు (ఉపనయనముకాని వారు, ఉపనయనార్హత లేనివారు) వారు స్వయముగ పారాయణ చేయుటకంటె, ఎవరి చేత నైనను - అనగ కులగురువు చేత పురోహితుని చేతగాని తమ తరపున పారాయణ చేయించుకొనుట మంచిది.

అట్లుకాక, వారే స్వయముగ పారాయణ చేసుకొనదలచినచో ముందుగ స్నానాదికముల నాచరించి, ఇష్టదేవతా పూజను, ప్రార్థనలను చేసి, కొన్ని స్తోత్ర శ్లోకములను పఠించిన తర్వాత ఈ సౌర పారాయణము చేయవచ్చును. కాని అట్టివారికి స్వల్ప ఫలము మాత్రమే వచ్చునని పెద్దల వాక్కు. అయినను నిశ్చల భక్తితో పారాయణ చేయగల్గిన వారికి, వారి దీక్షనాధారము చేసికొని ఫలము లభించును.

ఈ సౌర మంత్ర పారాయణను. సూర్యునికెదురుగ ఉషః కాలమందు చేయుట ఉత్తమము. అట్టి అవకాశము లేనిచో, ఇంట్లో దేవతా గృహమందు, పూజామందిరమున కెదురుగ సూర్యుని ప్రతిమనో బొమ్మనో, చిత్రమునో Photo లేక మహాసౌర యంత్రమును గాని యుంచుకొని, దానియందు సూర్యునావాహ్వనించి, అర్చించి, తర్వాత ఈ పారాయణను చేయుట శ్రేష్ఠము.

అన్నిటికంటె ముఖ్యము శ్రద్ధ - దీక్ష - భక్తి, వీనిని కల్గిన వారు ప్రతిదినము వేళ తప్పకుండ, నియతముగ కేవలం మంత్ర పారాయణములు నైనను చేసుకొనవచ్చును. ఏ ప్రార్థనా ఫలితమైనను, ఆప్రార్థనను చేయు వ్యక్తి యొక్క పవిత్ర హృదయము, దృఢమగు దీక్ష, నిశ్చలమగు భక్తి, నిరంతర శ్రద్ధలపై నాధారపడియుండును. కనుక దైవ ప్రార్థన చేయువారు, నిష్కల్మష చిత్తము గల్గి, నిశ్చల మనస్సుతో, దృఢమగు భక్తితో ప్రార్థనలు పూజలు సలుపవలెను.]

హరిః ఓమ్! అచమ్య!

కేశవాయ స్వాహా - నారాయణాయ స్వాహా - మాధవాయ స్వాహా - గోవింద - విష్ణో - మధుసూదన - త్రివిక్రమ - వామన - శ్రీధర - హృషీకేశ - పద్మనాభ - దామోదర - సంకర్షణ - వాసుదేవ - ప్రద్యుమ్న

- అనిరుద్ధ - పురుషోత్తమ - అధోక్షజ - నారసింహ - అచ్యుత - జనార్దన-
ఉపేంద్ర - హరే - శ్రీకృష్ణాయ నమః॥

ఓం, ఉత్తిష్ఠంతు భూతపిశాచాః । ఏతే భూమి భారకాః । ఏతేషామవి రోధేన బ్రహ్మకర్మ సమారభే॥ ఓం భూః । ఓంభువః । ఓం సువః । ఓం జనః । ఓగుం సత్యం । తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్। ఓ మాపో జ్యోతిరసోऽ మృతం బ్రహ్మ భూర్భువ స్సువరోమ్॥ మమోపాత్త దురితక్షయ ద్వారా, శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే మహా విష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేత వరాహ కల్పే - వైవస్వత మన్వంతరే - కలియుగే - ప్రథమపాదే - జంబూ ద్వీపే, భరతవర్షే, - భరతఖండే - మేరోర్దక్షిణ దిగ్భాగే - శ్రీశైలస్య ఉత్తరదేశే - గంగా కావేరి కృష్ణా, గోదావరి మధ్యే - స్వ వాస గృహే - శ్రీ సూర్యనారయణసన్నిధౌ - అస్మిన్వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన - సంవత్సరే, - అయనే, - ఋతౌ, - మాసే - పక్షే - తిథౌ - వాసరే, శుభ నక్షత్రే, శుభయోగే, శుభకరణే - ఏవం గుణ విశేషణ విశిష్టాయాం, శుభతిథౌ శ్రీమాన్ - గోత్రం - నామధేయ - ధర్మపత్నీ సమేతః శ్రీమతః - గోత్రస్య, - నామధేయస్య, ధర్మపత్నీ సమేతస్య మమ ఇహజన్మని జన్మాంతరకృత మహాపాతకోపపాతక సమస్తదురిత క్షయద్వారా శ్రీ సవితృ దేవతాముద్దిశ్య, మమ శరీరే వర్తమాన, వర్తిష్యమాణ సమస్తరోగ నివారణ ద్వారా క్షిప్రమేవ ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం. [ధర్మార్థకామమోక్ష రూప చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం,] శ్రీ సవితృ సూర్యనారయణ దేవతా ప్రీత్యర్థం మహాసౌర మంత్ర పారాయణ మహం కరిష్యే!

అథ సౌర్యాణాం మంత్రాణా మృక్సంఖ్య ఋషి దేవతాశ్ఛందాంస్యను క్రమిష్యామ్యహమ్॥

# పర్ణము - 1

ఓం! "ఉదుత్యం జాతవేదసం" ఇతి త్రయోదశర్చస్య సూక్తస్య కణ్వ పుత్రః ప్రస్కణ్వః ఋషిః । సూర్యోదేవతా। నవాద్యా గాయత్రీ ఛందః। "ఉద్వ యతమసస్పరీతి" చతస్రోనుష్టుభః। "ఉద్యం నద్యే" త్యయం తృచో రోగఘ్నః। ఉపనిషదం త్వార్ధర్చో ద్విషఘ్నః]

1. ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః ।
దృశే విశ్వాయ సూర్యమ్ ॥

2. అపత్యే తాయవో యథా నక్షత్రా యన్త్యక్తుభిః ।
సూరాయ విశ్వచక్షసే॥

3. అదృశ్రమస్య కేతవో విరశ్మయో జనాగుం అను ।
భ్రాజన్తో అగ్నయో యథా ॥

4. తరణి ర్విశ్వ దర్శతో జ్యోతిష్కృదసి సూర్య।
విశ్వమా భాసి రోచనమ్॥

5. ప్రత్యఙ్ దేవానాం విశః ప్రత్యఙ్గు దేషి మానుషాన్।
ప్రత్య జ్విశ్వం స్వర్దృశే॥

6. యే నా పావక చక్షసా భురణ్యన్తం జనాగుం అను।
త్వం వరుణ పశ్యసి॥

7. విద్యామేషి రజస్పృథ్వహా మిమానో అక్తుభిః।
పశ్యఞ్జన్మాని సూర్య ॥

8. సప్తత్వా హరితో రథే వహన్తి దేవ సూర్య।
శోచిష్కేశం విచక్షణ॥

9. అయుక్త సప్త శున్ధ్యువః సూరో రథస్య నప్త్యః।
తాభిర్యాతి స్వయుక్తిభిః॥

10. ఉద్వయం తమసస్పరి జ్యోతిష్పశ్యన్త ఉత్తరమ్।
దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతి రుత్తమమ్॥

11. ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాం దివమ్।
హృద్రోగం మమ సూర్య హరిమాణం చ నాశయ॥

12. శుకేషు మే హరిమాణం రోపణాకాసు దధ్మసి।
అథో హారిద్రవేషు మే హరిమాణం నిదధ్మసి॥

13. ఉదగా దయమాదిత్యో విశ్వేన సహసా సహ।
ద్విషన్తం మహ్యం రంధయ న్మో అహం ద్విషతే రధమ్ ॥

## వర్ణము - 2

["చిత్రం దేవానా ముదగాదనీకమితి" షడర్చస్య సూక్తస్య అంగిరసపుత్రః కుత్సః ఋషిః। సూర్యోదేవతా। త్రిష్టుప్ఛందః। మహాసౌర పారాయణే సూర్యోప స్థానే వినియోగః॥]

14. చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః
ఆప్రా ద్యావాపృథివీ అన్తరిక్షం సూర్య ఆత్మా జగతస్త స్థుషశ్చ॥

15. సూర్యోదేవీ ముషసం రోచమానాం మర్యోనయోషా మభ్యేతి పశ్చాత్।
యత్రానరో దేవయన్తో యుగాని వితన్వతే ప్రతి భద్రాయ భద్రమ్ ॥

16. భద్రా అశ్వా హరితం సూర్యస్య చిత్రా ఏతగ్వా అనుమాద్యాసః।
నమస్యన్తో దివ అపృష్ఠమస్థుః పరిద్యావా పృథివీ యంతిసద్యః॥

17. తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యాకర్తోర్వితతం సంజభార ।
యదే దయుక్త హరితః సధస్థా దాద్రాత్రీ వాసస్తనుతే సిమస్మై॥

18. తన్మిత్రస్య వరుణస్యాభిచక్షే సూర్యో రూపం కృణుతే ద్యోరుపస్థే।
అనన్త మన్య ద్రుశ దస్య పాజః కృష్ణ మన్యద్ధరితః సంభరన్తి॥

19. అద్యా దేవా ఉదితా సూర్యస్య నిరంహసః పిపృతా నిరవద్యాత్ ।
తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సింధుః పృథివీ ఉతద్యోః॥

## వర్ణము - 3

["ఇంద్రం మిత్రమి"తి ద్వయోర్మన్త్రయోః ఔచథ్యపుత్రో దీర్ఘతమః ఋషిః సూర్యోదేవతా।త్రిష్టుప్ఛందః॥]

20. ఇన్ద్రమ్మిత్రం వరుణమగ్ని మాహురథో దివ్య స సుపర్ణో గరుత్మాన్।
ఏకం సద్విప్రా బహుధా వదం త్యగ్నిం యమం మాతరి శ్వాన మాహుః॥

21. కృష్ణం నియానం హరయః సుపర్ణా అపో వసానా దివముత్పతన్తి।
త ఆవవృత్రన్త్సదనా దృతస్యా దిద్ఘృతేన పృథివీ వ్యుద్యతే॥

## పర్ణము - 4

["హగ్ంసశ్శుచిషది'త్యేకస్యా ఋచో గౌతమపుత్రో వామదేవః ఋషిః। సూర్యోదేవతా। జగతీ ఛందః॥']

22. హగ్ంసశ్శుచిషద్వసు రన్తరిక్ష సద్ధోతా వేదిష దతిథి ర్దురోణసత్।
నృషద్వరస దృత సద్వ్యోమ స దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతమ్॥

## పర్ణము - 5

["యత్వా సూర్యే"త్యస్య మంత్రస్య భూమిపుత్రో అత్రిః ఋషిః।సూర్యో దేవతా ।అనుష్టుప్ఛందః॥]

23. యత్త్వా సూర్య స్వర్భానుస్తమసా విధ్యదాసురః।
అక్షేత్రవిద్యథా ముగ్ధో భువనాన్యదీ ధయుః॥

## పర్ణము - 6

"యదద్యే" త్యేకో "తుస్సార్య" ఇతి తిస్ర "ఉద్వేతీతి", చతస్రోర్ఋచశ్చ ఏతాసాం మైత్రావరుణ పుత్రః వసిష్ఠః ఋషిః। సూర్యోదేవతా। త్రిష్టుప్ఛందః॥

24. యదద్య సూర్య బ్రవోఽనాగా ఉద్యన్మిత్రాయ వరుణాయ సత్యమ్।
వయం దేవత్రాఽదితే స్యామ తవ ప్రియాసో అర్యమన్గృణన్తః

## పర్ణము - 7

25. ఉత్సూర్యో బృహదర్చీంష్య శ్రేత్పురు విశ్వా జనిమ మానుషాణామ్।
సమో దివా దదృశే రోచమానః క్రత్వా కృతః కర్తృభిర్భూత్॥

26. స సూర్య ప్రతి పురో న ఉద్గా ఏభిః స్తోమేభి రేతశేభిరేవైః।
ప్ర నో మిత్రాయ వరుణాయ వోచోఽనాగసో అర్యమ్ణే అగ్నయే చ॥

27. వినస్స్నహాస్రం శురుధో రదం త్వ్నుతావానో వరుణో మిత్రో అగ్నిః।
యచ్ఛన్తు చంద్రా ఉపమం నో అర్కం మానః కామం పూపురస్తు స్తవానాః॥

## పర్ణము - 8

28. ఉద్వేతి సుభగో విశ్వచక్షాః సాధారణః సూర్యో మానుషాణామ్ ।
చక్షుర్మిత్రస్య వరుణస్య దేవశ్చర్మేవ యః సమ వివ్యక్తమాంసి॥

29. ఉద్వేతి ప్రసవీతా జనానాం మహాన్కేతు రర్ణవః సూర్యస్య।
సమానం చక్రం పర్యావివృత్సన్య దేతశో వహతి ధూర్షు యుక్తః॥

30. విభ్రాజమాన ఉషసా ముపస్థా ద్రేభైరుదేత్యను మద్యమానః।
ఏష మే దేవః సవితా చచ్ఛన్ద యః సమానం న ప్రమినాతి ధామ॥

31. దివో రుక్మ ఉరు చక్షా ఉదేతి దూరే అర్థస్తరణి ర్భ్రాజ మానః।
నూనం జనాః సూర్యేణ ప్రసూతా అయన్నర్థాని కృణవన్నపాంసి॥

32. యత్రా చక్రురమృతా గాతుమస్మై శ్యేనో న దీయ న్నన్వేతి పాథః॥

## పర్ణము - 9

["ఉదుత్యద్దర్శతమి"తి త్ర్యర్చస్య సూక్తస్య మైత్రా వరుణి పుత్రో వసిష్ఠః ఋషిః। సూర్యోదేవతా। అద్యా బృహతీ। ద్వితీయా సతోబృహతీ। తృతీయా పురఉష్ణిక్ఛందాంసి॥]

33. ఉదుత్యద్దర్శతం వపుర్దివ ఏతి ప్రతిహ్వరే।
యదీమాశుర్వహాతి దేవ ఏతశో విశ్వస్మై చక్షసే అరమ్॥

34. శీర్ష్ణః శీర్ష్ణో జగతస్త స్థుష స్పతిం సమయా విశ్వమా రజః।
సప్త స్వసారః సువితాయ సూర్యం వహన్తి హరితో రథే॥

35. తచ్చక్షు ర్దేవ హితం శుక్రముచ్చరత్।
పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతమ్॥

## పర్ణము - 10

["బణ్మహాని"తి ద్వయోర్మంత్రయోః భార్గవో జమదగ్నిః ఋషిః।
సూర్యోదేవతా। బార్హత ప్రగాథశ్ఛందః॥]

36. బణ్మహాఀ అసి సూర్య బళాదిత్య మహాఀ అసి।
మహస్తే సతో మహిమా పనస్య త్రేऽద్ధా దేవ మహాఀ అసి॥

37. బట్ సూర్య శ్రవసా మహాఀ అసి సత్రా దేవ మహాఀ అసి।
మహ్నా దేవా నామసుర్యః పురోహితో విభు జ్యోతి రదాభ్యమ్॥

## వర్గము - 11

["నమో మిత్రస్యే"తి ద్వాదశర్చస్య సూక్తస్య సూర్యపుత్రో అభితపః ఋషిః । సూర్యోదేవతా।జగతీ ఛందః। దశమీ త్రిష్టుప్॥]

38. నమో మిత్రస్య వరుణస్య చక్షసే మహోదేవాయ తదృతం సపర్యత।
దూరే దృశే దేవజాతాయ కేతవే దివస్పుత్రాయ సూర్యాయ శంసత॥

39. సా మా సత్యోక్తిః పరిపాతు విశ్వతో ద్యావా చ యత్ర తతనన్నహాని చ।
విశ్వమన్యన్ని విశతే యదేజతి విశ్వాహాపో విశ్వాహోదేతి సూర్యః॥

40. న తే అదేవః ప్రదివో నివాసతే యదేతశేభిః పత్రై రథర్యసి।
ప్రాచీన మన్యదనువర్తతే రజ ఉదన్యేన జ్యోతిషా యాసి సూర్య॥

41. యేన సూర్య జ్యోతిషా బాధసే తమో జగచ్చ విశ్వముదియర్షి భానునా।
తేనాస్మద్విశ్వా మని రామనాహుతి మపామీవా మప దుష్వప్న్యం సువ ॥

42. విశ్వస్య హి ప్రేషితో రక్షసి వ్రత మహేలయన్నుచ్చరసి స్వధా అను।
యదద్యత్వా సూర్యోప బ్రవామహై తం నో దేవా అను మంసీరత క్రతుమ్॥

43. తం నో ద్యావా పృథివీ తన్న అప ఇంద్రః శృణ్వన్తు మరుతో హవం వచః।
మా శూనే భూమ సూర్యస్య సందృశి భద్రం జీవన్తో జరణా మశీమహి॥

44. విశ్వాహా త్వా సుమనసః సు చక్షసః ప్రజావన్తో అనమీవా అనాగసః।
ఉద్యన్తం త్వా మిత్రమహో దివేదివే జ్యోగ్జీవాః ప్రతి పశ్యేమ సూర్య॥

45. మహి జ్యోతిర్బి భ్రతం త్వా విచక్షణ భాస్వన్తం చక్షుషే చక్షుషే మయః।
ఆరోహన్తం బృహతః పాజసస్పరి వయం జీవాః ప్రతిపశ్యేమ సూర్య॥

46. యస్యతే విశ్వా భువనానికేతునా ప్రచేరతే నిచవిశ తే అక్తుభిః।

అనాగాస్త్వేన హరికేశ సూర్యాహ్నాహ్నా నో వస్యసా వస్యసోదిహి॥

47. శంనో భవ చక్షసా శంనో అహ్నా శం భానునా శంహిమా శం ఘృణేన।
యథా శమధ్వ చ్ఛమసద్దురోణే తత్సూర్య ద్రవిణం ధేహి చిత్రమ్॥

48. అస్మాకం దేవా ఉభయాయ జన్మనే శర్మయచ్ఛత ద్విపదే చతుష్పదే।
అదత్పిబదూర్జయమాన మశితం తదస్మే శం యో రరపో దధాతన॥

49. యద్వో దేవాశ్చకృమ జిహ్వయా గురుమనసో వా ప్రయుతీ దేవహేలనమ్।
అరావా యో నో అభి దుచ్ఛునాయతే తస్మిన్తదేనో వసవో నిధేతన॥

## పర్ణము - 12

["సూర్యోన" ఇతి పంచర్చస్య సూక్తస్య సూర్యపుత్రో " చక్షుః" ఋషిః । సూర్యోదేవతా। గాయత్రీ ఛందః॥]

50. సూర్యో నో దివస్పాతు వాతో అన్తరిక్షాత్!
అగ్నిర్నః పార్థివేభ్యః ॥

51. జోషా సవితర్యస్య తే హరః శతం సవాగ్ం అర్హతి ।
పాహి నో దిద్యుతః పతంత్యాః॥

52. చక్షుర్నో దేవస్సవితా చక్షుర్న ఉత పర్వతః।
చక్షుర్ధాతా దధాతు నః॥

53. చక్షుర్నో దేవస్సవితా చక్షుర్న ఉత పర్వతః ।
చక్షుర్ధాతా దధాతు నః ॥

54. సు సందృశం త్వా వయం ప్రతి పశ్యేమ సూర్య।
వి పశ్యేమ నృచక్షసః ॥

## పర్ణము - 13

["విభ్రాడ్బృహది"తి చతుర్ ఋచస్య సూక్తస్య సూర్యపుత్రో విభ్రాడృషిః। సూర్యో దేవతా। జగతీ ఛందః। అన్త్యాప్రస్తార పఙ్క్తిః॥]

55. విభ్రాడ్బృహత్పిబతు సోమ్యం మధ్వాయుర్దధద్యజ్ఞ పతావవిహ్నుతమ్।
వాతజూతో యో అభిరక్షతి త్మనా ప్రజాః పుపోష పురుధా విరాజతి॥

56. విభ్రాడ్బృహత్సుభృతం వాజసాతమం ధర్మన్దివో ధరుణే సత్యమర్పితమ్।
అమిత్రహా వృత్రహా దస్యుహన్తమం జ్యోతిర్జజ్ఞే అసురహా సపత్నహా ॥

57. ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరుత్తమం
విశ్వజిద్ధనజిదుచ్యతే బృహత్।
విశ్వభ్రా డ్భ్రాజో మహిసూర్యో దృశ ఉరు
పప్రథే సహఓజో అచ్యుతమ్॥

58. విభ్రాజఞ్ జ్యోతిషా స్వారగచ్ఛో రోచనం దివః।
యేనేమా విశ్వా భువనాన్యాభృతా-విశ్వకర్మణా విశ్వదేవ్యావతా॥

## పర్ణము - 14

["అయం గౌ"రితి త్ర్యృచస్య సూక్తస్య సార్పరాజ్ఞీ ఋషిః। సూర్యో దేవతా। గాయత్రీ ఛందః॥]

59. అయం గౌః పృశ్నిరక్ర మీదసదన్మాతరం పురః।
పితరం చ ప్రయన్ స్వః॥

60. అన్తశ్చరతి రోచనాऽస్య ప్రాణాదపానతీ।
వ్యఖ్యన్మహిషో దివమ్॥

61. త్రింశద్ధామ విరాజతి వాక్పతంగాయ ధీయతే।
ప్రతివస్తోరహద్యుభిః॥

## పర్ణము - 15

["ఋతం చే"తి త్ర్యృచస్య సూక్తస్య మధుచ్ఛందసోऽఘమర్షణః ఋషిః। భావవృత్తో దేవతా। అనుష్టుప్ఛందః॥]

62. ఋతంచ సత్యం చాభీద్ధా త్తపసోధ్యజాయత।
తతో రాత్ర్యజాయత తతస్సముద్రో అర్ణవః॥

63. సముద్రా దర్ణవాదధి సంవత్సరో అజాయత।
అహో రాత్రాణి విదధ ద్విశ్వస్య మిషతో వశీ॥

64. సూర్యా చంద్రమసౌ ధాతా యథాపూర్వమ కల్పయత్।
దివం చ పృథివీం చాన్త రిక్ష మథో స్వః॥

"సవితాపశ్చాతాది"తి ఏకస్యార్చః ధానాకులుశః ఋషిః।
విశ్వేదేవాః దేవతా। త్రిష్టుప్ఛందః॥

65. సవితా పశ్చాతాత్సవితా పురస్తాత్సవి తోత్తరాత్తాత్సవి తాzధరాత్తాత్।
సవితా నస్సువతు సర్వతాతిం సవితా నో రాసతాం దీర్ఘమాయుః॥
ఓం॥ ఇత్యే తన్మహా సౌరమంత్ర పారాయణఫలం
శ్రీ సవిత్ర సూర్యనారాయణార్పణమస్తు॥ తత్సత్॥

## అథ శాంతి పాఠః :

ఓం భద్రంకర్ణేభిః శృణుయామదేవాః। భద్రం పశ్యేమాక్షిభి ర్యజత్రాః।
స్థిరైరంగై స్తుష్టు వాగుం సస్తనూభిః। వ్యశేమ దేవహితం
యదాయుః। స్వస్తి న ఇన్ద్రో వృద్ధ శ్రవాః। స్వస్తి నః పుషా
విశ్వవేదాః। స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః।
స్వస్తి నో బృహస్పతి ర్దధాతు॥ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

ఓం శాన్తా పృథివీ శివమన్తరిక్షం ద్యౌర్నో దేవ్య భయన్నో అస్తు।
శివా దిశః ప్రదిశ ఉద్దిశో న ఆపో విశ్వతః పరిపాంతు సర్వతః॥
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

ఓం నమో బ్రహ్మణే నమో అస్త్వగ్నయే నమః పృథివ్యై నమ ఓషధీభ్యః।
నమో వాచే నమో వాచస్పతయే నమో విష్ణవే మహతే కరోమి॥
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

## అథ మహాసౌర పారాయణ ఫల శ్రుతిః

షష్టిర్ప చోzర్ధర్చశ్చ ఏతాసాం సౌర్యాణాం శ్రీ సూర్య ఏవ దేవతా।
అన్యమేకం సూక్త మాత్మన స్తవం మన్యంతే॥ య ఋషి స్సోహ మితి
ధ్యాతవ్యమ్॥
య ఏతేన సౌర్యేణ సూక్తేన శ్రీసూర్య మహ రహ ముపతిష్ఠంతే తే
ధన ధాన్య బహురత్న వంతః, నిర్వ్యాధివంత, అయుష్యవంత ఆరోగ్యవంతో
న్నాద్యవంతో రయివంతో బలవంతో బహుపుత్రవన్తః భవన్తి॥
సదాగృహీ పాపక్షయార్థీ, వ్యాధి నాశనార్థీ శత్రునాశనార్థీ జీవి
తార్థీ పుత్రార్థీ మోక్షార్థీ ధనార్థీ చ కుర్వీత శ్రీ మహా సౌర పారాయణ
మహరహః॥ య ఏవం కుర్యాత్ స శ్రీ సూర్యస్యైవ సాయుజ్యం
సరూపతాం సలోకతా మశ్నుతే॥ ఓం తత్సత్॥

## మహాసౌర మంత్రము - 1

ఉదు త్యం జాత వేదసం దేవం వహన్తి కేతవః ।
దృశే విశ్వాయ సూర్యమ్ ॥

**పదపాఠము :**

ఉత్ । ఊంవ్ ఇతి । త్యమ్ । జాత-వేదసమ్ । దేవమ్ । వహన్తి । కేతవః । దృశే । విశ్వాయ । సూర్యమ్ ॥

**సాయణ భాష్యము :**

కేతవః ప్రజ్ఞాపకాః సూర్యాశ్వాః యద్వా సూర్యరశ్మయః సూర్యం సర్వస్య ప్రేరకమాదిత్యముద్వహన్తి। ఊర్ధ్వం వహన్తి। ఉ ఇతి పాదపూరణః । ఉక్తంచ। మితాక్షరేష్వనర్థకాః కమీమిద్వితి. (ని. 1-9) కి మర్థమ్। విశ్వాయ విశ్వస్మై భువనాయ దృశే ద్రష్టుమ్। యథా సర్వేజనాః సూర్యం పశ్యన్తి తథోర్ధ్వం వహన్తీత్యర్థః। కీదృశం సూర్యమ్।త్యం ప్రసిద్ధం జాతవేదసం జాతానాం ప్రాణినాం వేదితారం జాత ప్రజ్ఞం జాతధనం వా దేవం ద్యోతమానమ్॥ అత్ర నిరుక్తమ్। ఉద్వహన్తి తం జాతవేదసం దేవమశ్వాః కేతవో రశ్మయో వా సర్వేషాం భూతానాం సందర్శనాయ సూర్యమ్॥ నిరుక్తం 12- 15॥ ఇతి॥ జాతవేదసమ్। జాతాని వేత్తీతి జాతవేదాః॥ దృశే।దృశే విఖ్యేచ (పా 3-4-11) ఇతి తుమర్థే నిపాతితః॥ (ఋక్ 1-50-1)

వాక్యాన్వయము :

కేతవః త్యం జాతవేదసం దేవం సూర్యం విశ్వాయ దృశే ఉద్వహన్తి॥

ప్రతిపదార్థము :

కేతవః = జండాలు, అనగ సూర్యుని రాకను తెలియచేయు సూర్యాశ్వములు, త్యమ్ = ప్రసిద్ధుడు - సర్వవిదితుడును, జాతవేదసమ్ = పుట్టిన ప్రతి ప్రాణిని గురించి తెలిసినవాడును, దేవమ్ = మిక్కిలిగ ప్రకాశించువాడును. సూర్యమ్= సర్వలోకములను ప్రేరేపించు వాడునగు ఆదిత్యుని, విశ్వాయ దృశే = సర్వలోక దర్శనమునకు, ఉత్ వహన్తి = మీదుగ ఎత్తి చూపుచున్నవి.

జండాలు ఒక వ్యక్తిని గురించిగాని, ఒక సిద్ధాంతమును గాని తెలియచేయును. జండాల రాక అట్టి వ్యక్తుల రాకను తెలియచేయును. ప్రకృతమున కేతు శబ్దముచే సూర్యాశ్వములు చెప్పబడినవి.

సర్వస్తుత్యుండగు ఆదిత్యుడు మిక్కిలి ప్రసిద్ధినొందినవాడు. దానాది గుణ సంపన్నుడు. మిక్కిలిగ ప్రకాశించుచు, ప్రకాశింపచేయు స్వభావము కలవాడు. దేవగన్ధర్వ మనుష్య పశు పక్షి క్రిమి కీటకాది సమస్త జీవుల నెరింగినవాడు. సర్వప్రాణులను తమ తమ కార్యములందు ప్రేరేపించి, నియోగించువాడు. అట్టి మహత్తరమగు సూర్యభగవానునకు సమస్త లోకములు కన్పించునట్లు (అతడు సర్వలోకములకు కనిపించునట్లుగను), అతని రాకను తెలియజేయుటలో కేతువులుగ (జండాలుగ) నున్న అశ్వములు అతనిని మిక్కిలిగ మీదకు ఎత్తి చూపుచున్నవి.

"అట్టి సూర్యునకు నమస్కారము" అని భావము. (1)

# మహాసౌర మంత్రము - 2

అపత్యే తాయవో యథా । నక్షత్రా యన్త్యక్తుభిః ।
సూరాయ విశ్వ - చక్షసే॥

## పదపాఠము :

అప । త్యే । తాయవః । యథా । నక్షత్రా । యన్తి । అక్తుభిః । సూరాయ । విశ్వ్యచక్షసే ।

## సాయణ భాష్యము :

త్యేతాయవో యథా ప్రసిద్ధాస్తస్కరా ఇవ నక్షత్రా నక్షత్రాణి దేవ గృహాణి । దేవగృహా వై నక్షత్రాణి॥ తై. బ్రా 1.5.2.6॥ యద్వా ఇహ లోకే కర్మానుష్ఠాయ యే స్వర్గం ప్రాప్నువన్తి తే నక్షత్రరూపేణ దృశ్యంతే । తథా చ శ్రూయతే । యో వా ఇహ యజతేzముం స లోకం నక్షతే తన్నక్షాత్రాణాం నక్షత్రత్వమ్॥ తై, బ్రా 1-5-2-5 ॥ యద్వా తేషాం సుకృతీనాం జ్యోతీంషి నక్షత్రాణ్యుచ్యన్తే । సుకృతాం వా ఏతాని జ్యోతీంషి యన్నక్షత్రాణి । తై. సం. 5-4-13॥ ఇత్యామ్నానాత్ । యాస్కస్త్వాహ । నక్షత్రాణి నక్షతేర్గతి కర్మణో నేమాని క్షత్రాణీతి చ బ్రాహ్మణం। ని 3-20 ఇతి॥ తథా విధాని నక్షత్రాణ్యక్తుభీ రాత్రిభిః సహోపయంతి । అపగచ్ఛన్తి । విశ్వ చక్షసే విశ్వస్య సర్వస్య ప్రకాశకస్య సూరాయ సూర్యస్యాగమనం దృష్ట్వేతి శేషః । తస్కరా నక్షత్రాణి చ రాత్రిభిః సహ సూర్య అగమిష్యతీతి భీత్యా పలాయన్త ఇత్యర్థః । తాయురితి స్తేన నామ । తాయుస్తస్కర ఇతి తన్నామసు పాఠాత్ । అక్తురితి రాత్రినామ । శర్వర్యక్తురితి తత్ర పాఠాత్॥ (ఋక్ 1-50-2)

వాక్యాన్వయము:

విశ్వ చక్షసే సూరాయ (ఆగమనం దృష్ట్వా) త్యే తాయవః యథా (తథా) అక్తుభి: (సహ) నక్షత్రా అపయన్తి॥

ప్రతిపదార్థము:

విశ్వచక్షసే సూరాయ-ఇచట షష్ఠీ విభక్త్యర్థములో చతుర్థి చెప్పబడినది. కనుక విభక్తి విపరిణామము చేయగ విశ్వచక్షసః= సర్వలోక చక్షువగు, సూరస్య = సూర్యునియొక్క (రాకను చూచి), త్యే = ప్రసిద్ధికెక్కిన, తాయవః యథా = దొంగలవలె; నక్షత్రా = నక్షత్రాణి = నక్షత్రములు; అక్తుభిఃసహ = రాత్రులతో కూడ, అపయన్తి = దూరముగ పోవుచున్నవి.॥

సర్వలోకములను స్వీయ తేజస్సుతో ప్రకాశింపచేయునట్టి సూర్యుని యొక్క రాకను తెలిసికొన్నవై, రాత్రులతోకూడ, నక్షత్రములన్నియు రక్షకభటుల రాకను చూచిన గజదొంగలవలె దూరముగ తొలగి పోవుచున్నవి. అట్లు కేవలము నక్షత్రములె కాదు. వాటితో కూడియున్న రాత్రియు దూరముగ పోవుచున్నది.

లోకములో దొంగలు, దొంగలకాశ్రయమునిచ్చినవారును రక్షకభటులను చూచి భయపడి వారికి దూరముగ పోవుచుందురుకద. అనగ నక్షత్రములను, వానికాశ్రయమునిచ్చు రాత్రులను (చీకట్లు) కూడ పారద్రోలగల శక్తిమంతుడు ఈ సూర్యుడు.

అట్టి సూర్యునకు నమస్కారము అని భావము. (2)

# మహాసౌర మంత్రము-3

అదృశ్రమస్య కేతవో విరశ్మయో జనాగుం అను।
భ్రాజన్తో అగ్నయో యథా॥

**పదపాఠము :**

అదృశ్రమ్ । అస్య । కేతవః । వి । రశ్మయః । జనాన్ । అను । భ్రాజన్తః । అగ్నయః । యథా ॥

**సాయణ భాష్యము :**

అస్య సూర్యస్య కేతవః ప్రజ్ఞాపకాః రశ్మయో దీప్తయో జనానను వ్యదృశ్రమ్। జాతాన్సర్వానను క్రమేణ ప్రేక్షన్తే। సర్వం జగత్ప్రకాశయన్తీత్యర్థః। తత్ర చ దృష్టాన్తః। భ్రాజన్తో దీప్యమానాః అగ్నయో యథా అగ్నయ ఇవ॥ (ఋక్ 1-50-3.)

వాక్యాన్వయము:

అస్య కేతవః రశ్మయః భ్రాజన్తః అగ్నయః యథా జనాన్ అను వ్యదృశ్రమ్॥

ప్రతిపదార్థము:

అస్య = సర్వలోక ప్రేరకుండగు సూర్యుని యొక్క, రశ్మయః = ప్రకాశ వంతమగు, కేతవః = జ్ఞాపక రూపములగు కిరణములు, విభ్రాజన్తః = మిక్కిలిగ ప్రకాశించుచున్నవై, అగ్నయః యథా = అగ్నుల (అగ్నిశిఖలు) వలె, జనాన్ అను = సమస్త జీవులను క్రమముగ, వి-అదృశ్రమ్ = విశేషముగ చూచుచు న్నవి. ప్రకాశింప చేయుచున్నవి.-అని భావము.

సూర్యుని రాకను తెలియచేయు జండాల వలెనున్న కిరణ పుంజములు అగ్నిజ్వాలలవలె మిక్కిలిగ ప్రకాశించు చున్నవై, సర్వలోకములందరి జీవులను, వెలుగొందించు చున్నవి.

అట్టి ఆదిత్యునకు నమస్కారము. (3)

కేతవః రశ్మయః అదృశ్రమ్- ఈవాక్యమున అదృశ్రమ్ అను క్రియా పదము ఉత్తమపురుషైకవచనమందున్నది. కనుక ఇది కర్తృవాచకము అని భావించినచో, కేతవః రశ్మయః అను వానిని కర్మలుగా చేసికొనవలెను. అనగ వానికి ద్వితీయా విభక్త్యంతము చూపి కేతూన్ రశ్మీన్ అదృశ్రమ్ = జండాల వలెనున్న సూర్యరశ్ములను చూచితిని అని చెప్పవలెను. అట్లుకానిచో, అదృశ్రమ్ అనుపదమును కర్మణి ప్రయోగమున ప్రథమపురుష బహువచనముగ మార్చుకొ నవలెను. అనగ ఆ సూర్యరశ్ములు వెలుగొందుచున్నవను అర్థమును చెప్పవలెను. ఎట్లైనను చెప్పుకొనవచ్చును. కాని ఇందులో ప్రథమ పక్షమె ఉత్తమమైనది. లఘుప్రయత్నముతో కార్యము సిద్ధించు చుండగ గురు ప్రయత్నము దోషము గద.

## మహాసౌర మంత్రము-4

తరణిర్విశ్వదర్శితో జ్యోతిష్కృదసి సూర్య।
విశ్వమాభాసి రోచనమ్॥

**పదపాఠము :**

తరణిః । విశ్వ-దర్శతః । జ్యోతిః-కృత్ । అసి । సూర్య । విశ్వమ్ । ఆ । భాసి । రోచనమ్ ॥

హే సూర్య త్వం తరణిస్తరితా అన్యేన గన్తుమశక్యస్య మహతోఽ ధ్వనో గంతాసి। తథా చ స్మర్యతే। యోజనానాం సహస్రే ద్వే ద్వే శతే ద్వేచ యోజనే। ఏకేన నిమిషార్ధేన క్రమమాణ నమోస్తుత ఇతి। యద్వా ఉపాసకానాం రోగాత్తారయితాఽసి। ఆరోగ్యం భాస్కరా దిచ్ఛే దితి స్మరణాత్। తథావిశ్వదర్శతో విశ్వైః సర్వైః ప్రాణిభిర్దర్శ నీయః। యద్వా విశ్వం సకలం భూతజాతం దర్శతం ద్రష్టవ్యం ప్రకాశ్యం యేన స తథోక్తః। తథా జ్యోతిష్కృత్ జ్యోతిషః ప్రకాశస్య కర్తా। సర్వస్య వస్తునః ప్రకాశయితే త్యర్థః। యద్వా చంద్రాదీనాం రాత్రే ప్రకాశ యితా। యస్మాదేవం తస్మాద్విశ్వం వ్యాప్తం రోచనం రోచమానమంతరిక్షం, ఆ సమన్తాత్ భాసి। ప్రకాశయసి। యద్వా హే సూర్య। అంతర్యామితయా సర్వస్య ప్రేరక పరమాత్మన్ తరణిః సంసారాబ్ధేః తారకోఽసి। యస్మాత్త్వం విశ్వదర్శతో విశ్వైః సర్వై ర్ముముక్షుభిః దర్శితో ద్రష్టవ్యః। సాక్షాత్కర్తవ్య ఇత్యర్థః జ్యోతి ష్కృత్ జ్యోతిషః సూర్యాదేః కర్తా। తథా చామ్నాయతే। చంద్రమా మనసో జాతశ్చక్షో స్సూర్యోఽ జాయత (తై. అ. 3-12-6)। ఇతి। ఈ దృశస్త్వం చిద్రూపతయా విశ్వం సర్వం దృశ్యజాతం రోచనం రోచమానం దీవ్యమానం యథాభవతి తథాభాసి। ప్రకాశయసి। చైతన్య స్ఫురణే హి సర్వం జగద్దృశ్యతే। తథాచామ్నాయతే। "తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి॥" (కఠోపనిషత్ 5-15)।

(ఋుక్ 1-50-4)

**వాక్యాన్వయము:**

హే సూర్య (త్వమ్) తరణిః విశ్వదర్శతః జ్యోతిష్కృత్ చ అసి।
(కిం చ) విశ్వం రోచన మాభాసి॥

**ప్రతిపదార్థము:**

హే సూర్య! = సర్వలోక ప్రేరకుండవగు ఓ భాస్కర! (నీవు) తరణిః = త్వరిత గతిని పోవువాడవు. (మమ్ము) దరిచేర్చువాడవు. విశ్వదర్శితః = సర్వప్రాణులచే చూడదగిన వాడవు. జ్యోతిష్కృత్ చ అసి = కాంతిని సృజించు (కలిగించు) వాడవుకూడ. (నీవు) విశ్వమ్ = ఈ ప్రపంచమును (సృష్టిని), రోచనమ్ = మిక్కిలి ప్రకాశవంతమగునట్లుగ, అభాసి = అన్నివైపులనుండి వెలుగొందించుచున్నావు. కాంతితో నింపుచున్నావని భావము.

ఈ సూర్యుడు తరణి. అనగ ఇతరులకెవ్వరికిని సాధ్యముకానంత త్వరిత గతిని పోవువాడు. ఒక్క అర్ధనిమేష కాలములో వేల యోజనముల దూరము పోవు వాడు. అట్లె తరణి అనగ నౌక. దాటించువాడు. ఇతడు తన్నుపాసించు వారలను వారియొక్క శారీరక మానసిక రుగ్మతలనుండి రక్షించి, సంసారసాగరములు తరింపచేయువాడు. కనుకనె సమస్తజీవులు వీనికై చూచుచున్నవి. వీనిని ఉపాసించుచున్నవి. ఇతడు సర్వలోకములకు వెలుగు రేఖలను వెదజల్లుచున్నాడు. గ్రహనక్షత్రములకు ప్రకాశము కల్పించుచున్నాడు.

ఇతడు సమస్త జీవులందు అంతర్యామియై ప్రకాశించుచున్నాడు. జీవుల యొక్క బహిరంత రింద్రియముల యందు తేజస్సు నింపుచు, సర్వము దర్శనీయముగ చేయుచున్నాడు. సమస్త జగత్తును అంధకారమునుంచి రక్షించి, తన తేజస్సుతో ప్రకాశింప చేయుచున్నాడు.

అట్టి సూర్య భగవానునకు నమస్కారము. (4)

## మహాసౌర మంత్రము - 5

ప్రత్యఙ్ దేవానాం విశః ప్రత్యఙ్ఙుదేషి మానుషాన్ ।
ప్రత్యఙ్ విశ్వం స్వర్దృశే ॥

పదపాఠము :

ప్రత్యఙ్ । దేవానామ్ । విశః । ప్రత్యఙ్ । ఉత్ । ఏషి । మానుషాన్ ।
ప్రత్యఙ్ । విశ్వమ్ । స్వః । దృశే ॥

హే సూర్య త్వం దేవానాం విశో మరున్నామకాన్దేవాన్। "మరుతో వై దేవానాం విశః" (తై. సం 2-2-5-7-) ఇతి శ్రుత్యంతరాత్। తాన్మరుత్సంజ్ఞకాన్దేవాన్ ప్రత్యఙ్ ఉదేషి। తాన్ప్రతి గచ్ఛన్నుదయం ప్రాప్నోషి। తేషామభిముఖం యథా భవతి తథేత్యర్థః। తథామానుషాన్మనుష్యాన్ ప్రత్యఙ్ఙుదేషి। తేఽపి యథాఽస్మదభిముఖ ఏవ సూర్య ఉదేతీతి మన్యన్తే। తథా విశ్వం వ్యాప్తం స్వః స్వర్లోకం దృశే ద్రష్టుం ప్రత్యఙ్ఙుదేషి। యథా స్వర్లోక వాసినో జనాః స్వ స్వాభిముఖేన పశ్యన్తి తథోదేషీత్యర్థః। ఏత దుక్తం భవతి। లోకత్రయవర్తినో జనాః సర్వేఽపి స్వస్వాభిముఖ్యేన సూర్యం పశ్యన్తీతి। తథా చామ్నాయతే। తస్మాత్సర్వ ఏవ మన్యతే మాం ప్రత్యుదగాదితి॥

ఋక్ 1-50-5.

వాక్యాన్వయము :

(హే సూర!) త్వం దేవానాం విశః దృశే ప్రత్యఙ్ ఉదేషి॥ మానుషాన్ విశ్వం స్వః దృశే ప్రత్యఙ్ ఉదేషి॥

ప్రతి పదార్థము :

(ఓ సూర్యదేవ) త్వమ్= నీవు, దేవానామ్ = దేవతల యొక్క, విశః =ఇండ్లను, దృశే = చూచుటకు, ప్రత్యఙ్ = తూర్పుదిక్కున, ఉదేషి = ఉదయించుచున్నావు. అట్లే మానుషాన్ = మనుష్యులను (చూచుటకు) ప్రత్యఙ్ ఉదేషి = వారికభిముఖముగ తూర్పుదిక్కున ఉదయించుచున్నావు. విశ్వమ్= సమస్తమగు, స్వః= స్వర్లోకమును, దృశే = చూచుటకు, ప్రత్యఙ్ ఉదేషి = అభిముఖముగ తూర్పున ఉదయించుచున్నావు. (దేవానాం విశః అను దానికి మరుద్దేవతలనియు, నక్షత్రములనియు అర్థములు కలవు.)

ఓ సూర్యదేవ! నీవు మరుద్దేవతలను చూచుటకై వారికెదురుగ తూర్పున ఉదయించుచుంటివి. నక్షత్రమండలములను చూచుటకై వచ్చుచున్నావు. లేదా దేవతా గృహములను వీక్షించుటకై ఉదయించుచుంటివి. అట్లే మనుష్యులను, నీ కొరకై ఎదురుచూచు సర్వప్రాణిలోకమును దర్శించుటకై వారికభిముఖముగ వచ్చుచుంటివి. మిక్కిలిగ వ్యాపించిన స్వర్గలోకమును దర్శించుటకై ఉదయించుచున్నావు.

ఈ విధముగ ప్రతి ఒక్కరు తమ్ము చూచుటకె నీవు వారికభిముఖముగ నుదయించుచుంటివని భావించుచున్నారు.

అంతటి మహాత్ముడవగు నీకు నమస్కారము.

॥ మరుతోవై దేవానాం విశః (తై.సం. 2-2-5-7) (5)

## మహాసౌర మంత్రము-6.

యేనా పావక చక్షసా భురణ్యన్తం ।
త్వం వరుణ పశ్యసి॥

**పదపాఠము :**

యేన । పావక । చక్షసా । భురణ్యన్తమ్ । జనాన్ । అను । త్వమ్ । వరుణ । పశ్యసి ॥

**సాయణ భాష్యము :**

హే పావక సర్వస్య శోధక వరుణానిష్టనివారక, సూర్య!

త్వం జనాన్ జాతప్రాణినో భురణ్యన్తం ధారయంతం, పోషయన్తం వేమం లోకం యేన చక్షసా ప్రకాశేనానుపశ్యసి అను క్రమేణ ప్రకాశయసి। తం ప్రకాశం స్తుమ ఇతి శేషః । యద్వా ఉత్తరస్యా మృచి సంబంధః । తేన చక్షసా వ్యేషీతి । తథా చ యాస్కేనోక్తం-తత్తే వయం స్తుమ ఇతి వాక్యశేషోఽపి వోత్తరస్యామన్వయస్తేన వ్యేషి ॥ (నిరుక్త 12-22) ॥ ఇతి ॥

(ఋక్ 1-50-6)

వాక్యాన్వయము :

హే పావక వరుణ యేన చక్షసా జనాన్ త్వం అనుపశ్యసి (తాదృశ్యం త్వాం వయం స్తుమః).

ప్రతిపదార్థము :

హే పావక = సర్వులను శోధించునట్టి, పవిత్రులుగ చేయునట్టి, వరుణ= అనిష్టములను, అరిష్టములను వారించి కోరిన కోర్కెలనిచ్చెడి ఓ సూర్య! యేన చక్షసా= ఏ నీయొక్క ప్రకాశముచే, త్వమ్= నీవు, జనాన్= ప్రాణులను, అనుపశ్యసి= క్రమముగ చూచుచుంటివో-(చూచుచు క్రమముగ గగనమండలము నధిరోహించుచుంటివో) అట్టి, భురణ్యన్తం క్షిప్రగామివగు నిన్ను మేము స్తుతించుచున్నాము అని వాక్యశేషము.

ఓ అర్యమ! సూర్య! నీవు సర్వప్రాణులు చేయుకర్మలను పరిశోధించువాడవు. వారలను పరిశుద్ధులుగ నొనర్తువు. అనిష్టములను, అరిష్టములను వారించి, జనులు కోరుకొను అన్ని కోర్కెలను తీర్చువాడవు. అందుకై నీవు అమిత వేగముతో పోవుచున్నావు. ఇట్టి నిన్ను మేమందరము నుతించుచున్నాము.

అట్టి ఓ భాస్కర నీకు నమస్కారము.

[ఈ మంత్రమున "వరుణ" అని భోదించుటచే, ఇది సూర్యమంత్రముకాదని భ్రమపడరాదు. మంత్రములందరి దేవతా నిర్ణయమెట్లు చేయవలెనో "నిరుక్త" గ్రంథమందు చెప్పబడినది.ఆ విధముగ పరిష్కరించగ, ఇది సూర్యునుద్దేశించినదేయనియు, వరుణ శబ్దమునకు వాచ్యార్థమునే గ్రహించవలెనని వైదిక పండితలోక నిర్ణయము.] (6)

## మహాసౌర మంత్రము-7

వి ద్యామేషి రజస్పృథ్వహా మిమానో అక్తుభిః।
పశ్యన్జన్మాని సూర్య॥

**పదపాఠము :**

వి । ద్యామ్ । ఏషి । రజః । పృథు । అహా । మిమానః । అక్తు-భిః । పశ్యన్ । జన్మాని । సూర్య ॥

**సాయణ భాష్యము :**

హే సూర్య ! త్వం పృథు విస్తీర్ణం రజో లోకమ్। లోకారజాంస్యుచ్యన్త ఇతి యాస్కః (ని 4-19) కం లోకమ్ । ద్యామన్తరిక్ష లోకమ్। వ్యేషి । విశేషేణ గచ్ఛసి। కిం కుర్వన్ । అహాన్యక్తుభి రాత్రిభిః సహ మిమానః ఉత్పాదయన్। ఆదిత్య గత్యధీనత్వాదహో రాత్రి విభాగస్య । తథా చ జన్మాని జననవంతి భూత జాతాని పశ్యన్ ప్రకాశయన్ (ఋక్ 1-50-7)

వాక్యాన్వయము :

సూర్య! (త్వమ్) అక్తుభిః (సహ) అహా మిమానః
జన్మాని పశ్యన్ పృథురజః ద్యాం వి ఏషి॥

ప్రతిపదార్థము :

సూర్య! = సర్వజీవలోక ప్రేరక! హే ఆదిత్య, (త్వం= నీవు) అక్తుభిః, రాత్రులతో, వెలుగురేఖలతో, అహా= అహాని= దినములను, మిమానః కూర్చుచున్నావు, జన్మాని= పుట్టుచున్నసర్వజీవులను, పశ్యన్ = చూచుచు, పృథు= మిక్కిలి విశాలమగు, రజఃద్యామ్ = రజోయుక్తమగు-చీకట్లతో కూడియున్న (సూర్యుని రాకకు పూర్వము చీకటియెకద) ద్యులోకమును కూర్చి, వి ఏషి= విశేషముగ పోవుచున్నావు.

(అక్తు శబ్దమునకు కాంతి, వెలుగు, అను అర్థములు కూడ కలవు).

రజస్= లోకః, లోకము. (యాస్క నిఘంటూ 4-19).

సర్వ జీవలోకమును ప్రేరేపించు ఓ సూర్యదేవ! నీవు రాత్రులతో కూడిన పగళ్లను లేక అహోరాత్రములతో కూడిన దినములను కల్పించుచున్నావు. అనగ నీ ఉదయాస్తమయముల చేతనె రాత్రింబవళ్ళు ఏర్పడుచున్నవి. నీవు సర్వజీవులను, వారికర్మల నెరుంగుదువు. మరియు నీయొక్క రాకకు పూర్వము అంధకార బంధురమగుచు రజోయుక్తమగు స్వర్లోకమును, అన్తరిక్షమును ప్రకాశింప చేయుటకై మిక్కిలి వేగముగ పయనించు చున్నావు.

అట్టి ఓ భాస్కర! నీకు నమస్కారము. (7)

## మహాసౌర మంత్రము-8

సప్త త్వా హరితో రథే వహంతి దేవ సూర్య।
శోచిష్కేశం విచక్షణ॥

**పదపాఠము:**

సప్త । త్వా । హరితః । రథే । వహన్తి । దేవ । సూర్య । శోచిః-కేశమ్ । విచక్షణ॥

**సాయణ భాష్యము :**

హే సూర్య। దేవ ద్యోతమాన, విచక్షణ సర్వస్య ప్రకాశయితః సప్త సప్త సంఖ్యాకా హరితోऽశ్వా రసహరణశీలా రశ్మయో వా త్వా త్వాం వహన్తి। ప్రాపయంతి । కీదృశమ్। రథేऽ వస్థితమితి శేషః । తథా శోచిష్కేశం శోచీంషి తేజాంసి ఏవ యస్మిన్కేశాః ఇవ దృశ్యన్తే స తథోక్తః ॥ తమ్ ॥ హరిత ఇతి ఆదిత్యాశ్వానాం సంజ్ఞా, హరిత ఆదిత్యస్యేతి నిఘంటావుక్తత్వాత్ ॥

(ఋక్ 1-50-8)

వాక్యాన్వయము :

హే దేవ సూర్య విచక్షణ శోచిష్కేశం త్వా సప్తహరితః రథే వహన్తి॥

ప్రతిపదార్థము :

హే దేవ!= ఓ దీప్తిమంతుడా! సూర్య= సర్వజీవప్రేరక, విచక్షణ = విశేషముగ కాంతితో ప్రకాశింప చేయువాడ! శోచిష్కేశమ్ = వెలుగు రేకలనె శిరోజములుగ గల్గిన, త్వా = త్వాం = నిన్ను, సప్తహరితః = సప్తాశ్వములు, రథే = రథమునందు, వహన్తి= వహించుచున్నవి. ధరించుచున్నవి.

ఓ సూర్య! నీవు మిక్కిలి కాంతిమంతుడవు. సర్వప్రాణులను తమ పనులందు ప్రేరేపించువాడవు. సర్వ జగత్తును నీదియగు విశేష కాంతితో ప్రకాశింప చేయువాడవు. నీ వెలుగు రేఖలనె (కాంతి కిరణములనె) శిరోజములుగ కలిగిన వాడవు. ఇట్టివెలుగు ముద్దవగు ఓ దేవ! నిన్ను సప్తాశ్వములు (హరితములు-సూర్యాశ్వములు) రథమునందు కూర్చుండచేసి, సర్వజగత్తును నీకు చూపుచు, నిన్ను వహించుచున్నవి. సమస్తలోకములందు సూర్యుడు కన్పించునట్లు అవి గగన మండలమును చుట్టి వచ్చుచున్నవని భావము.

ఇంతటి మహాత్మ్యముగల్గిన ఓ భాస్కర నీకు నమస్కారము. (8)

## మహాసౌర మంత్రము-9

**అయుక్త సప్త శుంధ్యువః సూరో రథస్య నప్త్యః।**
**తాభిర్యాతి స్వయుక్తిభిః॥**

**పదపాఠము :**

అయుక్త । సప్త । శుంధ్యువః । సూరః । రథస్య । నప్త్యః । తాభిః । యాతి । స్వయుక్తి-భిః ॥

**సాయణ భాష్యము :**

సూరః సర్వస్య ప్రేరకః సూర్యః శుంధ్యువః శోధికా అశ్వస్త్రియః తాదృశీః సప్త సప్త సంఖ్యాకా అయుక్త । స్వరథేయోజితవాన్ । కీదృశ్యః । రథస్య నప్త్యో న । పాతయిత్ర్యః । యాభిర్యుక్తాభిః రథో యాతి న పతతి తాదృశీభి రిత్యర్థః । స్వభూతాభి స్తాభి రశ్వ స్త్రీభిః । స్వకీయ యోజనేన రథే సంబద్ధాభి ర్యాతి । యజ్ఞగృహం ప్రత్యాగచ్ఛతి । అతస్తస్మై హవిర్దాతవ్యమితి వాక్యశేషః॥

ఋక్ 1-50-9

వాక్యాన్వయము :

సూరః సప్త శున్ధ్యువః రథస్య. అయుక్త। తాః నప్త్యః
తాభిః స్వయుక్తిభిః యాతి॥

ప్రతిపదార్థము :

సూరః = సర్వప్రేరకుండగు సూర్యుడు, సప్త,శున్ధ్యువః = శోధన స్వభావముగల్గిన ఏడు ఆడుగుఱ్ఱములను, రథస్య= రథమునకు, అయుక్త= కట్టెను (తాః = అవి) నప్త్యః = రథమునందున్నవారిని క్రింద పడిపోకుండ వహించునట్టివి. తాభిః= అట్టి, స్వయుక్తిభిః, స్వయముగనె రథమునకు కట్టుబడునట్టి అశ్వములతో (సూర్యుడు) యాతిః = పయనించు చున్నాడు.

సర్వ లోకములను ప్రేరేపించునట్టి ఆదిత్యుడు తన రథమునకు సప్తాశ్వములను కట్టెను. అవి సర్వజీవుల పాపపుణ్యములను శోధించి సూర్యునకు నివేదించును. మరియు, ఆ అశ్వములు రథమందున్న వానికెట్టి ప్రమాదము లేకుండు, అతను క్రిందపడి పోకుండు నట్లు రథమును వహించగలవు. సూర్యుని రథమునకు ఒక్క చక్రమే యుండును కద. కనుక ప్రయాణములో రథము పడి పోకుండ యుండునట్లు కడునేర్పుతో నవి రథమును వహించుచున్నవి. మరియు ఆ అశ్వములు సూర్యుని మనోగతాభిప్రాయము నెరింగి, స్వయముగనె రథమును వహించును. అట్టి విశిష్టములగు సప్తాశ్వములతో కూడిన రథమునందు సూర్యుడు తన గమనమును సాగించుచుండెను.

అట్టి ఓ భాస్కర నీకు నమస్కారము. (9)

విశేషాంశము :

ఈ అశ్వములు సూర్యుని రథమునుండి స్వయముగ ఉద్భవించెను. కనుక యివి రథముయొక్క సంతానము. నప్తీ= కుమార్తె. (అపత్యం స్త్రీ).

నప్తృ శబ్దమునకు మనుమడని అర్థము. సూర్యుడు జలములకు పౌత్రుడు. జలములనుండి అగ్నిపుట్టుచున్నది. దానినుండి సూర్యుడు. కనుక నప్తయగు సూర్యసంబంధి స్త్రీలు "నప్త్యః". ఈ మంత్రమున సూర్యసంబంధియగు ఆడ గుఱ్ఱములు.

నప్త్య :

నడిపించు స్త్రీలు. నేత్ర్యః ఇతి వెంకట మాధవ వ్యాఖ్యా॥

## మహాసౌర మంత్రము-10

ఉద్వయం తమసస్పరి జ్యోతిష్పశ్యంత ఉత్తరమ్।
దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్॥

**పదపాఠము :**

ఉత్ । వయమ్ । తమసః । పరి । జ్యోతిః । పశ్యన్తః । ఉత్-తరమ్ ।
దేవమ్ । దేవత్రా । సూర్యమ్ । అగన్మ । జ్యోతిః । ఉత్-తమమ్ ॥

**సాయణ భాష్యము :**

వయమనుష్ఠాతారః తమసస్పరి తమసి ఉపరి రాత్రేరూర్ధ్వం వర్తమానం తమసః పాపాత్పర్యుపరి వర్తమానం వా । పాపరహితమిత్యర్థః । తథా చామ్నాయతే । ఉద్వయం తమసస్పరీత్యాహ పాప్మా వై తమః పాప్మానమేవాస్మాదపహంతి । తై. సం 5.9.8.6 ఇతి॥ జ్యోతిస్తేజస్వీన ముత్తర ముద్గత తరముత్కృష్టతరం వా దేవత్రా దేవేషు మధ్యే దేవం దానాదిగుణయుక్తం సూర్యం పశ్యన్తః స్తుతిభిర్హవిర్భి శ్చోపాసీనాః సంతః ఉత్తమముత్కృష్ట తమం జ్యోతిః సూర్యరూపమగన్మ । ప్రాప్నవాము । తథా చ శ్రూయతే । అగన్మ జ్యోతిరుత్తమమిత్యాహాసౌ వా ఆదిత్యో జ్యోతిరుత్తమ మాదిత్యస్యైవసాయుజ్యం గచ్ఛతీతి । యుక్తం చైతత్। తం యథా యథోపాసతే తథేవ భవంతీతి శ్రుత్యంతరాత్ ॥

(ఋక్ 1-50-10)

వాక్యాన్వయము:

వయం తమసస్పరి జ్యోతిః ఉత్తరం దేవత్రాదేవం సూర్యం
పశ్యన్తః ఉత్తమం జ్యోతిః ఉదగన్మ॥

ప్రతిపదార్థము:

వయమ్ = నీ భక్తులమగు మేము, తమసః పరి = రాత్రి తర్వాత వచ్చు, జ్యోతిః = తేజస్సుతోకూడినట్టియు, ఉత్తరమ్= మిక్కిలిగ పైకి పోవుచున్నట్టియు, దేవత్రా = దేవతలయందు, దేవమ్= మిక్కిలిగ ప్రకాశించుచున్నట్టి, దానాదిగుణ సంపన్నుడగునట్టి, సూర్యమ్ = సర్వలోక ప్రేరకుడగు అదిత్యుని, పశ్యన్తః = చూచుచున్నవారమై (హవిర్దానాది, పూజోపాసనాదిక్రియలతో), ఉత్తమమ్= ఉత్కృష్టమగు, జ్యోతిః = ఆ తేజస్సునే, తేజోరూపుండగు సూర్యునినె, ఉదగన్మ= పొందుదుము-పొందుచున్నాము గద.

ఓ అదిత్య! రాత్రులు గడువగనె నీ తేజస్సుతో సర్వజీవులను మేల్కొలుపుచు, మిక్కిలిగ గగనమండలము సధిరోహించుచున్నావు. నీవు ప్రకాశశీలురగు దేవతలకు కూడ తేజస్సును కల్పించువాడవు. అట్టి నిన్ను బ్రాహ్మముహూర్తమున మేల్కొని, పరిశుద్ధులమై స్తుతించుచు యజ్ఞ యాగ హవిర్దానాది క్రియలచే నారాధించు మేము జ్యోతిరూపుండవగు నిన్నే చేరెదముగాక. నిన్నె పొందెదముగాక. అనగ మేము మరణానన్తరము సూర్యమండలాన్తర్వర్తియగు విష్ణువు యొక్క సాయుజ్యమును పొందుదుముగాక అని భావము.

అంతటి మహత్త్వమును గల్గిన ఓ భాస్కర! నీకు నమస్కారము. (10)

## మహాసౌర మంత్రము-11

ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాం దివమ్।
హృద్రోగం మమ సూర్య హరిమాణం చ నాశయ॥

**పదపాఠము :**

ఉత్ యన్ । అద్య । మిత్ర-మహః । ఆ-రోహన్ । ఉత్-తరామ్ । దివమ్ । హృత్-రోగమ్ । మమ । సూర్య । హరిమాణమ్ । చ । నాశయ ॥

**సాయణ భాష్యము:**

హే సూర్య సర్వస్య ప్రేరక మిత్రమహః సర్వేషామనుకూల దీప్తియుక్త అద్యాస్మిన్కాల ఉద్యన్ ఉదయంగచ్ఛన్ ఉత్తరాముద్గత తరాం దివమన్తరిక్ష మారోహన్ ఆభిముఖ్యేన ప్రాప్నువన్। యద్వా। దివమన్తరిక్షముత్తరామారోహన్ ఉత్కర్షేణ ప్రాప్నువన్। ఏవం విధస్త్వం మమ హృద్రోగం హృదయగతమాంతరం రోగం హరిమాణం శరీరగతకాంతిహరణశీలం బాహ్యం రోగమ్। యద్వా । శరీరగతం హరిద్వర్ణం రోగప్రాప్తం పైవర్ణమిత్యర్థః। తదుభయమపి నాశయ। మాంస్త్రాతార ముభయవిధా ద్రోగా న్మోచయేత్యర్థః॥ మిత్రమహః మిత్రమనుకూలం మహస్తేజో యస్యాసౌ॥

(ఋక్ 1-50-11)

**వాక్యాన్వయము:**

హే సూర్య! మిత్రమహః అద్య ఉద్యన్ ఉత్తరాం దివం ఆరోహన్ ।
మమ హృద్రోగం హరిమాణం చ నాశయ ॥

**ప్రతిపదార్థము:**

హే సూర్య! = సర్వప్రేరకుండవగు ఓ ఆదిత్య! మిత్రమహః = సర్వజీవులకు అనుకూలమగు వెలుగులనిచ్చు వాడవు. లేదా సర్వమిత్రులకు పూజ్యుడవు. కాంతిమంతులలోకెల్ల గొప్పవాడవు. అట్టి నీవు, అద్య = నేడు, ఉద్యన్ = ఉదయించుచునె, దివం = ద్యులోకము-అన్తరిక్షలోకమును, ఆరోహన్ = అధిరోహించుచున్నవాడవు. అట్టి నీవు, మమ = నాయొక్క, హృద్రోగం = హృదయమందలి అస్వస్థతను, హరిమాణం చ = ఆకుపచ్చని వికారమును కల్గించు "హరిమ" యను వ్యాధినికూడ, నాశయ = నాశనముచేయుము.

సర్వ జీవ, లోక ప్రేరకుండవగు ఓ భాస్కర! నీవు సర్వ లోకములకు అనుకూలమగు కాంతిని ప్రసరించుచున్నావు. అందుకనె మిత్రులందరిచే పూజింపబడుచు, శ్రేష్ఠుడవైతివి. మరియు వెలుగుల చిమ్మెడి జ్యోతిస్సులలోకెల్ల నుత్తముడవు. అట్టి నీవు నేడు ఉదయించుచునె, ప్రచండ వేగముతో సుదూరమందున్న అంతరిక్షలోకమును అధిరోహించుచు అచటకు వెళ్ళుచున్నావు. అట్టి ఓ మహాత్మ! దేవ! నీవు మా హృద్రోగములను, హరిమయను వ్యాధిని కూడ నాశనము చేయుము.

అట్టి ఓ భాస్కర నీకు నమస్కారము.

[శరీరమందలి రక్తము విరిగి, దేహమంతయు ఆకుపచ్చని పొడలు విడుచును. అది ఒకరోగము. దానిని "హరిమ" అందురు] (11)

## మహాసౌర మంత్రము 12

శుకేషు మే హరిమాణం రోపణాకాసు దధ్మసి ।
అథో హారిద్రవేషు మే హరిమాణం ని దధ్మసి ॥

### పదపాఠము:

శుకేషు । మే । హరిమాణమ్ । రోపణాకాసు । దధ్మసి । అథోఇతి ।
హారిద్రవేషు । మే । హరిమాణమ్ । ని । దధ్మసి ॥

### సాయణ భాష్యము:

మే మదీయం హరిమాణం శరీరగతం హరిద్వర్ణస్య భావం శుకేషు తాదృశం వర్ణం కామయమానేషు పక్షిషు, తథా రోపణాకాసు శారికాసు పక్షి విశేషేషు దధ్మసి । స్థాపయామః । అథో అపిచ హారిద్రవేషు హరితాలద్రుమేషు తాదృగ్వర్ణవత్సు మే మదీయం హరిమాణం ని దధ్మసి । నిదధీమహి । సచ హరిమా z త్రై 9వ సుఖేనాస్తామస్మాన్మా బాధిష్టేత్యర్థః ॥

(ఋక్ 1-50-12).

అథో అనునది ఓకారాన్తమగు అవ్యయము. వైదిక ప్రసిద్ధము.

వాక్యాన్వయము :

మే హరిమాణం శుకేషు తథా రోపణాకాసు దధ్మసి । అథో హారిద్రవేషు హరిమాణం ని దధ్మసి ॥

ప్రతిపదార్థము:

మే = నా యొక్క, హరిమాణమ్ = హరిద్వర్ణపు రోగమును, శుకేషు = ఆకుపచ్చని రంగుగల్గిన చిలుకలయందు, రోపణా కాసు = రోపణాకములనెడి పక్షి విశేషములందు, ధధ్మసి = ఉంచుచున్నాము. అథో = మరియు, హారిద్రవేషు = హారిద్రవము-ఇది అత్యంతవేగముతో పోవు పక్షి విశేషము- వీనియందును, లేక, ఆకుపచ్చని తాళవృక్షములందు, హరిమాణం = ఈ హరిమయను రోగమును నిదధ్మసి = నిశ్చయముగ వదలుచున్నాము. విడిచి పెట్టు చుంటిమి.

ఓ ఆదిత్య! సర్వలోక ప్రభు, మా శరీరమందలి "హరిమ" యను రోగమును ఆకుపచ్చని రంగు కలిగిన శుకములందును, రోపణకములను పక్షి విశేషము లందును వదులు చున్నాము. ఓ భాస్కర! మరియు ఆ రోగమును అమితవేగమున పోవు హారిద్రవము లనెడి పక్షులయందు, హరిద్వర్ణములగు తాళ వృక్షములందును ఉంచుచున్నాము.

హరిమయను రోగముచే మా దేహము ఆకుపచ్చగ మారి పోవుచున్నది. అది మాకిష్టము లేదు. కనుక అట్టి మా రోగమును నీవు ఆ వర్ణమును కోరు కొనెడి చిలుకలందు, చటకములందు, వృక్షము లందును నిక్షిప్తముచేసి, మాకు ఆరోగ్యమును, అభీష్టసిద్ధిని కల్గింపు మని భావము. భాస్కరాదిచ్ఛేదారోగ్యమ్ ॥

అట్టి ఓ భాస్కర నీకి నమస్కారము. (12)

## మహాసౌర మంత్రము 13

ఉదగా దయ మాదిత్యో విశ్వేన సహసా సహ ।
ద్విషన్తం మహ్యం రంధయన్మో అహం ద్విషతే రధమ్ ॥

**పదపాఠము :**

ఉత్ ॥ అగాత్ । అయమ్ । ఆదిత్యః । విశ్వేన । సహసా । సహ । ద్విషన్తమ్ । మహ్యమ్ । రంధయన్ । మో ఇతి । అహమ్ । ద్విషతే । రధమ్ ॥

**సాయణ భాష్యము :**

అయం పురోవర్త్యాదిత్యోఽ దితేః పుత్రః సూర్యో విశ్వేన సహసా సర్వేణ బలేన సహోదగాత్ । ఉదయం ప్రాప్తవాన్ । కిం కుర్వన్ । మహ్యం ద్విషన్తం రంధయన్ । మమోపద్రవకారిణం హింసన్ । అపి చాహం ద్విషతే అనిష్టకారిణే రోగాయ మో రధం । నైవ హింసాం కరోమి । సూర్య ఏవ అస్మదనిష్టకారిణం రోగం వినాశయత్విత్యర్థః ॥

విశేషము: మో - ఇది మా, ఉ అను నిపాతద్వయ సముదాయము. దీని అర్థము "మా" నిషేధవాచకార్థమె. (మైవేత్యస్యార్థే) ॥

(ఋక్ 1-50-13)

వాక్యాన్వయము:

అయమాదిత్యః విశ్వేన సహసా సహ ద్విషన్తం మహ్యం రన్ధయన్ ఉద గాత్ । అహం మో ద్విషతే రధమ్ ॥

ప్రతిపదార్థము

అయమ్ = ఈ, అనగ ఎదురుగ కన్పించుచున్న ఈ, ఆదిత్యః = అదితి కుమారుడగు సూర్యుడు, విశ్వేన = సమస్తమగు, సహసాసహ = సాహసౌద్ధత్యముతో, ద్విషన్తమ్ = మమ్ము ద్వేషించు, బాధించు శత్రువును, మహ్యమ్ = నాకొరకు, రన్ధయన్ = బాధించుచు, ఉదగాత్ = ఉదయించెను. కనుక అహమ్ = నేను, ద్విషతే = ద్వేషించువానికొరకు, అనగ వాని నాశము కొరకు, మో రధమ్ = ప్రయత్నించను. హింసనాచరించను.

మన కట్టెదుట ఉదయించుచున్న ఈ సూర్యుడు తమ శక్తి సాహసముల కూడగట్టుకొని, మిక్కిలి ఔద్ధత్యముతో, నా శత్రువులను నశింపచేయుచున్నాడు. కనుక నా శత్రువులను బాధించుటకు నేను వేరుగ ప్రయత్నము చేయను.

అనగ, సూర్యోపాసన చేయు వారికి రోగము లుండవు. శత్రువులుండరు. మరియు నీ ఉపాసకులు ఇతరులను ద్వేషించరాదు. ఇతరులపట్ల శత్రుభావము నొందరాదు. అట్టి ఉపాసకుల నెవరైనను ద్వేషించినను, బాధించినను వారిని ఆ సూర్యభగవానుడే శిక్షించును. కనుక మనము సుఖజీవనము నెరపుటకై సదా సూర్యోపాసనము చేయవలెను. ఈ మంత్రమందలి ద్వితీయార్థము శత్రు నాశక బీజాక్షర సంపుటియనియు, పూర్వమందున్న సార్థ ఋగ్ద్వయము రోగశాంతి మంత్రములనియు మంత్ర శాస్త్రజ్ఞులు చెప్పెదురు.

కనుక నో భాస్కర ! నీకు నమస్కారము. (13)

# మహాసౌర మంత్రము 14

చిత్రం దేవానాముదగా దనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః।
ఆప్రాద్యావాపృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ॥

**పదపాఠము :**

చిత్రమ్ । దేవానామ్ । ఉత్ । అగాత్ । అనీకమ్ । చక్షుః । మిత్రస్య । వరుణస్య । అగ్నేః । ఆ । అప్రాః । ద్యావాపృథివీ ఇతి । అన్తరిక్షమ్ । సూర్యః । ఆత్మా । జగతః । తస్థుషః । చ॥

**సాయణ భాష్యము :**

దేవానామ్ । దీవ్యన్తీతి దేవాః రశ్మయః । తేషాం దేవజనానామేవ, వానీకం తేజః సమూహరూపం చిత్రమాశ్చర్యకరం, సూర్యస్యమండల ముదగాత్ । ఉదయాచలం ప్రాప్తమాసీత్ । కీదృశమ్ । మిత్రస్యవరుణస్యాగ్నేశ్చ, ఉపలక్షణమేతత్, తదుపలక్షితానాం జగతాం చక్షుః ప్రకాశకం చక్షురిన్ద్రియస్థానీయం వా । ఉదయం ప్రాప్య చ ద్యావాపృథివీ దివం పృథివీ మన్తరిక్షం చాప్రాః । స్వకీయేన తేజసా ఆ సమంతా దపూరయత్ । ఈః దృగ్భూతమండలాంతర్వర్తీ సూర్యోఽన్తర్యామితయా సర్వస్య ప్రేరకః పరమాత్మా జగతో జంగమస్య తస్థుషః స్థావరస్య చాత్మా స్వరూపభూతః । సహి సర్వస్య స్థావర జంగమాత్మకస్య కార్యవర్గస్య కారణమ్ । కారణాచ్చ కార్యం నాతిరిచ్యతే । తథా చ పారమర్షం సూత్రం । తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః । [వేదాం 2-1-14 ॥] ఇతి ॥ యద్వా । స్థావరజంగ మాత్మకస్య సర్వస్య ప్రాణిజాతస్య జీవాత్మా । ఉదితే హి సూర్యే మృతప్రాయం సర్వం జగత్పునశ్చేతనయుక్తం సదుపలభ్యతే । తథాచ శ్రూయతే । యోఽసౌ తపన్నుదేతి స సర్వేషాం భూతానాం ప్రాణానాదాయోదేతి ॥ తై.ఆ. 1-14-1. ॥ ఇతి ॥

(ఋక్ 1-115-1)

వాక్యాన్వయము :

చిత్రం దేవానా మనీకం ఉదగాత్ । (తదేవ) మిత్రస్య, వరుణస్య అగ్నేః (చ) చక్షుః । తత్ ద్యావా పృథివీ అన్తరిక్షం ఆప్రాః । సూర్యః జగతః తస్థుషశ్చ ఆత్మా॥

ప్రతిపదార్థము :

చిత్రమ్ = (ఈ చెప్పబోవువిషయము) ఆశ్చర్యకరమైనది. ఆహ్లాదకరమైనది. అదేదనగ, దేవానామ్ = తేజోవంతములగు కిరణముల యొక్క, అనీకమ్ = సముదాయము, ఉదగాత్ = మీదకు వచ్చుచున్నది. ఆ సూర్యతేజస్సుయే, మిత్రస్య వరుణస్య అగ్నేః(చ) = మిత్రవరుణాగ్నుల యొక్క, చక్షుః = నేత్రము. అనగా వారికి కూడ దర్శన శక్తి నిచ్చునది. ఈ కాంతియే, ద్యావా పృథివీ అన్తరిక్షమ్ = స్వర్లోక భూలో కాన్తరిక్ష లోకములను, ఆప్రాః = అన్నివైపుల నుండి ప్రకాశింప చేయుచు, పూరించుచున్నది. అట్టి, సూర్యః = సూర్యుడు, జగతః తస్థుషశ్చ = స్థావర జంగమ రూపమగు జీవుల యొక్క, ఆత్మా = జీవము, ప్రాణము.

అహో! ఆశ్చర్యము. దీప్తివంతములగు వెలుగు జిలుగుల సాముదాయిక కాంతియే, ఉదయించుచున్నది. ఆ తేజస్సే మిత్రా, వరుణాగ్నుల యొక్క కాంతి. లేదా వారికి మార్గ దర్శనము చేయు నేత్ర స్థానమందలి తేజస్సు. ఆయా సూర్యరశ్మిలే ముల్లోకములను అన్ని వైపుల నుండి పూర్తిగ ఆవరించి కాంతి వంతముగా చేయుచున్నవి. నిజమునకు స్థావర జంగమరూపమగు ఈ జగత్తునంతకును ఆ సూర్యుని వెలుగులే, కాంతియే, ప్రాణమై, ఆత్మయై యున్నది.

అట్టి ఓ దేవ! భాస్కర! నీకు నమస్కారము. (14)

## మహాసౌర మంత్రము 15

సూర్యో దేవీముషసం రోచమానాం మర్యో న యోషామభ్యేతి పశ్చాత్। యత్రా నరో దేవయంతో యుగాని వితన్వతే ప్రతి భద్రాయ భద్రమ్॥

**పదపాఠము :**

సూర్యః । దేవీమ్ । ఉషసమ్ । రోచమానామ్ । మర్యః । న । యోషామ్ । అభి । ఏతి । పశ్చాత్ । యత్ర । నరః । దేవ యన్తః । యుగాని । వి-తన్వతే । ప్రతి । భద్రాయ । భద్రమ్॥

**సాయణ భాష్యము:**

సూర్యః దేవీం దానాది గుణ యుక్తాం, రోచమానాం దీప్య మానాముషసం పశ్చాదభ్యేతి । ఉషసః ప్రాదుర్భావానంతరం తామభిలక్ష్య గచ్ఛతి । తత్ర దృష్టాన్తః । మర్యో న యోషామ్ । యథా కశ్చిన్మనుష్యః శోభనావయవాం గచ్ఛంతీం యువతిం స్త్రియం సతతమను గచ్ఛతి తద్వత్ । యత్ర యస్యాముషసి జాతాయాం దేవయన్తో దేవంద్యోతమానం సూర్యం యష్టు మిచ్ఛన్తో నరో యజ్ఞస్య నేతారో యజమానాః యుగాని । యుగ శబ్దః కాలవాచీ । తేన చ తత్ర కర్తవ్యాని కర్మాణి లక్ష్యన్తే, యథా దర్శపూర్ణమాసావితి । అగ్నిహోత్రాది కర్మాణి వితన్వతే । విస్తారయన్తి । యద్వా । దేవయంతో దేవయాగార్థం ధనమాత్మన ఇచ్ఛన్తో యజమాన పురుషా యుగాని హాలావయవభూతాని, కర్షణాయ, వితన్వన్తే ప్రసారయన్తి । తాముషసమనుచ్ఛతీత్యర్థః । ఏవం విధం భద్రం కళ్యాణం సూర్యం ప్రతి భద్రాయ కళ్యాణరూపాయ, కర్మఫలాయ స్తుమః ఇతి శేషః । యద్వా । దేవయంతో దేవకామాః యజమానాః యుగాని యుగాని భూత్వా పత్నిభిః సహితాః సంతో, భద్రం కల్యాణ మగ్నిహోత్రాదికం కర్మ భద్రాయ తత్ఫలార్థం ప్రతి ప్రత్యేకం యస్యాముషసి ప్రవృత్తాయాం వితన్వతే విస్తారయన్తి ॥

(ఋక్ 1-115-2)

వాక్యాన్వయము:

సూర్యః దేవీముషసం రోచమానాం మర్యః న యోషా మభ్యేతి । యత్ర నరః భద్రం దేవయన్తః యుగాని వితన్వతే (తాని) భద్రాణి ప్రతి భద్రాయ (భవన్త్వితి స్తుమః)॥

ప్రతిపదార్థము :

సూర్యః = సూర్యుడు, రోచమానామ్ = దీప్తి వంతమగు, దేవీం = దానాదిగుణసంపన్నయునగు, ఉషసమ్ = ఉషఃకాంతను, యోషామ్ = ఆహ్లాదకరమగు యువతిని, మర్యో న = (వెంబండించు) పురుషునివలె, పశ్చాత్ = వెనుకనుండి, అభ్యేతి = అనుసరించి పోవుచున్నాడు. మరియు, యత్ర = ఎచట, నరః = మనుజులు, భద్రమ్ = మంగళకరుడగు సూర్యుని, దేవయన్తః = దైవముగా భావించువారై, యుగాని = అగ్నిహోత్రాదికర్మలను, వితన్వతే = వృద్ధిచేయు చున్నారో, తాని భద్రాణి = అట్టి మంగళ కార్యములు ప్రతి భద్రాయ = తిరిగి వారి కళ్యాణములకే అగుకాక యని ప్రార్థించుచున్నామని భావము.

సుందరి యగు స్త్రీని కామాతురుండగు పురుషుడు వెంబడించినట్లు, తేజశ్శాలినియు, దానాదిగుణసంపన్నయునగు ఆ ఉషఃకాంతను సూర్యుడనుసరించి పోవుచున్నాడు. మరియు అట్లు పోవుచున్న మంగళకరుడును, దానశీలియునగు ఆదిత్యుని దైవముగా పూజింపగోరుచున్న, ఉపాసకులు వానికర్పించు అగ్నిహోత్రాది హవ్యములన్నియు, మరల వారి శ్రేయస్సునకే యగుచున్నవి.

మానవులు వారి శ్రేయస్సును కోరి, భగవంతునకు చేయు సేవలన్నియు సర్వమానవ కల్యాణ రూపమున తిరిగి వారినే చేరును. కనుక మనమెల్ల ప్పుడూ దైవపూజను చేయుచు ధర్మము నాచరించ వలెను.

కనుక అట్టి ఓ భాస్కర! నీకు నమస్కారము. (15)

## మహాసౌర మంత్రము 16

భద్రా అశ్వా హరితః సూర్యస్య చిత్రా ఏతగ్వా అనుమాద్యాసః । నమ-
స్యంతో దివ ఆ పృష్ఠమస్థుః పరి ద్యావాపృథివీ యంతి సద్యః॥

**పదపాఠము :**

భద్రాః । అశ్వాః । హరితః । సూర్యస్య । చిత్రాః । ఏత- గ్వాః । అను-మాద్యాసః । నమస్యంతః । దివః । ఆ । పృష్ఠమ్ । అస్థుః । పరి । ద్యావాపృథివీ ఇతి । యన్తి । సద్యః ॥

**సాయణ భాష్యము:**

భద్రాః కల్యాణాః । అశ్వా ఏతగ్వా ఇత్యేత దుభయం అశ్వనామ । తత్రైకం క్రియాపరం యోజనీయమ్ । అశ్వాస్తురగా వ్యాపన శీలావా హరితో హర్తారశ్చిత్రా విచిత్రావయవా అనుమాద్యాసోఽను క్రమేణా సర్వే స్తుత్యాః మాద నీయాః ఏవం భూతాః సూర్యస్యైతగ్వా అశ్వాః । యద్వా । ఏతం గంతం మార్గం గంతారో అశ్వాః । ఏతం శబలవర్ణం వా ప్రాప్నువంతోఽశ్వాః । నమ స్యన్తోఽశ్వాభిర్నమస్య మానాః సంతో దివ్యోఽ న్తరిక్షస్య పృష్ఠము పరి ప్రదేశం పూర్వ భాగలక్షణ మాస్థుః । ఆ తిష్ఠంతి ప్రాప్నువన్తి । యద్వా । హరితో రసహరణశీలాః రశ్మయో భద్రాది లక్షణ విశిష్టా దివః పృష్ఠం నభః స్థల మాతి ష్ఠంతి । ఆస్థాయ చ ద్యావాపృథివీ ద్యావా పృథివ్యౌ సద్యస్తదానీ మేవైకే నాహ్నా పరియన్తి । పరితో గచ్ఛన్తి । వ్యాప్నువంతీత్యర్థః॥

(ఋక్ 1-115-3)

వాక్యాన్వయము :

భద్రాః అశ్వాః హరితః చిత్రాః సూర్యస్య ఏతగ్వాః అనుమాద్యాసః నమస్యన్తః దివః పృష్ఠం ఆ అస్థుః । (కించ) ద్యావా పృథివీ సద్యః పరియన్తి॥

ప్రతిపదార్థము :

భద్రాః = కల్యాణకరములగు; అశ్వాః = వ్యాపనశీలులు; హరితః= హరిద్వర్ణము కలవియు; చిత్రాః = విచిత్రములగు అవయవములను కల్గినట్టియు, సూర్యస్య ఏతగ్వాః = సూర్యుని యొక్క గుర్రములు, అనుమాద్యాసః = క్రమముగ ఆహ్లాదము పొందుచు, నమస్యన్తః = మాచే నమస్కరింపబడినవై, దివః = అంతరిక్షము యొక్క, పృష్ఠమ్ = మధ్యభాగమును, ఆ అస్థుః = అన్ని విధముల నాలోహించుచున్నవి. అట్టి ఆ గుర్రములు, ద్యావాపృథివీ = స్వర్లోక భూలోకములందు, సదః = ఒకే కాలమున, పరియన్తి = అన్ని వైపుల నుండియు పోవుచున్నవి.

ఈ సూర్యాశ్వములు కల్యాణకరములు. సర్వత్ర వ్యాపించి యుండునవి. హరిద్వర్ణము కలిగినవి. విచిత్రమగు దేహసౌందర్యము కలిగినవి. అట్టి ఈ అశ్వములు, సూర్యునుద్దేశించి, తదుపాసకులు చేయు స్తోత్రాదులకు మిక్కిలి ఆనందించుచు, మాచే నమస్కరింపబడుచున్నవి. ఇట్లు ఆ గుర్రములు నభోమండల మధ్యభాగమును చేరుచున్నవి. మరియు నివి స్వర్లోకభూలోకములను ఏక కాలమునందే అన్ని వైపుల నుండి చుట్టుకొనుచు దీప్తివంతముగ చేయుచున్నవి.

అట్టి అశ్వములను కలిగిన ఓ భాస్కర! నీకు నమస్కారము. (16)

## మహాసౌర మంత్రము 17

తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యా కర్తోర్వితతం సంజభార।
యదేదయుక్త హరితః సధస్థాదాద్రాత్రీ వాసస్తనుతే సిమస్మై॥

పదపాఠము :

తత్ । సూర్యస్య । దేవ-త్వమ్ । తత్ । మహి-త్వమ్
మధ్యా । కర్తోః । వి-తతమ్ । సమ్ । జభార । యదా ।
ఇత్ । అయుక్త । హరితః । సధ-స్థాత్ । ఆత్ । రాత్రీ ।
వాసః । తనుతే । సిమస్మై ॥

సాయణ భాష్యము

సూర్యస్య సర్వప్రేరకస్యాదిత్యస్య, తద్దేవత్వమీశ్వరత్వం । స్వాతంత్ర్యమితి యావత్। మహిత్వం మహత్త్వం మహత్త్వం చ తదేవ। తచ్ఛబ్దశ్రు తేర్యచ్ఛబ్దాధ్యాహారః। యత్కర్తోః। కర్మ నామైతత్। ప్రారబ్ధావసమాప్తస్య కృష్యాది లక్షణస్య కర్మణోమధ్యా మధ్యేఽపి సమాప్త ఏవ తస్మిన్కర్మణి వితతం విస్తీర్ణం స్వకీయం రశ్మిజాలమస్తం గచ్ఛన్ సూర్యః సంజభార అస్మాల్లోకాత్స్వాత్మన్యేవ సంహరతి। కర్మకరశ్చ ప్రవృత్తమపి సమాప్తమేవ విసృజత్యస్తం యంతం సూర్యం దృష్ట్వా। ఈదృశం స్వాతంత్ర్యం మహిమా చ సూర్యవ్యతిరిక్తస్య కస్యాస్తి? న కస్యాపి। అపి చ । ఇదిత్యవధారణే। యదేదస్మిన్నేవ కాలే హరితో రసహరణశీలాన్ స్వ రశ్మీన్ హరిద్వర్ణానశ్వాన్వా సధస్థాత్ సహస్థానాత్ అస్మాత్ పార్థివాల్లోకాత్ అదాయాయుక్త అన్యత్ర అన్యత్ర సంయుక్తాన్కరోతి। యద్వా । యుజః కేవలోపి విపూర్వోద్రష్టవ్యః। యదేవాసౌ స్వరశ్మీన్ అశ్వాన్వా సధస్థాత్॥ సహతిష్ఠంత్య స్మిన్నితి సధస్థోరథః। తస్మాదయుక్త। అముంచత్॥

ఆత్ అనంతరమేవ రాత్రీ నిశా వాస ఆచ్ఛాదయిత్రు తమః సిమస్మై। సిమ శబ్దః సర్వశబ్ద పర్యాయః। సప్తమ్యర్థే చతుర్థీ। సర్వస్మిన్ లోకే తనుతే విస్తారయతి। యద్వా। వాసో వాసర మహః। తత్సర్వ స్మాదస్మాల్లో కాదపనీయ రాత్రీ తమస్తనుతే। తత్ర నిరుక్తమ్। తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వమ్। మధ్యే యత్కర్మణాం క్రియమాణానాం వితతం సంహ్రియతే యదాసావయుక్త హరణానా దిత్యరశ్మీన్ హరితో z శ్వానితి వా। అథ రాత్రీ వాసస్తనుతే సిమస్మై వాసరమహరవయువతీ సర్వస్మాత్ ॥ని 4-11॥

(ఋక్ 1-115-4)

వాక్యాన్వయము :

తత్ సూర్యస్య దేవత్వమ్। తత్ మహిత్వమ్। (యత్) కర్తోః మధ్యా వితతం సంజభార। ఇతి। (కించ) యదా హరితః సధస్థాత్ అయుక్త ఆత్ రాత్రీ వాసః సిమస్మై తనుతే॥

ప్రతిపదార్థము :

సూర్యస్య = సర్వలోక ప్రేరకుండగు ఈ సూర్యుని యొక్క, తత్ = అది ఈ చెప్పబోవున దేవి కలదో అదియె, దేవత్వమ్ = అతని యొక్క సర్వ స్వాతంత్ర్య ప్రభు శక్తి, తత్ = అదియె, మహిత్వమ్ = ఆధిక్యత, అదివి దియనగ, అతడు, కర్తోఃమధ్యే = లోకమందు జనులు కృష్యాది కార్యములను ప్రారంభించి, పూర్తి చేయుటకు ముందుగనె (కృష్యాది కార్యములు సగములో అసంపూర్తిగా నుండగనె), వితతం = అంతవరకు సర్వత్ర విస్తారముగ వెదజల్లిన దానిని (తన కిరణములను), సంజభార = ఉపసంహరించును. (వెనుకకు తీసికొనును) మరియు, యదా = ఎప్పుడైతే, సూర్యుడు తన, హరితః = అశ్వములను, సధస్థాత్ = రథము నుండి, అయుక్త = విడుచునో (రథము నుండి గుఱ్ఱములను విప్పివదలి వేయునో), ఆత్ = తదనంతరమె, రాత్రీ = నిశాకన్య, వాసం = (నల్లని అంధకారమనెడు) వస్త్రమును, సిమస్మై = అంతటను, లోకమందెల్ల, తనుతే = విస్తరిల్ల చేయును.

సూర్యుని మహత్త్వము, స్వాతంత్ర్యము, శక్తియు చాలగొప్పవి. అనితర సాధ్యములు. అతడు తను కోరినపుడు తన కిరణముల నెల్లెడల ప్రసరింపచేయును. తను భావించినచో వానిని వెనుకకు తీసుకొనగలడు. అతడు ఇతరుల ఆజ్ఞలను పాటించువాడుకాడు. కనుకనె కృషీవలుల కార్యము పూర్తిగాకున్నను మధ్యలోనె - (అనగ మనము చేయు పనులతో నిమిత్తము లేకుండ)

తన కిరణముల నుపసంహరించు కొనును. తన ఇంటికి పోయి తన రథమునకు కట్టిన అశ్వములను, విప్పివదలి వేయును. ఈ విధముగ సూర్యుడు భూమండలమునుండి తన్ను ఉపసంహరించుకొనగనె, రాత్రి (నిశాకన్య) - చీకట్లను (తన నల్లని వస్త్రమును) ఈ జగమునంత విస్తరింపచేయును. సూర్యుడు తెల్లని కాంతులను వెదజల్లును. ఈ నిశాకన్య నల్లని చీకట్లను వెదజల్లును. అయితే సూర్యుడు వెనుకకు పోయిన తర్వాతనె, ఈ రాత్రి కన్య తన కార్యమును ప్రారంభించును.

ఇట్లు సర్వశక్తిమంతుడు, సర్వతంత్ర స్వతంత్రుడు అనంత శక్తి యుతుడవగు ఓ ఆదిత్య! నీకు నమస్కారము. (17)

## మహాసౌర మంత్రము18

తన్మిత్రస్య వరుణస్యాభిచక్షే సూర్యో రూపం కృణుతే ద్యోరుపస్థే।
అనంతమన్యద్రుశదస్య పాజః కృష్ణమన్యద్ధరితః సం భరన్తి॥

**పదపాఠము :**

తత్ । మిత్రస్య । వరుణస్య । అభి-చక్షే । సూర్యః । రూపమ్ । కృణుతే । ద్యోః । ఉప-స్థే । అనన్తమ్ । అన్యత్ । రుశత్ । అస్య । పాజః । కృష్ణమ్ । అన్యత్ । హరితః । సమ్ । భరన్తి ॥

**సాయణ భాష్యము :**

తత్ తదానీముదయ సమయే మిత్రస్య వరుణ స్యైతదుభయోప లక్షి తస్య సర్వస్య జగతోభిచక్ష అభిముఖ్యేన ప్రకాశనాయ ద్యోర్నభస ఉపస్థ ఉపస్థానే మధ్యే సూర్యః సర్వస్య ప్రేరకః సవితా రూపం సర్వస్య నిరూపకం ప్రకాశకం తేజః కృణుతే। కరోతి। అపి చాస్య సూర్యస్య హరితో రసహరణ శీలా రశ్మయః హరిద్వర్ణా అశ్వా వానన్త మవసాన రహితం కృత్స్నస్య జగతో వ్యాపకం రుశద్దీ ప్యమానం శ్వేత వర్ణం। పాజః బలనామైతత్। బలయుక్త మితి బలస్యాపినైశస్య తమసో నివారణే సమర్థ మన్యత్తమసో విలక్షణం తేజః సం భరన్తి॥ అహాని స్వకీయాగమనేన నిష్పాదయంతి। తథా కృష్ణం కృష్ణ వర్ణ మన్యత్తమః స్వకీ యాపగమనేన రాత్రౌ। అస్య రశ్మ యోప్యేవం కుర్వన్తి కిము వక్తవ్యం తస్య మాహాత్మ్యమితి సూర్యస్య స్తుతిః ॥ (ఋక్ 1-115-5)

వాక్యాన్వయము :

తన్మిత్రస్య వరుణస్యాభిచక్షే। ద్యోః ఉపస్థే సూర్యః రూపం కృణోతి। అస్య హరితః అనంతం రుశం పాజః అన్యత్ సంభరన్తి కృష్ణ మన్యత్॥

ప్రతిపదార్థము :

తత్ = అప్పుడు అనగ సూర్యుడు భూమండలము నుండి తన కాంతిని ఉపసంహరించిన తర్వాత, మిత్రస్య వరుణ స్య = మిత్రావరుణుల యొక్క, అభి చక్షే = అత్యధిక ప్రకాశము కొరకు, ద్యోః । అంతరిక్ష లోకము యొక్క, ఉపస్థే = మధ్యభాగమును, సూర్యః = ఈ భాస్కరుడు, రూపమ్ = తన స్వస్వరూపమును - వెలుగు రేఖలను, కృణుతే = చేయుచున్నాడు. వెదజల్లు చున్నాడు. అస్య = సూర్యుని యొక్క, హరితః = అశ్వములు, అన్యత్ = ఒకప్పుడు, పాజః = శక్తివంతమగు, అనన్తం రుశమ్ = అత్యధికమగు వెలుగును, సంభరన్తి = అంతటను నింపుచున్నవి. అట్లే, అన్యత్ = మరొకపుడు, కృష్ణం (రుశమ్) = నల్లనికాంతులను, చీకట్లను-(సంభరన్తి).

మిత్రా వరుణులు సర్వలోకములను చూచుటకు తగిన శక్తిని, సూర్యుడు నభో వీధి నుండి కిరణ ప్రసార రూపమును అందించు చున్నాడు. మరియు సూర్యాశ్వములు తమ ప్రయాణ కాలమందు సర్వత్ర వెలుగు జిలుగుల నింపుచు పగటిని చేయుచున్నవి. అట్లే అవి విశ్రమించునపుడు తమ దేహము నుండి ప్రపంచ మంతటను నిశా కాంతులను నింపుచు - రాత్రిని సృష్టించు చున్నవి. అవి ప్రయాణించు మార్గమున వాని దేహమునుండి వచ్చు కాంతులచే పగలు ఏర్పడును. అవి ఆ ప్రదేశమును దాటి ముందుకుపోవగనె ఆ ప్రదేశమున నల్లని కాంతులు వ్యాపించు చీకట్లతో నిండి యుండును.

ఇంతటి మహాత్ముడవగు ఓ భాస్కర! నీకు నమస్కారము. (18)

# మహాసౌర మంత్రము 19

అద్యా దేవా ఉదితా సూర్యస్య నిరంహసః పిపృతా నిరవద్యాత్ ।
తన్నో మిత్రో వరుణో మామహన్తా మదితిః సింధుః పృథివీ ఉతద్యౌః॥

## పదపాఠము :

అద్య । దేవాః । ఉత్-ఇతా । సూర్యస్య । నిః । అంహసః పిపృత । నిః । అవద్యాత్ । తత్ । నః । మిత్రః వరుణః । మమహన్తామ్ । అదితిః । సిన్ధుః । పృథివీ । ఉత । ద్యౌః ॥

## సాయణ భాష్యము :

హే దేవాః ద్యోతమానాః సూర్య రశ్మయః అద్యాస్మిన్కాలే సూర్యస్యాదిత్య స్యోదితా ఉదితావుదయే సతీస్తతః ప్రసరంతో యూయమస్మానంహసః పాపాన్నిష్పిపృత నిష్కృష్య పాలయత। యదిద మస్మాభిరుక్తం నోఽస్మదీయం తన్మిత్రాదయః షడ్దేవతాః మమహన్తాం పూజయన్తు । అనుమన్యన్తామ్। రక్షంత్వితి యావత్। మిత్రః ప్రమీతే స్త్రాయకోఽహరభిమానీ దేవః। వరుణోఽనిష్టానాం నివారయితా రాత్ర్యభిమానీ। అదితి రఖండనీయాఽదీనా వా దేవమాతా। సింధుః స్యన్దన శీలోదకాభిమానినీ దేవతా। పృథివీ భూలోకస్యాధిష్ఠాత్రీ ద్యౌర్ద్యులోకస్య। ఉత శబ్దః సముచ్చయే॥ (ఋక్ 1-115-6)

వాక్యాన్వయము :

హే దేవాః అద్య సూర్యస్య ఉదితా నః అంహసః నిః పిపృత అవద్యాత్ (చ) నిః (పిపృత) తత్ నః మిత్రః వరుణః అదితిః సిన్ధుః పృథివీ ద్యౌః ఉత మమః హన్తామ్॥

ప్రతిపదార్థము :

హే దేవాః = వెలుగుల చిమ్మెడి ఓ సూర్య కిరణములార! మీరు, అద్య = ఇపుడే - అనగ ఈ ఉదయ కాలమునందె, సూర్యస్య ఉదితా = సూర్యోదయ కాలముననె, మా యొక్క, అంహసః = శారీరక పాపముల నుండి, నిఃపిపృత = వేరు చేసి పాలింపుడు. అట్లే, అవద్యాత్. చ = వాచికమగు పాపము నుండియు, నిఃపిపృత = వేరు చేసి పాలింపుడు. నః = మాయొక్క, తత్ = ఆ విధమగు ప్రార్థనను, మిత్రః = అహరభి మానియగు మిత్రుడును, వరుణః = అరిష్టనివారకుండగు వరుణుడును, అదితిః = దైన్యహీనయగు దేవమాతయు, సిన్ధుః = సలిల ప్రవాహములును, పృథివీ ద్యౌః = భూలోక స్వర్లోకములును, ఉత = ఈ యందరు, మామహన్తామ్ = ఆమోదించి మమ్ము రక్షింతురు గాక ॥

మహత్తర ప్రకాశశీలురగు ఓ ఆదిత్య తేజస్సుల్లారా। ఈ సూర్యోదయ కాలమునందె మీరు మా యొక్క శారీరక, మానసికములగు పాపముల నుండి మమ్ము రక్షించుడు. వానిని మా నుండి దూరముగ పారద్రోలుడు. ఈ మా ప్రార్థనను అహరభిమానియగు మిత్రుడు, సర్వారిష్ట పరిహారకుండగు వరుణుడు, దేవమాతయగు అదితియు, స్వర్లోక భూ లోకములు, సలిల ప్రవాహ రూప మగు సింధువు కూడ ఆమోదింతురు గాక. వారెల్లరు మా పాపముల నుండి మమ్ము రక్షించి పాలింతుర గాక అని ప్రార్థించు చున్నాము.

ఈ ప్రార్థనలకు ఓ సూర్య నీవె సాక్షివి.

అట్టి నీకు నమస్కారము. [19]

ఇన్ద్రం మిత్రం వరుణ మగ్నిమాహు రథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్।
ఏకం సద్విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరి శ్వాన మాహుః॥

పదపాఠము :

ఇంద్రమ్ । మిత్రమ్ । వరుణమ్ । అగ్నిమ్ । ఆహుః । అథో ఇతి । దివ్యః । సః । సు-పర్ణః । గురుత్మాన్ । ఏకమ్ । సత్ । విప్రాః । బహుధా । వదన్తి । అగ్నిమ్ । యమమ్ । మాతరిశ్వానమ్ । ఆహుః ॥

సాయణ భాష్యము :

అము మాదిత్య మైశ్వర్య విశిష్ట మిన్ద్ర మాహుః తథా మిత్రం ప్రమీతేః। మరణా త్త్రాతార మహరభిమానిన మేతన్నామకం దేవం తమాహుః వరుణం పాపస్య నివారకం రాత్ర్యభిమానినం దేవమాహుః। తథాగ్ని మంగనాది గుణ విశిష్ట మే తన్నామక మాహుః। అథో అపిచాయమేవ దివ్యో దివి భవః సుపర్ణః సుపతనో గరుత్మాన్ గరణవాన్పక్షవాన్వా। ఏతన్నామకో యః పక్ష్యస్తి సోయ మేవ। కథమేకస్య నానాత్వ ముచ్యతే। అము మేవాదిత్య మేకమేవ వస్తుతః సన్తం విప్రా మేధావినో దేవతాత్వవిదో బహుధా వదన్తి। తత్తత్కార్య కారణే నేంద్రా ద్యాత్మానం వదన్తి। ఏకైవ వా మహానాత్మా దేవతా స సూర్య ఇత్యా చక్షత ఇత్యుక్తత్వాత్। కించ తమేవ వృద్ధ్యాది కారణం వైద్యుతాగ్నిం యమం నియంతారం మాతరి శ్వాన మంతరిక్షే శ్వసంతం వాయు మాహుః సూర్యస్య బ్రహ్మణోఽ నన్యత్వేన సర్వాత్మ్యముక్తం భవతి॥

అయం మన్త్రో నిరుక్త ఏవం వ్యాఖ్యాతః। ఇమమే వాగ్నిం మహాన్త మాత్మాన మేక మాత్మానం బహుధా మేధావినో వదన్తి ఇన్ద్రం మిత్రం వరుణ మగ్నిం దివ్యం చ గరుత్మన్తమ్। దివ్యో దివిజో। గరుత్మాన్ గరణవాన్ గుర్వాత్మా మహాత్మేతి వా॥ (నిరుక్త 7-18) ఇతి ॥ (ఋక్ 1-164-46)

వాక్యాన్వయము :

అము మాదిత్యమేవ మేధావినః బహుప్రకారం వదన్తి॥ తద్యథా ఇంద్రం వరుణం అగ్నిం ఆహుః అథో సః సుపర్ణః గరుత్మాన్। ఏకం సత్ విప్రాః (తం) అగ్నిం యమం మాతరిశ్వానం ఇతి బహుధా వదన్తి। ఆహుః॥

ప్రతిపదార్థము :

లోకమున జ్ఞాన సంపన్నులగు మేధావులు సూర్యుని యొక్క అనేక విభూతులను, శక్తులను ఆధారముగ తీసుకొని అతనినే ఆ ఒక్కనినె అనేక నామములతో పిలుచు చున్నారు. అది ఎట్లనిన ఇంద్రమ్. మహాబల సమన్వితు డగు "ఇంద్రుడు" అనియు, మిత్రం = తన్ను ఉపాసించు వారికి హితుడగు మిత్రుడనియు, వరుణమ్ = భక్తుల అరిష్టములను తొలగించును కనుక వరు ణుడనియు, అగ్నిమ్ = సర్వసౌఖ్యస్థాయికి నడిపించువాడు కనుక అగ్నియనియు, ఆహుః = చెప్పిరి. అథో = మరియు సః = ఆ సూర్యుడె, సువర్ణః = బంగారు రెక్కలను (కాంతులను) గల్గిన, గరుత్మాన్ = సర్వమును గ్రహించగల్గిన వాడ గుటచే గురుత్మంతుడనియు, ఈ విధముగ ఏకం సత్ = సత్యస్వరూపుడగు ఈతని నొక్కనినె, విప్రాః = విశేష ప్రజ్ఞ గల్గినవారు, అగ్నిం యమం మాత రిశ్వానం ఇతి = అగ్ని, యముడు, మాతరిశ్వ, (వాయువని) అనేక విధములుగ (బహుధా), వదన్తి = పల్కుచున్నాడు.

సూర్యుని యొక్క శక్తులనంతములు. అట్టి ఒక్కొక్క శక్తి నాధారము చేసుకొని, ఆ సూర్యునినె, ఆ యా శక్త్యభిమాన దేవతులుగ ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని, సుపర్ణుడు, గరుత్మంతుడు, యముడు, మాతరిశ్వ, (వాయువు) అని అనేక ప్రకారముల చెప్ప చున్నారు. స్తుతించుచున్నారు.

(20)

## మహాసౌర మంత్రము 21

కృష్ణం నియానం హరయః సుపర్ణా అపో వసానా దివముత్పతన్తి।
త ఆ వవృత్రన్త్సదనా దృతస్యా దిద్ఘృతేన పృథివీ వ్యుద్యతే॥

**పదపాఠము :**

కృష్ణమ్ । ని-యానమ్ । హరయః । సు-పర్ణాః । అపః । వసానాః । దివమ్ । ఉత్ । పతన్తి । తే । ఆ । అవవృత్రన్ । సదానాత్ । ఋతస్య । ఆత్ । ఇత్ । ఘృతేన । వి । ఉద్యతే ॥

**సాయణ భాష్యము :**

కృష్ణం కృష్ణవర్ణం నియానం నియమేన గచ్ఛన్తం మేఘం హరయః ఉదకస్య హర్తారః సుపర్ణాః శోభన పతనా రశ్మయోఽపోవసనా ఉదకాని వాసయంతో మేఘేను। అద్భిర్మే ఘాత్పురయంత ఇత్యర్థః। అన్తర్భావిత ణ్యర్థాత్ ద్వికర్మకత్వమ్। యద్వా। కృష్ణం నియానం నియమనం రాత్రిః దేవానాం హిరాత్రిర్దక్షిణాయనమ్। తత్ప్రతి। తస్మిన్వర్షకాల ఇత్యర్థః। ఏవం కుర్వన్తో దివంద్యులోకం తదా శ్రిత మాదిత్యం వోద్దిశ్యోత్పతన్తి। ఊర్ధ్వం గచ్ఛన్తి। తే రశ్మయ ఋతస్య సదనాత్ ఉదకస్య స్థానత్ ఆదిత్యమణ్డలాత్ అవవృత్రన్ ఆవర్తన్తే। అర్వాఞ్చ ఆగచ్ఛన్తి। ఆదిత్ అనంతరమేవ యదర్వాగ్గచ్ఛన్తి తదాసీమేవ మృతేనోదకేన పృథివీ వ్యుద్యతే। వివిధం క్లిద్యతే। కృష్ణం నిరయనం రాత్రి రాదిత్యస్య హరయః సువర్ణాః హరణా ఆదిర్య రస్మయ ఇత్యాది నిరుక్తం ద్రష్టవ్యమ్॥ నిరుక్త 7-24॥

(ఋక్ 1-164-47)

వాక్యాన్వయము :

కృష్ణం నియానం హరయః సువర్ణాః అపఃవసానాః దివముత్పతన్తి । తే ఋతస్య సదనాత్ ఆ వవృత్రన్। అదిత్ఘృతేన పృధివీ వ్యుద్యతే॥

ప్రతిపదార్థము :

కృష్ణం నియానం - ఇది సప్తమ్యర్థమునందు వాడబడిన ద్వితీయాంతము. కనుక సప్తమ్యర్థము చెప్పుకొనవలెను. కృష్ణం = నల్లని నియానం= మేఘమునందు, అపః వసానాః= నీటిని ఉంచెడి (దాచుచున్న) హరయః = రసహరణశీల ముగల, సువర్ణాః= నానాగతులుగల్గిన సూర్యకిరణములు, దివమ్ = ద్యులోకమునకు, అనగ తదాధారభూతుండగు సూర్యునివద్దకు, ఉత్పతన్తి = మీదుగ పోవుచున్నది. తే అవి, ఆ సూర్యకిరణములు, ఋతస్య సదనాత్= ఉదకస్థానమునుండి, ఆ వవృత్రన్ = ఆవర్తనగతిని పోవుచున్నవి.

అదిత్= ఆ వెంటనే, ఘృతేన = జలములచే, పృధివీ= భూమి, విఉద్యతే = వ్యుద్యతే = తడపబడుచున్నది. మిక్కిలిగ వర్షముచే తడుపబడుచున్నది.

సూర్యుని కిరణములు రసహరణశీలము కల్గినవి. అనగ సముద్రములందలి, జలాశయాదులందలి నీటిని పీల్చివేయు స్వభావము కల్గినవి. అవి ఉత్తరాయణమున, అందును గ్రీష్మ ఋతువునందు భూమిపై నుండు నీటిని పీల్చివేసి, మేఘములందు దాచియుంచును. ఇంతలో దక్షిణాయణము వచ్చును. అనగ నిది దేవతలకు రాత్రికాలము. కనుక ఈ సూర్యకిరణములు తమ స్వస్థానమగు సూర్యమండలమునకు పోవుటకు మొదలిడును. ఆ పోవుటయు మేఘములను చుట్టుతిరిగి, వృత్తాకారముగ చుట్టుకొని పోవును. అవి అట్లు పోగానే ఈ

మేఘములు తమయందలి జలములను భూమిపైకి వదలి వేయును. ఆవిధముగ మనకు వర్షకాలమురాగ, భూమియంతయు నీటితో ప్లావితమగుచున్నది.

లేదా ఈ మంత్రమును నింకొక విధముగ వివరింపవచ్చును.

సూర్యుడు ఉదకములకు స్థానము. నారాయనము అనగ నీటికి స్థానము అని అర్థము. నారములనగ జలములు, అయనమనగ స్థానము.

కనుక గ్రీష్మర్తువునందు, రసహరణశీలులగు సూర్యకిరణములు జలాశయములనుండి నీటిని పీల్చుకొనును. అవి ఆ కార్యములోనుండగ రాత్రి అనగ దక్షిణాయనము వచ్చుచున్నది. అపుడే కిరణములు నీటిని వాని స్థానమునకు తీసుకొని పోవుటకై ప్రయత్నించును. ఆ ప్రయత్నములో నవి మేఘములను ఢీకొనుచు, చుట్టు తిరిగియు పోవును. అట్లు పోవుటలో అవి కొనిపోవుచున్న జలములు వానినుండి జారి భూమిపై పడిపోవుచున్నవి.

ఆ విధముగ కూడ భూమి నీటితో బాగుగ తడిసిపోవుచున్నది. అనగ వర్షాకాలమందలి ఉదకధారలచే భూమియంతయు ప్లావితమగుచున్నదని భావము.

ఈ మంత్రములో వర్షమెట్లు పడుచున్నదో ద్వివిధముగ చెప్పెరి.

1. ఈ సూర్యకిరణములు మేఘములలో దాచుకొన్న జలములు, సూర్యకిరణనిర్గమనానంతరము, మేఘములచే వదలి వేయబడుచున్నవి.

2. ఈ సూర్యకిరణములు భూమినుండి పీల్చిన జలములను సూర్యమండలమునకు కొనిపోవుచుండగ, మేఘములతో ఢీకొనుట, చుట్టి తిరిగి పోవుట మొదలగు కార్యములలో, ఈ జలములు వాని నుండి జారిపోయి భూమిని తడిపివేయుచున్నవి.

ఇంతటి శక్తివంతములగు కిరణములను కల్గిన ఓ సూర్య! నీకు నమస్కారము.

కృష్ణం నియానమనుదానికి, మేఘము, దక్షిణాయనమును రెండర్థములు కలవు.

(21)

హగుంసః శుచిష ద్వసురంతరిక్ష సద్ధోతా-
వేదిష దతిథి ర్దురోణ సత్ ।
నృష ద్వరస దృతస ద్వ్యోమసదబ్జా
గోజా ఋతజా అద్రిజా ఋతమ్॥

పదపాఠము :

హంసః । శుచి-సత్ । వసుః । అన్తరిక్ష-సత్ । హోతా । వేది-సత్ । అతిథిః । దురోణ-సత్ । నృ-సత్ । వర-సత్ । ఋత- సత్ । వ్యోమ-సత్ । అప్-జాః । ఋత-జాః । అద్రి-జాః । ఋతమ్ ॥

సాయణ భాష్యము :

అనయా సౌర్యర్చా య ఏషో౽న్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రురిత్యాది శ్రుత్యోక్త మండలాభిమానీ దేవో౽స్తి । యశ్చ సర్వప్రాణి హృది చిద్రూపః స్థితః పరమాత్మా యచ్చ నిరస్త సమస్తోపాధికం పరబ్రహ్మ తత్సర్వమేకమేవేతి ప్రతిపాద్యతే। హంసః హన్తిర్గత్యర్థః సర్వత్ర సర్వదా గన్తా యో హంసో౽ సావిత్యాది శ్రుత్యుక్త ప్రకారేణైకీకృతో౽పాస్యః ॥ పరమాత్మమ స్త్రిప్రతిపాద్య ఆదిత్యః సచశుచౌదీప్తేద్యులోకే సీదతీతి శుచిషత్ ॥ అథయదతః పరోదివోజ్యోతిర్దీప్యత ఇత్యాది శ్రుతేః ॥ అనేన ద్యుస్థాన ఆదిత్యః ప్రతిపాదితః । సఏవ మధ్యస్థానీయో వాయురిత్యాహ వసుః సర్వస్యవాసయితా వాయుః । స చాన్తరిక్షసత్ అన్తరిక్ష సంచారీ అథ తస్యైవ క్షితిస్థాన వైదికాగ్నిరూపతామాహ । హోతా దేవానామాహ్వాతా హోమనిష్పాదకోవా । వేదిషత్ వేద్యాం గార్హప త్యాది రూపేణ ధిష్ఠితః । అతిథి: అతిథివత్సర్వదా పూజ్యో౽గ్నిః దురోణసత్ దురోణం గృహనామ తత్రపాకాది సాధనత్వేన స్థితః అనేన లౌకికా గ్న్యాత్మక త్వముక్తం। నృషత్ నృషు మనుష్యేషు చైతన్యరూపేణ సీదతీతి నృషత్ । అనేన పరమాత్మరూపత్వముక్తమ్। పునరప్యాదిత్యతామాహ -వరసత్ వరే వర ణీయేమండలే సీదతీతి వరసత్। ఆదిత్యః। వరంవా ఏతత్సద్మనాం యస్మిన్నేష ఆసన్నస్తపతీతి హిశ్రూయతే ఋతం సత్యం బ్రహ్మయజ్ఞోవా తత్రసీదతీతి ఋత సత్ । ............................ ...............హంసః శుచిషదిత్యేష వైహంసః శుచిషదిత్యాదినా బ్రాహ్మణే సమామ్నానాత్॥ (ఋక్ 4-40-5)

వాక్యాన్వయము :

హంస- శుచిషత్ । వసు- అన్తరిక్షసత్ । హోతా వేదిసత్ ।
అతిథి- దురోణసత్ । నృసత్ । వరసత్ । ఋతసత్,
వ్యోమసత్ । అబ్జా- గోజా- ఋతజా- అద్రిజా-
ఋతమ్ ॥

ప్రతి పదార్థము :

హంసః = గమనశీలియగు ఆదిత్యుడు, శుచి-సత్ = దీప్తి మంతమగు ద్యులోకమున సంచరించువాడు - ఉండువాడు వసుః = వాయు రూపమున సర్వ జీవులందు వసించువాడు, లేదా అందరను - సర్వ ప్రాణులను సుఖముగ నివసించునట్లు చేయువాడు. అన్తరిక్షసత్= అన్తరిక్షమున సంచరించువాడు. హోతా = యజ్ఞయాగాది కాలమున దేవతలను అగ్నిరూపమున ఆహ్వానించువాడు. వేదిసత్ = యజ్ఞయాగాదులందు గార్హ్యపత్యాది అగ్ని రూపమున ఉండువాడు. అతిథిః = అతిథివలె సర్వజీవులచే పూజింపబడువాడు. దురోణసత్= గృహములందు నివసించువాడు.నృసత్ = నరులందు - జీవులందు చైతన్య రూపమున నివసించువాడు. వరసత్ = సర్వులచే అభిలషనీయమగు ఆదిత్య మండలమున నుండువాడు. ఋతసత్ = సత్యవాక్కు నందు లేదా బ్రహ్మయజ్ఞము నాశ్రయించి యుండువాడు. వ్యోమసత్ = అంతరిక్ష యందు వసించువాడు. అప్-జాః = నీటి యందు పుట్టువాడు. గోజాః = కిరణముల ద్వార జనించువాడు. ఋతజాః = సత్యము నందు జన్మించినవాడు. అద్రిజాః = ఉదయాచలము నుండి జన్మించినవాడు. ఋతమ్ = (ఈ చెప్పినదెల్ల) సత్యము.

ఈ మంత్రము సూర్యునుద్దేశించి చెప్పబడినది. సూర్యుని యొక్క నానావిధ విభూతులను, అతనికిగల భిన్ననామములను, అవి యెట్లు వచ్చెనో ఈ మంత్రమున వివరించుచున్నారు.

ఇతడు సర్వత్ర సర్వదా సంచరించువాడు. కనుకనె "యో హంసో ऽ సో" ఇత్యాది మంత్రములచే ఇతనినే జీవాత్మ పరమాత్మలకు ఒకే రూపముగ భావించి ప్రార్థించుచున్నారు. కనుక ఇతడు హంస.

ఇతడు ప్రకాశవంతమగు ద్యులోకమున నివసించును. కనుక శుచిసత్. ఈ విధముగ ద్యులోకవాసియగు ఆదిత్యుడు చెప్పబడెను.

ఇతడు సర్వజీవులను వసింప చేయువాడు. అంతరిక్ష సంచారియగు వాయువు. కనుకనె వసువు - అనిచెప్పబడెను. (వసతి వాసయతీతి వా వసుః). ఈ విధముగ అంతరిక్ష వాసియగు ఆదిత్యుడు చెప్పబడెను.

ఇక నిపుడు పృథ్వీస్థానీయుడగు ఆదిత్యుని వర్ణించుచున్నారు.

ఇతడు వైదికాగ్ని రూపమున భూమిపై యుండును. అగ్నిరూపమున దేవతలను యజ్ఞయాగాది కార్యములందు పాల్గొనిహవిస్సులను గ్రహించవలసిన దిగ ఆహ్వానించును. మరియు నితడె హోమనిష్పాదకుడు. కనుకనె "హోత" అని చెప్పబడుచున్నాడు.

యజ్ఞయాగాదులలో యజ్ఞవేదికలందు గార్హ్యపత్యాది అగ్నిరూపమున ఉండును. కనుకనె "వేదిసత్" అని అందురు. ఇతడు అతిథివలె సర్వజీవులచే పూజింపబడును.

కనుక నితడు "అతిథి" అని పిలువబడును.

మరియు నితడు పాకాది సాధన రూపమున గృహము నందుండును. కనుక నితడు "దురోణసత్". దురోణమనగ గృహము. సత్ = ఉండువాడు, నివసించువాడని భావము.

ఇతడు సర్వజీవులందు చైతన్యరూపమున వసించును. కనుక "నృసత్". ఇతడు సర్వజనులభిలషించునట్టి ద్యులోక జ్యోతిర్మండలమున వసించును. కనుక నితడు వరసత్.

ఇతడు సత్యవాది. బ్రహ్మయజ్ఞము నాశ్రయించి ఉండువాడు. కనుక ఋతసత్. ఈతను ఆకాశమున వాయు రూపమున వసించును. కనుక వ్యోమ

సత్.

ఈతను జలములందు వైద్యుతాగ్నిగను, బడబానలముగను ఉండును. కనుక ఇతనిని "అబ్జాః" అని యందురు.

ఈతను ప్రకాశవంతములగు కిరణములద్వారా తెలియబడును. కనుక నీతనిని "గోజాః" అని అందురు.

ఇతను ఇంద్రాది దేవతలవలె పరోక్షముగ ఉండువాడుకాడు. సత్యమైన ప్రత్యక్ష దర్శనమున తెలియువాడు. కనుకనె ఈతనిని "ఋతజాః" అని అందురు.

ఈతడెల్లపుడుఉదయాచలము నధిరోహించి వచ్చు చున్నాడు. కనుక నీతనిని "అద్రిజాః" అని చెప్పుచున్నారు.

ఈ విధముగ పైన చెప్పిన విషయములన్నియు సత్యములు.

కనుక నో సత్య స్వరూపా ఆదిత్యా! నీకు నమస్కారము. (22)

యత్త్వా సూర్యస్వర్భాను స్తమసా విధ్య దాసురః।
అక్షేత్ర విద్యథా ముగ్ధో భువనా న్యదీధయుః॥

పదపాఠము

యత్ । త్వా । సూర్య । స్వః - భానుః । తమసా । అవిధ్యత్ । ఆసురః । అక్షేత్ర - విత్ । యథా । ముగ్ధః । భువనాని । అదీదయుః ॥

సాయణ భాష్యము :

ఇదమాది చతుర్భిర్మంత్రైః అత్రిణాం కర్మ కీర్త్యతే। హే సూర్య ప్రేరక దేవ త్వా త్వాం యద్యదాసురోऽ సురస్య ప్రాణాపహర్తు రసుర్యా వా పుత్రః స్వర్భానుః స్వర్భాను సంజ్ఞక స్తమసా మాయా నిర్మితేనా విధ్యతే। అవృణో దిత్యర్థః। తదా భువనాని సర్వాణ్యదీధయుః। దృశ్యన్తే। యథా తత్రత్యః సర్వో జనోऽక్షేత్రవిత్ స్వస్వ స్థానమజానన్ ముగ్ధో మూఢో భవతి తథా॥ (ఋక్ 5-40-5)

వాక్యాన్వయము :

సూర్య! త్వా యత్ అసురః స్వర్భానుః తమసా అవిధ్యత్
తదా భువనాని ముగ్ధః అక్షేత్రవిత్ (వత్) అదిధయుః॥

ప్రతి పదార్థము :

సూర్య = సర్వ ప్రేరకుండవగు ఆదిత్య, త్వా = నిన్ను, యత్ = యదా = ఎప్పుడైతే, అసురః = అసురీ కుమారుడగు, ప్రాణాపహర్తయగు రాక్షసుడైన, స్వర్భానుః = "స్వర్భాను" అను నతడు, తమసా = మాయాకల్పితమగు చీకట్లచే, అవిధ్యత్ = కప్పివేసెనో, (ఎదుర్కొనెనో) అపుడు, భువనాని = సర్వలోకములు, ముగ్ధః = మూగవోయి, అక్షేత్రవిత్ ఇవ = దారితెలియని వానివలె, అదీధయుః = చూపట్టినవి. (అసురః = అసురీ అను రాక్షస స్త్రీకి జన్మించినవాడు. అసువులనగ ప్రాణములు. వానిని రాతి = హరించువాడు అసూన్ రాతీతి అసురః).

ఓ ఆదిత్య! నిన్ను రాక్షసి పుత్రుడగు "స్వర్భాను" అనునతడు తన మాయా జాలముతో కుహనాంధకారమున కప్పి వేసెనుకద. అపుడు సర్వ లోకములు చీకట్ల యందు మునిగి పోయెను. ఈ హఠాత్పరిణామమునకు, తామెటుపోవలెనో తెలియని మూర్ఖునివలె, లోకములన్నియు మూగపోయెను.

సూర్యునెదుర్కొను శక్తి ఎవరికిని లేదు. కాని ఈ రాక్షసుడు తన మాయా బలముతో అసత్యమగు అంధకారమును కల్పించుటకై సూర్యుని ఎల్లెడల కప్పివేసెను. ఈ అంధకారము క్షణికము. ఐనను లోకములన్నియు మూగవోయెను. (పోవు చున్నవి)

ఇంతటి కష్టము నధిగమించిన ఓ సూర్య! నీకు నమస్కారము. (23)

## మహాసౌర మంత్రము 24.

యదద్య సూర్య బ్రవోऽనాగా ఉద్యన్మిత్రాయ వరుణాయ సత్యమ్।
వయం దేవత్రాదితే స్యామ తవ ప్రియాసో అర్యమ న్గృణంతః॥

పద పాఠము :

యత్ । అద్య । సూర్య । బ్రవః । అనాగాః । ఉత్-యన్ । మిత్రాయ । వరుణాయ । సత్యమ్ । వయమ్ । దేవ-త్రా । అదితే । స్యామ । తవ । ప్రియాసః । అర్యమన్ । గృణన్తః ॥

సాయణ భాష్యము :

హే సూర్య! సర్వస్య ప్రేరక ఏతన్నామక దేవ ఉద్యన్ ఉదయంస్త్వం యద్యది అద్యాస్మాన్ అనుష్ఠానకాలేऽస్మాన్ బ్రవః బ్రూయాః। కిమితి? అనాగాః అనాగస ఇతి ఏతే అపాపా ఇతి। యది దేవేషు మధ్యే బ్రూయాః తర్హి వయం హే అదితే అదీనదేవ దేవత్రా దేవేషు దేవానాం మధ్యే మిత్రాయ వరుణాయ చ సత్యం అవితథం స్యామ అనాగసో భవేమ। కిం చ హేऽర్యమన్ దాతః త్వాం గృణన్తః స్తువన్తః తవ ప్రియాసః ప్రియాః స్యామ త్వత్ప్రేమ విషయా భవేమ। యద్వోత్తరార్థ ఏకం వాక్యమ్। హే అదితే హే అర్యమన్ ఉక్తలక్షణ దేవ వయం దేవేషు మధ్యే త్వాం గృణన్తః తవైవ ప్రియాః స్యామ యది మాం దేవేష్వపాపం బ్రూయా స్తర్హి త్తైరయమనప రాధీత్యను గృహీత స్త్వాం స్తుత్వా తవ ప్రియో భవే యమ్" -- ఇత్యర్థః॥ (ఋక్ 7-60-1)

వాక్యాన్వయము :

హే సూర్య! ఉద్యన్ యదద్య అనగాః బ్రవః! వయం హే అదితే! దేవత్రా మిత్రాయ, వరుణాయ సత్యం స్యామ।

హే అర్య మన్! (త్వా) గృణన్తః తవ ప్రియాసః స్యామ॥

ప్రతిపదార్థము :

హే సూర్య = సర్వలోక ప్రేరకుండవగు ఓ ఆదిత్య!, ఉద్యన్ = నీవు ఉదయించుచునె, యదద్య = తత్కాలమునందె, మమ్ము, దేవత్రా = దేవల యందు (మధ్య), మిత్రాయ వరుణాయచ = అహరభిమానియగు మిత్రునకు, రాత్ర్యభిమానియగు వరుణునకు, అనాగాః = పాపరహితులమని, బ్రవః = చెప్పు. అపుడు మేము, సత్యం = నిజముగనె, హే అదితే, హే అర్యమన్ మిమ్ము, గృణన్తః = స్తుతించుచు, తవ = నీకు, ప్రియాసః = ప్రేమపాత్రులముగ, స్యామ = అగుదుము.

ఓ సూర్య! నేడు నీవు ఉదయించుచునె, సమస్త దేవతల మధ్య మమ్ము పాపరహితులమని మిత్రా వరుణులకు నివేదింపుము. అనగ మేము పాపము చేయలేదని వారికి ఈ సత్యమును తెలియ చేయుము. అట్లు నీచే చెప్పబడిన మేము సత్యముగనె పాపరహితుల మగుదుము. మరియు మా సత్య జీవనము వారికి తెలిపిన నిన్ను మేము అనేకములుగ స్తుతించుచు నీకు ప్రియతముల మగుదుము. ఇది సత్యము. మేము నిజమునె పలుకుచున్నాము.

మాకింతటి ఉపకారము చేయు ఓ సూర్య! నీకు నమస్కారము.

(24)

## మహాసౌర మంత్రము 25

ఉత్సూర్యో బృహదర్చీంష్య శ్రేత్పురు విశ్వా జనిమా మానుషాణామ్।
సమో దివా దదృశే రోచమానః క్రత్వా కృతః సుకృతః కర్తృభిర్భూత్॥

**పద పాఠము :**

ఉత్ । సూర్యః । బృహత్ । అర్చీంషి । అశ్రేత్ । పురు ।
విశ్వా । జనిమ । మానుషాణామ్ । సమః । దివా । దదృశే ।
రోచమానః । క్రత్వా । కృతః ।సు-కృతః । కర్తృ-భిః । భూత్ ॥

**సాయణ భాష్యము :**

సూర్యః సర్వస్య ప్రేరకోదేవః బృహత్ అత్యధికం, పురు పురూణి బహూని అర్చీంషి తేజాంసి ఉదశ్రేత్ ఊర్ధ్వం శ్రయతి కింప్రతి మానుషాణాం మనుష్యాణాం విశ్వా సర్వాణి జనిమా జనిమాని జనాన్ జనశబ్దః సంఘవచనః తాన్ ప్రత్యుదశ్రేత్।

స దేవో దివా అహని రోచమానః సన్ సమో దదృశే। ఏక రూపః ప్రతి నియతః సన్ దృశ్యతే । తస్మాత్పురుషం పురుషం ప్రత్యాదిత్యో భవతీతి హి శ్రుతిః । స దేవః క్రత్వా సర్వస్య కర్త్రా సుకృతః ప్రజాపతినా కర్తృభిః శ్రుతిః కర్తృభిః సుకృతః స్తుత్వా తీక్ష్ణకృతోఽభూత్ భవతి॥

(ఋక్ 7-62-1)

వాక్యాన్వయము :

సూర్యః బృహత్ పురు అర్చింషి మానుషాణాం విశ్వాజనిమ ఉదశ్రేత్।
సమః రోచమానః దివా దదృశే । (అపిచ) కర్తృభిః క్రత్వా సుకృతః కృతః భూత్।

ప్రతి పదార్థము :

(అయం) సూర్యః = సర్వజీవ ప్రేరకుండగు ఈ భాస్కరుండు, బృహత్ = మిక్కిలిగ, పురు = అనేకములగు, అధికమగు, అర్చింషి = కిరణపుంజములను తేజస్సును, మానుషాణాం = మానవులయొక్క, విశ్వాజనిమా = విశ్వాని జనిమాని = అనేకములగు సంఘముల నుద్దేశించి, ఉదశ్రేత్ = సర్వత్ర ప్రసరిచుచున్నాడు. మరియు నితడు, రోచమానః = ప్రకాశించుచున్నవాడై, దివా = పగటియందు, సమః దదృశే = ఏకాకారముగ చూడబడుచుండెను. ఈ ఆదిత్యుడు, కర్తృభిః = యాజ్ఞికులచే (చేయబడిన) క్రత్వా = క్రతువుచే, సుకృతః = అధికుడుగ, మిక్కిలి తేజశ్శాలిగ, కృతః భూత్ = చేయబడిన వాడయ్యెను.

ఈ సూర్య భగవానుడు లోకమందలి సర్వజీవరాసులను, మానవ సముదాయమును ఉద్దేశించి ఆకసమున తన కిరణములను ఏక కాలమున అనేకముగ సర్వత్ర ప్రసరించుచున్నాడు. ఆ విధముగ అతడాకాశమునందు దేదీప్యమానముగ, ఏకాకారముగ ప్రకాశించు చున్నట్లు అందరిచే చూడబడుచున్నాడు. ఈవిషయమునె శ్రుతియు "పురుషం పురుషం ప్రత్యాదిత్యో భవతి" అని చెప్పుచున్నది.

మరియు అతనిని ఉద్దేశించి ఉపాసకు లొనరించు యజ్ఞ యాగాది క్రతు బలముచే నతడు మరింతగ తీక్ష్ణతను, ఔద్ధత్యమును పొందుచున్నాడు.

ఇట్లభివృద్ధి నొందుచున్న ఓ ఆదిత్య! నీకు నమస్కారము.

(25)

## మహాసౌర మంత్రము 26

స సూర్య ప్రతి పురో న ఉద్గా ఏభిః
స్తోమేభి రేతశేభి రేవైః।
ప్ర నో మిత్రాయ వరుణాయ వోచోऽ నాగసో
అర్యమ్ణే అగ్నయేచ॥

**పదపాఠము :**

సః । సూర్యః । ప్రతి । పురః । నః । ఉత్ । గాః । ఏభిః । స్తోమేభిః । ఏతశేభిః । ఏవైః । ప్ర । నః । మిత్రాయ । వరుణాయ । వోచః । అనాగసః । అర్యమ్ణే । అగ్నయే । చ ॥

**సాయణ భాష్యము :**

హే సూర్య సః ప్రసిద్ధస్త్వం నో అస్మాన్ప్రతి పురః పురస్తాత్ ఉద్గాః ఉద్గచ్ఛ। కైః సాధనైః ఏభిః స్తోమేభిః స్తోమైః స్తుత్యైః ఏతశేభిః ఏతవర్ణైః, స్వార్థికః శకారః, తాదృశైః ఏవైర్గమనశీలైః అశ్వైరుద్గాః । అథ తథా కృత్వా అస్మాభిః స్తుతఃసన్, నోऽస్మాన్ అనాగసః అపాపాన్ ప్రవోచః । కేభ్యః మిత్రాయ వరుణాయార్యమ్ణే అగ్నయే చ । అత్రసౌర్య ఇతరేషాం మిత్రాదీనాం సంకీర్తనం తేషామపి నిపాత భాక్త్వాత్ అవిరుద్ధం। ఏవం పూర్వోత్తరత్ర చ మైత్రా వరుణేऽర్యమాదీనాం సంకీర్తనమపి న విరుధ్యతే॥

(ఋక్ 7-62-2)

వాక్యాన్వయము :

హే సూర్య! సః నః ప్రతి ఏభిః స్తోమేభిః ఏతశేభిః ఉద్గాః।
ఏష్మైః నః మిత్రాయ వరుణాయ అర్యమ్ణే అగ్నయే చ అనాగసః (ఇతి) ప్రవోచః॥

ప్రతిపదార్థము :

హే సూర్య సః = మిక్కిలి ప్రసిద్ధుడవగు నీవు, నఃప్రతి = మా గురించి, ఏభిః స్తోమేభిః = ఈ (మాచే చేయబడిన) స్తోత్రములచే (సంతోషించినవాడవై,) ఏతశేభిః = నానా వర్ణములు గల్గిన, ఏష్మైః = బలిష్ఠములగు అశ్వములతో, ఉద్గాః = మీదకు (అంతరిక్షమునకు) వెళ్ళుము. (అట్లుపోయి) నః = మమ్ములను, మిత్రాయ = అహరభిమాని దేవతయగు మిత్రునకు, వరుణాయ = రాత్ర్యభిమాన దేవతయగు వరుణునకు, అర్యమ్ణే = శత్రునాశకుడగు అర్యమునకు, అగ్నయే చ = పురోహితుండగు అగ్నికిని, అనాగసః ఇతి = మేము పాపరహితులమని, ప్రవోచః = నిశ్చయముగ పలుకుము, చెప్పుము.

ఓయి సర్వ ప్రేరకుండవగు ఆదిత్య! సదా మాచే ఆరాధింపబడుచున్నట్టి నీవు, మా స్తుతి పాఠములకు ప్రీతచెంది, నీయొక్క చిత్ర విచిత్రములై బలిష్ఠములగు అశ్వములతో అంతరిక్ష లోకమునకు పొమ్ము. అచటనుండు మిత్రావరుణులకు, అర్యమాగ్నులకు మమ్ము పాపరహితులుగను, పుణ్యశీలురుగను తెలుపుము. మేము దోష రహితులమని వారికి నిశ్చయముగ చెప్పుము.

ఇంతటి మహోపకారము నాచరించు ఓ ఆదిత్య! నీకు నమస్కారము.

(26)

వి నః సహస్రం శురుధో రదం త్వృతావనో వరుణో మిత్రో అగ్నిః।
యచ్ఛన్తు చంద్రా ఉపమం నో అర్కమానః కామం పూపురన్తు
స్తవానాః॥

పదపాఠము :

వి । నః । సహస్రమ్ । శురుధః । రదంతు । ఋత-వానః ।
వరుణః । మిత్రః । అగ్నిః । యచ్ఛన్తు । చంద్రాః । ఉపమమ్ ।
నః । అర్కమ్ । ఆ । నః । కామమ్ । పూపురన్తు । స్తవానాః॥

సాయణ భాష్యము :

నోऽస్మభ్యం శురుధః శుచేర్దుఃఖస్య ప్రతిరోద్ధారః ఋతావానః సత్యవన్తో వరుణాదయః సహస్రం సహస్ర సంఖ్యాకం ధనం విరదన్తు వితరన్తు । అధవా శురద ఉక్తలక్షణాః సహస్ర సంఖ్యాకాః ఓషధీ రదన్తు । కించతే చన్ద్రాః ఆహ్లాదకారిణో నోస్మభ్యం ఉపమం స్తుత్యం అర్కమర్చనీయం యజన్తు । కించ స్తవానాః అస్మాభిస్తూయమానా నోస్మాక కామ మేష్టితం పూపురన్తు పూరయన్తు । హే సూర్యత్వయా అనుజ్ఞాతా ఇతి సూర్యస్య స్తుతిః॥

(ఋక్ 7-62-3)

వాక్యాన్వయము :

(హే సూర్య!) నః శురుధః ఋతావానః వరుణః మిత్రః అగ్నిః సహస్రం విరదన్తు । (తేచ) చన్ద్రా నః ఉపమం అర్కం యచ్ఛన్తు । (తే తదా) స్తవానాః నః కామమాపూపురన్తు॥

ప్రతిపదార్థము :

హే సూర్య! నః = మా కొరకు, శురుధః = దుఃఖమును పరిహరించు నట్టియు, ఋతావానః = సత్యవర్తనులగు, వరుణః మిత్రః అగ్నిః = వరుణుడు, మిత్రుడు, అగ్నియు, సహస్రం = అనంతములగు (సహస్ర సంఖ్య అనేకములకు ఉపలక్షణము) శుభములను, విరదన్తు = ఇచ్చెదరుగాక. (తే చ) చంద్రాః = ఆహ్లాదకారులగు వారు, నః = మాకొరకు, ఉపమం = మెచ్చుకోదగిన, స్తవనీయములగు, అర్కం = పూజనీయమగు జ్ఞానైశ్వర్యములను, యచ్ఛన్తు = ఇచ్చెదరుగాక. మరియు, స్తవానాః = (వారు మాచె) స్తుతింపబడిన వారై, నః = మాకు, కామమ్ = స్వేచ్ఛగ మేము కోరిన సర్వమును పూపురన్తు = విశేషముగ పూరించెదరు (ఇచ్చెదరు) గాక.

ఓ ఆదిత్య! నీచే సత్యవ్రతులుగను, పాపరహితులుగను వెల్లడింపబడిన మాకు, దుఃఖ నివారణ సమర్థులు, ఆడిన మాటను తప్పకుండెడి సత్యశీలురునగు మిత్రావరుణాగ్నులు అనంతములగు శుభములను వర్షించెదరు గాక. ఆ శుభములు మాకాహ్లాదము కల్గించును. కనుక వారాహ్లాదకారులు. వారి అనుగ్రహముచే మేము స్తవనీయము పూజనీయములునగు జ్ఞానైశ్వర్యములను ఓషధీ సంపదను పొందుదుముగాక. వారు మా యొక్క స్వచ్ఛతకు పవిత్రతకు ఆనందించుచు, మాకు గల సర్వాభీష్టములను తీర్చెదరుగాక.

ఇట్టి సహాయము చేయు ఓ సూర్య! నీకు నమస్కారము.

(27)

## మహాసౌర మంత్రము 28

ఉద్వేతి సుభగో విశ్వచక్షాః సాధారణః సూర్యో మానుషాణామ్।
చక్షుర్మిత్రస్య వరుణస్య దేవశ్చర్మేవ యః సమవివ్యక్తమాంసి॥

**పదపాఠము :**

ఉత్ । ఊః ఇతి । ఏతి । సు-భగః । విశ్వ-చక్షాః । సాధారణః ।
సూర్యః । మానుషాణామ్ । చక్షుః । మిత్రస్య । వరుణస్య । దేవః ।
చర్మ-ఇవ । యః । సం-అవివ్యక్ । తమాంసి ॥

**సాయణ భాష్యము :**

ఉద్వేతి ఉద్గచ్ఛత్యయం సూర్యః సుభగః శోభన భాగ్యః సుష్ఠు భజనీయో వా । విశ్వచక్షాః సర్వస్యద్రష్టా మానుషాణాం సర్వేషాం మనుష్యాణాం సాధారణః । సాధారణత్వ ప్రతిపాదక శ్రుతిః పూర్వ ముదాహృతా। మిత్రస్య వరుణస్య చ చక్షుః ప్రకాశకః దేవో ద్యోతమానః యో దేవశ్చర్మేవ చర్మాణీవ తమాంసి సమవివ్యక్ సహవిచతి, సంచేష్టయతి స మహానుభావో దేవః ఉద్వేతి॥

(ఋక్ 7-63-1)

వాక్యాన్వయము :

సుభగః విశ్వచక్షాః మానుషాణాం సాధారణః సూర్యః ఉదేతి । అయం దేవః మిత్రస్య వరుణస్య చక్షుః। అయం చర్మ ఇవ తమాంసి సమవివ్యక్॥

ప్రతిపదార్థము :

సుభగః = గొప్ప ఐశ్వర్యముకల, లేదా మిక్కిలి పూజింపదగిన, విశ్వ చక్షాః= సమస్తమును ప్రకాశింపచేయునట్టియు, మానుషాణామ్ = సర్వమానవులకు, సాధారణః= ఎల్లప్పుడు ఏకాకారముగ భాసించునట్టి, సూర్యః= సూర్యుడు, ఉదేతి= ఉదయించుచున్నాడు. ఈ దేవః= తేజశ్శాలి, మిత్రస్య వరుణస్య చ = మిత్రా, వరుణులకు కూడ, చక్షుః= చూపునిచ్చువాడు, ప్రకాశము కల్గించువాడు. అట్టి ఈతడు చర్మ ఇవ= చర్మమువలె, తమాంసి= చీకట్లను, సమవివ్యక్ = సర్వనాశకుడుగ( పారద్రోలు వాడుగ) ఉన్నాడు.

సర్వజీవ ప్రేరకుండగు ఈ ఆదిత్యుడు శోభాకరమగు ఐశ్వర్యము కలవాడు, అందరిచేత తప్పక సేవింపదగిన వాడు. సర్వమానవులను ఒకే విధముగ చూచుచు, ఎవరియందు పక్షపాతము లేకుండ సమానముగ ప్రకాశించువాడు. కనుకనే సాధారణః అని పిలువబడెను. అతడె మిత్రావరుణులను ప్రకాశింపచేయును. మరియు చర్మము వలె గాఢముగుచున్న చీకట్లను పారద్రోలును. అట్టి మహాత్మ్యముగల్గిన సూర్యుడు గగన మండలమున కెగబ్రాకు చుండెను. వానిని చూచుచు స్తోత్రములతో హోమాది కర్మలతో పూజించెదముగాక అని భావము.

ఇట్టి ఓ సూర్య! నీకు నమస్కారము.

(28)

## మహాసౌర మంత్రము - 29

ఉద్వేతి ప్రసవీతా జనానాం మహాన్కేతురర్ణవః సూర్యస్య।
సమానం చక్రం పర్యావివృత్స న్యదేతశో వహతి ధూర్షు యుక్తః॥

**పదపాఠము :**

ఉత్ । ఊంఇతి । ఏతి । ప్ర-సవితా । జనానామ్ । మహాన్ । కేతుః ।
అర్ణవః । సూర్యస్య । సమానమ్ । చక్రమ్ । పరి - ఆవివృత్సన్ । యత్ ।
ఏతశః । వహతి । ధూః - సు । యుక్తః ॥

**సాయణ భాష్యము :**

అయం, సూర్యస్య సూర్యః విభక్తి వ్యత్యయః ఉద్వేతి ఉద్గచ్ఛతి। కీదృశోऽయమ్? జనానాం సర్వేషాం ప్రసవితా సర్వేషు కర్మస్వనుజ్ఞాతా। మహాన్ పూజ్యః కేతుః సర్వస్య ప్రజ్ఞాపకః అర్ణవః ఉదక ప్రదః। కిం కుర్వన్ను దేతీతి? ఉచ్యతే। సమానం సర్వేషా మేక రూపం ఏక మేవ చక్రం రథాంగం చరణశీలం రథం వా పర్యావివృత్సన్, పర్యావర్తుమిచ్ఛన్ యద్రథచక్రం ధూర్షు రథస్య యుక్త ఏతశః ఏతశవర్ణో హరితవర్ణోऽశ్వో వహతి। ఏకో అశ్వో వహతి సప్తనామేత్యుక్తమ్॥

(ఋక్ 7-63-2)

వాక్యాన్వయము :

సూర్యస్య జనానాం ప్రసవితా మహాన్ కేతుః అర్ణవః సమానం చక్రం పరి అవివృత్సన్ యత్ ధూర్షు ఏతశః యుక్తః వహతి॥

ప్రతిపదార్థము :

సూర్యస్య = సూర్యుడు (షష్ఠి విభక్తిని ప్రథమలోనికి మార్చుకోవలెను). జనానాం= సర్వప్రాణులకు, ప్రసవితా = అనుజ్ఞనిచ్చువాడు - అనగ తమ తమ పనులను చేయుటకు వారిని మేల్కొలిపి, కార్యోన్ముఖులుగ చేయువాడు. మహాన్= పూజ్యుడు, అర్ణవః జలములతో కూడినవాడు, జలములను మిక్కిలిగ నిచ్చువాడు. (వర్షించువాడు.) కేతుః= బాధ్యతలను జ్ఞాపకము చేయువాడు, ఈతడు సమానం= ఏకాకారమగు, చక్రం= రథాంగమును పరి= సర్వత్ర, అవివృత్సన్ = సంచరింప (ప్రవర్తింప) చేయగోరువాడై, (ఉదేతి ఉదయించు చున్నాడు) అవిధమెట్టిదనిన, యత్ ధూర్షు= ఆరథము యొక్కనొగలను, ఏతశః = హరిద్వర్ణమగు అశ్వము యుక్తః= కట్టుబడినదై, వహతి = వహించుచున్నది.

సర్వజీవరాశిని తముతమ పనులు చేయుటకు అజ్ఞ నిచ్చునట్టియు, సర్వ జనులకు పూజ్యుడును, సర్వప్రాణులకు తమ విధి నిర్వహణను (జ్ఞాపకము) తెలియచేయువాడును. తన ఏకరథ చక్రముపై సర్వ సృష్టిని వర్తులముగ తిరిగి రావలెనను కోర్కె కలిగినట్టి సూర్యుడు ఉదయించు చున్నాడు. ఇట్టి ప్రయా ణమునకై అతని రథమును హరి దశ్వమొక్కటియె వహించుచున్నది.

ఇచట ఒక అశ్వము వహించుచున్నది అను వాక్యములో సంఖ్యా విపరి ణామము చేసినచో సప్తాశ్వములు వహించుచున్నవను భావము వచ్చును. అట్లు కానిచో, ఒక్క అశ్వముతో కూడ రథమును నడిపింపగల ప్రజ్ఞాశాలి సూర్యుడని భావించవలెను. ఏడు పేరులును ఆ అశ్వమునకే యున్నవి.

అంతటి శక్తి శాలివియగు ఓ సూర్య! నీకు నమస్కారము.

(29)

## మహాసౌర మంత్రము - 30

విభ్రాజమాన ఉషసాముపస్థా ద్రేభైరుదేత్యను మద్యమానః।
ఏష మే దేవః సవితా చచ్ఛంద యః సమానం న ప్రమినాతి ధామ॥

### పదపాఠము :

వి-భ్రాజమానః । ఉషసామ్ । ఉప - స్థాత్ । రేభైః । ఉత్ । ఏతి । అను - మద్యమానః । ఏషః । మే । దేవః । సవితా । చచ్ఛన్ద । యః । సమానమ్ । న । ప్ర-మినాతి । ధామ ॥

### సాయణ భాష్యము :

అయం సూర్యో విభ్రాజమానో విశేషణ దీప్యమానః ఉషసాం ఉపస్థాత్ ఉపస్థే మధ్యే రేభైః స్తోతృభిః అనుమద్యమానః సన్నుదేతి। కించ ఏష దేవో ద్యోతమానః సవితా మే మహ్యం చచ్ఛన్ద ఉపచ్ఛన్దయతి కామాన్ ఏష ఇత్యుక్తమ్। క ఇతి? యో దేవః సమానం సర్వేషాం ప్రాణినా మేక రూపం ధామస్వీయం తేజః స్థానం న ప్రమినాతి న హినస్తి న సంకోచయతి। స దేవ ఉదేతి॥

(ఋక్ 7-63-3)

వాక్యాన్వయము :

(సూర్యః) విభ్రాజమానః ఉషసాముపస్థాత్ రేభైః అనుమద్యమానః ఉదేతి। ఏషదేవః సవితా మే (కామాన్) చచ్ఛన్ద యః (సః) సమానం ధామ న ప్రమినాతి॥

ప్రతిపదార్థము :

ఈ సూర్యుడు విభ్రాజమానః= విశేషమగు కాంతి (తేజస్సు) కలవాడు. అట్టి ఈతడు రేభైః = (భక్తులు చేయు) స్తోత్రములచే, అనుమద్యమానః = మిక్కిలిగ మత్తిల్లినవాడై (మిక్కిలి ఆనందించినవాడై, క్రమముగ మేల్కొల్పబడినవాడై), ఉషసాముపస్థాత్ = ఉషఃకాంత యొడినుండి, ఉదేతి = పైకి వచ్చుచున్నాడు. ఏషః దేవః= ఈ ద్యోతన శీలియగు, సవితా= సూర్యుడు, మే = నాయొక్క, (సర్వకోర్కెలను) చచ్ఛన్ద= పూర్తిచేయును. యః (సః) = అట్టి ఈతడు, సమానం= ఏకాకారముగ, ధామ= స్థానమును, న ప్రమినాతి = హింసించుట లేదు.

మహోన్నతమగు తేజస్సుతో వెలుగొందునట్టియు, యాజ్ఞికులు చేయు స్తోత్రములచే మదించినట్టి సూర్యుడు ఉషఃకాంత యొడి నుండి క్రమముగ పైకి వచ్చుచున్నాడు. ద్యోతనశీలియు, ప్రాణరక్షకుడునగు ఈ సవిత మాయొక్క సమస్త కోర్కెలను తీర్చుచున్నాడు. మరియు ఈతడు తన వాసస్థానమగు తేజో మండలముచే నెవరికిని బాధ కల్గించుటలేదు.

అనగ నితడు తన కిరణములను హఠాత్తుగ ప్రసరింపచేయుటగాని, ఉపసంహరించుటగాని చేయడు. క్రమ క్రమముగ ప్రసరించును అట్లే క్రమముగ నుపసంహరించును. ఇచట సమానం అనుదానికి ఒక్క మారుగ హఠాత్తుగ అని అర్థము చెప్పకొనవచ్చును.

అట్టి ఓ దయాశాలీ సూర్య! నీకు నమస్కారము.

(30)

# మహాసౌర మంత్రము - 31

దివో రుక్మ ఉరు చక్షా ఉదేతి దూరే అర్థస్తరణి ర్భ్రాజమానః।
నూనం జనాః సూర్యేణ ప్రసూతా అయన్నర్థాని కృణవన్నపాంసి॥

**పదపాఠము :**

దివః । రుక్మః । ఉరు-చక్షాః । ఉత్ । ఏతి । దూరే-అర్థః । తరణిః । భ్రాజమానః । నూనమ్ । జనాః । సూర్యేణ । ప్ర-సూతాః । అయాన్ । అర్థాని । కృణవన్ । అపాంసి ॥

**సాయణ భాష్యము :**

అయం సూర్యోరుక్మో రోచమానః ఉరుచక్షాః ప్రభూతతేజా శ్చసన్ దేవో న్తరిక్షాదుదేతి । యద్వా దివోన్తరిక్షస్యరుక్మ ఆభరణ స్థానీయః। కీదృశోఽయమ్? దూరే అర్థః దూరే గన్తా అర్థోఽర్తేః దూరే ప్రార్థ్యమానో వా తరణి స్తారకః భ్రాజమానో దీప్యమానః సన్నుదేతి నూనం నిశ్చయం జనాః సర్వేప్రాణినః సూర్యేణ ప్రేరకేణ దేవేన ప్రసూతా అనుజ్ఞాతాః ప్రేరితాః సన్తః అయన్ అర్థాని గన్తవ్యాని అనుష్ఠేయాని అపాంసి కర్మాణి కృణవన్= కుర్వన్తి॥

(ఋక్ 7-63-4)

మంత్రము - 31 (ఋక్ 7-63-4)

వాక్యాన్వయము :

(అయం సూర్యః) రుక్మః ఉరుచక్షాః దివః దూరే అర్థః తరణిః భ్రాజమానః ఉదేతి। నూనం జనాః సూర్యేణ ప్రసూతాః అయన్ అర్థాని అపాంసి కృణ్వన్॥

ప్రతిపదార్థము :

ఈ సూర్యుడు రుక్మః = ప్రకాశశీలి, ఉరుచక్షాః = మిక్కుటమగు తేజస్సు కలవాడు, దివః = అంతరిక్షమున, ఉదేతి = ఉదయించుచున్నాడు. (లేదా) మిక్కిలి తేజస్సు కల ఇతడు, దివః = అంతరిక్షము యొక్క, రుక్మః = అభరణము. దూరే అర్థః = సుదూరము పోవువాడు, లేద దూరమందున్న వారిచే ప్రార్థింప (అర్థింప) బడువాడు. తరణిః = పడవ - తరింప చేయువాడు. భ్రాజమానః = ప్రకాశించువాడు. ఉదేతి = ఉదయించుచున్నాడు. నూనం = నిశ్చయముగ, జనాః = సర్వప్రాణులు, సూర్యేణ = సూర్యునిచేత, ప్రసూతాః = అనుమతింపబడిన వారై, అయన్ అర్థాని = గమ్యస్థానములగు, అపాంసి = అనుష్ఠేయములగు కార్యములను, కృణ్వన్ = కుర్వన్తి = చేయుచున్నారు.

భగవంతుడగు సూర్యుడు మిక్కిలిగ ప్రకాశించువాడు. విశేషమగు తేజస్సు కలవాడు. అంతరిక్షమున కాభరణమై వెలుగొందువాడు. అట్టి ఈతడు ఉదయించు చున్నాడు. అపుడీతడు సర్వజీవులను, వారి వారి మార్గములననుసరించి వారి వారి నియమిత కర్మలను చేయునట్లు ప్రేరేపించుచు, వారిని అనుమతించుచున్నాడు. అటులనుజ్ఞాతమగు సర్వజీవరాశియు తత్తత్కర్మలందు నిమగ్నమగుచున్నది.

అట్టి ఓ సూర్య! నీకు నమస్కారము.

(31)

యత్రా చక్రు రమృతా గాతుమస్మై శ్యేనోన దీయన్నన్వేతి పాథః॥

**పదపాఠము :**

యత్ర । చక్రుః । అమృతాః । గాతుమ్ । అస్మై । శ్యేనః ।
న । దీయన్ । అను । ఏతి । పాథః ॥

సాయణ భాష్యము

యత్ర యస్మిన్నన్తరిక్షే అమృతా అమరణ ధర్మాణః పూర్వే దేవా అస్మై సూర్యాయ గాతుం మార్గం చక్రుః అకుర్వన్। తత్పాథోऽన్తరిక్షం అన్వేతి అనుగచ్ఛతి। క ఇవ? దీయన్ గచ్ఛన్ శ్యేనోన శంసనీయ గమనో గృధ్రఇవ। అయమర్థర్చః సౌర్య ఇత్యుక్తమ్॥

(ఋక్ 7-63-5)

**గమనిక :** ఈ మంత్రము [ఋక్ (7-63-5) సందలి ప్రథమార్థమును మాత్రమే సౌరమహా మంత్రములలో కూర్చిరి. దీని ద్వితియార్ధము సూర్యు నుద్దేశించినది కాదు. కనుక దానిని సౌరమందు చెప్పలేదు.]

వాక్యాన్వయము :

యత్ర అమృతాః గాతుం అస్మై చక్రుః తత్రాయం సూర్యః తత్పాథః శ్యేనః న దీయన్ (ఉషసం) అన్వేతి॥

ప్రతిపదార్థము :

[ఇది 7-63-5 ఋక్కునందలి మొదటి సగభాగము మాత్రమే. దీనినే సౌరమంత్రములందు కూర్చిరి. రెండవ పాదము సూర్యునికి సంబంధించినది కాదు కనుక దానినిట చేర్చలేదు మహర్షులు]

యత్ర = ఏ అంతరిక్షమునందు, ఎచ్చటనైతే, అమృతాః = దేవతలు, అనగ పూర్వమందు చెప్పిన మిత్రావరుణులు, యమాగ్నులు మొదలగువారు, అస్మై = ఈ సూర్యుని కొరకు, గాతుం= గమనము కొరకగు మార్గమును చక్రుః= చేసిరి (చేసిరో) తత్ పాథః= ఆ మార్గమున నితడు, శ్యేనః న= డేగ వలె, దీయన్ = పోవుచు (ఉషఃకాంతను) అన్వేతి = వెంబడించుచుండెను. అనుసరించుచుండెను.

దీప్తిరూపుడగు సూర్యుని గమనము కొరకు అంతరిక్షమున దేవతలు నిర్మించిన మార్గము వెంబడి ఆ ఆదిత్యుడు బలిష్ఠమగు డేగవలె ఉషః కాంతను వెంబండించుచుండెను. లేదా డేగవలె క్రమముగ పోవుచుండెను.

అట్టి ఓ సూర్య! నీకు నమస్కారము. (32)

## మహాసౌర మంత్రము - 33

ఉదుత్యద్దర్శతం వపుర్దివ ఏతి ప్రతిహ్వారే
యదీమాశు ర్వహతి దేవ ఏతశో విశ్వస్మై చక్షసే అరమ్॥

ాఠము :

ఉత్ । ఊంధ ఇతి । త్యత్ । దర్శతమ్ । వపుః । దివః । ఏతి ।
- హ్వారే । యత్ । ఈమ్ । ఆశుః । వహతి । దేవః । ఏతశః ।
స్మై । చక్షసే । అరమ్ ॥

ణ భాష్యము:

త్యత్ తత్ దర్శతం దర్శనీయం వపుర్మండలం దివోఽన్తరిక్షస్య ప్రతిహ్వారే ఉదు ఏతి ఉదేతి । ఉఇతి పూరణః । యదీం యదే తన్మండలం శీఘ్రగామీ ఏతశో ఏతవర్ణోఽశ్వో వహతి । ధారయతి । కిమర్థం? విశ్వస్మై అరం చక్షసే సమ్యక్ సర్వలోక దర్శనాయ॥

(ఋక్ 7-66-14)

మంత్రము - **33.** ఋక్ **7-66-14**

వాక్యాన్వయము :

త్యత్ దర్శతం వపుః దివః ప్రతిహ్వారే ఉదేతి। యదీం
అశుః దేవః ఏతశః విశ్వస్మై చక్షసే అరం వహతి॥

ప్రతిపదార్థము

త్యత్ = అట్లు మిక్కిలి ప్రసిద్ధుడైనట్టియు, దర్శతమ్ = దర్శనీయమగు - చూడముచ్చట గొలుపు, వపుః = శరీరము, స్వరూపము - భానుమండలము, దివః = అంతరిక్షము యొక్క, ప్రతిహ్వారే = సమీపమందు, ఉదేతి = ఉదయించు చున్నది. యత్ = ఈ ఏమండలమైతే - అనగ ఆ సూర్యముండలము, అశుః = వేగముగ పోవునట్టి, దేవః, ద్యోతనశీలియగు ఆ సూర్యుని కల్గియున్నదో, అట్టి ఆ సూర్య మండలమును, ఏతశః = హరిత వర్ణమగు అశ్వము, విశ్వస్మై = సర్వలోకముల కొరకు, చక్షసే = ప్రకాశింప చేయుటకు, అరం = దృఢముగ, వహతి = వహించున్నది.

సుప్రసిద్ధమై సర్వదర్శనీయమునగు సూర్యమండలము నభోవీధి నుదయించు చున్నది. మహా తేజో మయమగు ఆ సూర్యబింబమును సర్వలోకములు, సర్వజీవులు చూచుటకుగాను, లేదా ఆ సూర్యభగవానుడె సర్వజగత్తును దర్శించుటకుగాను, ఏత వర్ణియమును శీఘ్రగామియునగు అశ్వమొకటి దృఢముగ ఆ సూర్యమండలమును వహించు చున్నది.

ఇట్టి రథారూఢుడవగు ఆదిత్య! నీకు నమస్కారము.

(33)

# మహాసౌర మంత్రము 34.

శీర్ష్ణః శీర్ష్ణో జగతస్తస్థు షస్పతిం సమయా విశ్వమా రజః।
సప్త స్వసారః సువితాయ సూర్యం వహంతి హరితో రథే॥

పదపాఠము :

శీర్ష్ణః - శీర్ష్ణః । జగతః । తస్థుషః । పతిమ్ । సమయా । విశ్వమ్ । ఆ । రజః । సప్త । స్వసారః । సువితాయ । సూర్యమ్ । వహన్తి । హరితః । రథే ॥

సాయణ భాష్యము

శీర్ష్ణః శీర్ష్ణః సర్వస్యాపి శిరసః తృతీయార్థే పంచమీ స్వస్వ శిరసా ఇత్యర్థః। సూర్యం వహన్తీ త్యనేన సంబధ్యతే। అథవా శిరః శబ్దేన తద్వాన్ పదార్థో లక్ష్యతే వీప్సయా తస్య కార్త్స్న్యముచ్యతే। సర్వస్య శ్రేష్ఠ మిత్యర్థః। జగతో జంగమస్య తస్థుషః స్థావరస్య పతిం స్వామినం రథే వర్తమానం సూర్యం సవితాయ కల్యాణాయ విశ్వం రజః సమయా సర్వలోకస్య సమీపే అభితః పరితః సమయే త్యాదినా సమయాశబ్దయోగాత్ ద్వితీయా। సప్త సప్తసంఖ్యాకాః స్వసారః అన్యనిరపేక్షేణ స్వయమేవ సరన్త్యో హరితో హరిద్వర్ణా అశ్వా ఆవహన్తి॥

(ఋక్ 7-66-15).

వాక్యాన్వయము :

శీర్ష్ణః శీర్ష్ణః జగతః తస్థుషః పతిం రథే సువితాయ విశ్వం
రజః సమయా హరితః సప్తస్వసారః వహన్తి।

ప్రతిపదార్థము :

శీర్ష్ణః శీర్ష్ణః = ప్రతి శిరస్సుతోను, (ఈ భావము ఇచ్చట ద్విరుక్తి చేతను, విభక్తి వ్యత్యయము చేతనుతెలియును) జగతః తస్థుషః (చ) = జంగమ స్థావరరూపమగునట్టి లోకమునకు, పతిం = ప్రభువగు సూర్యుని, రథే = రథమందు, సువితాయ = లోకకల్యాణమునకై, విశ్వం రజః సమయా= సర్వలోక చక్రమునకు (మార్గమునకు) సమీపముగ, హరితః = హరిద్వర్ణము కలిగిన, సప్త స్వసారః = ఏడుగురు సోదరీమణులు - స్వయముగ, తమంత తామె రథమును వహించునట్టి సప్తాశ్వములు; వహన్తి = వహించుచున్నవి ॥ .

ఆదిత్యుడు తన రథమున ఉపవిష్టుడయ్యెను. అపుడతనిని స్వయం చోదితములై హరిద్వర్ణము కల్గిన సప్తాశ్వములు తమ తమ శిరస్సులందు దృఢముగ, దిక్చక్రమునకు సమీపముగ, లోక కల్యాణమునకై స్థావరజంగమాది సమస్త సృష్టియు చూచునట్లుగ వహించు చున్నవి.

అదుగో ఆ సూర్యుని చూడుడు.

అట్టి ఓ దేవ! సూర్య! నీకు నమస్కారము.

(34)

## మహాసౌర మంత్రము 35.

తచ్చక్షు ర్దేవహితం శుక్రముచ్చరత్।
పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతమ్॥

పదపాఠము :

తత్ । చక్షుః । దేవ-హితమ్ । శుక్రమ్ । ఉత్-చరత్ । పశ్యేమ । శరదః । శతమ్ । జీవేమ । శరదః । శతమ్ ॥

సాయణ భాష్యము

తత్ప్రసిద్ధం చక్షుః సర్వస్య ప్రకాశకం దేవహితం దేవానాం హితం తేషాం హవిః స్వీకారస్య  ఏతదధీనత్వాత్, అథవా, దేవేన హితం శుక్రం నిర్మలం సూర్య మండలం ఉచ్చరత్ ఉద్గచ్ఛతి। తత్ శరదః శతం। శత సంవత్సరం పశ్యేమ, జీవేమ శరదః శతం పునః శ్రుతిరాదరార్థా॥

(ఋక్ 7-66-16)

వాక్యాన్వయము :

తత్ శుక్రం దేవహితః చక్షుః ఉచ్చరత్। తద్వయం శతం
శరదః పశ్యేమ। శరదః శతః జీవేమ॥

ప్రతిపదార్థము :

తత్ = అట్లు ప్రసిద్ధమగు, శుక్రమ్ = శుభ్రమగు, తేజోమయమగునట్టియు, దేవహితమ్= దేవతలకుహితకారి యగునట్టి, చక్షుః = సర్వప్రకాశకమగు సూర్యబింబము, ఉచ్చరత్ = ఉదయించు చున్నది. తత్ = అట్టి సూర్యోదయములను, శతం శరదః = నూరు శరత్కాలములు, పశ్యేమ = చూతుముగాక. శతం శరదః = నూరు శరత్కాలములు, జీవేమ = జీవింతుముగాక॥

నిర్మల స్వరూపుడు సర్వతేజోమయుడునగు సూర్యుడు దేవతల హితము కోరువాడై, అంతరిక్షమున ఉదయించు చున్నాడు. సూర్యోదయానంతరమె గద యాజ్ఞికులు దేవతలకు హవిస్సుల నర్పింతురు. ఈ విధముగ సూర్యుడు తన గమనము ద్వార దేవతలకు హితమును, ప్రియమును కూర్చు చున్నాడు. ఈతడు దేవతలకేకాక, స్థావర జంగమ రూపమగు సర్వలోకమునకు ఉపకారము చేయు చున్నాడు. అట్టి మహోన్నతుడగు సూర్యుని మనము శత సంవత్సరములు అవిచ్ఛిన్నముగ చూచుచు జీవింతుము గాక.

ఈ విధముగ సూర్యోపాసకుడు పూర్ణాయురారోగ్యైశ్వర్యములను కోరుకొనుచున్నాడు.

అంతటి శక్తిగల్గిన ఓ సూర్య! నీకు నమస్కారము.

(35)

## మహాసౌర మంత్రము 36.

బణ్మహాగుం అసి సూర్య బళాదిత్య మహాగుం అసి।
మహాస్తే సతో మహిమా పనస్యతేఽద్ధా దేవ మహాగుం అసి॥

పదపాఠము :

బట్ । మహాన్ । అసి । సూర్య । బట్ । ఆదిత్య । మహాన్ । అసి । మహః । తే । సతః । మహిమా । పనస్యతే । అద్ధా । దేవ । మహాన్ । అసి ॥

సాయణ భాష్యము :

హే సూర్య త్వం మహాన్ తేజసాఽధికోఽసి బట్ సత్యం। నైతన్మిథ్యేత్యర్థః। హే ఆదిత్య అదితేః పుత్ర త్వం మహాన్ బలేనాప్యధికోఽసి। బట్ సత్యమ్। మహోమహతః సతో భవతః తే మహిమా మహత్త్వం పనస్యతే స్తోతృభిః స్తూయతే। హే దేవ! ద్యోతనాది గుణయుక్త సూర్య! త్వం మహాన్ వీర్యేణాప్యధికోఽసి। భవసి। అద్ధా సత్యమేవ అత్ర న సంశయ ఇత్యర్థః॥ బట్, సత్రా, అద్ధా ఇతి సత్యనామసు పాఠాత్॥

(ఋక్ 8-101-11)

వాక్యాన్వయము :

హే సూర్య! తేజసా మహాఁ అసి। బట్। ఆదిత్య! మహాఁ అసి।
మహః సతః తే మహిమా పనస్యతే। దేవ మహాఁ అసి అద్ధా॥

ప్రతిపదార్థము :

హే సూర్య = సర్వ జీవ ప్రేరక, ఓ ఆదిత్య! నీవు, తేజసా = దీప్తిచే, మహాన్= అధికుడవు, అసి = అగుచున్నావు. బట్ = ఇది సత్యము. హే ఆదిత్య! = ఓ అదితి పుత్ర సూర్య! నీవు బలముచే, మహాన్ = ఉత్కృష్టుడవు. అసి = అగుచున్నావు. మహః సతః = మహా సత్త్వ సంపన్నుడవగు, తే = నీ యొక్క, మహిమా = మహత్త్వము (అధికృత), పనస్యతే = స్తోత్రము చేయబడుచున్నది. హే దేవ = ఓ ప్రకాశక నీవు శక్తి సంపన్నతచే కూడ,మహాన్ అసి = అత్యధికుడవగు చున్నావు. అద్ధా = ఇది సత్యము.

సర్వలోక ప్రేరకుండవగు ఓ భాస్కర! నీ యొక్క తేజస్సుచే నీవు దేవ మనుష్య గంధర్వాది సర్వులను అధిగమించుచున్నావు. ఓయి అదితి పుత్ర! బలమునందు, సత్త్వ సంపత్తియందు, ఓజస్సు యందును నీవు అన్నివిధముల అందరి కంటెను అధికుడవు. నీకు సాటియైన వారేలేరు. ఇక నీ కంటె అధికులెక్కడ నుందురు. ఓ ప్రభు! నీ యొక్క సర్వ మహత్త్వము మా అందరిచే స్తుతింపబడు చున్నది. ఈ మా వాక్కులు, మేము చేయు స్తోత్రములన్నియు సత్యములె. ఇందతిశయోక్తులు లేవు.

అట్టి ఓ సూర్య! నీకు నమస్కారము.

(36)

# మహాసౌర మంత్రము 37

బణ్ సూర్య శ్రవసా మహాఁ అసి సత్రా దేవ మహాఁ అసి।
మహ్నా దేవానామసుర్యః పురోహితో విభు జ్యోతి రదాభ్యమ్॥

పదపాఠము

బణ్ । సూర్య । శ్రవసా । మహాన్ । అసి । సత్రా । దేవ । మహాన్ । అసి । మహ్నా । దేవానామ్ । అసుర్యః । పురః-హితః । వి- భు । జ్యోతిః । అదాభ్యమ్ ॥

సాయణ భాష్యము :

హే సూర్య! త్వం శ్రవసా శ్రవణేన మహాన్ సర్వాధికోఽసి। బణ్ సత్యమ్। హే దేవ ద్యోతమాన సూర్య త్వం దేవానాం మధ్యే మహ్నా మహత్త్వేన మహాన్ అధికోఽసి। సత్రా సత్యమేవ। అసుర్యః అసురాణాం హన్తాచాసి। కిం చ త్వం దేవానాం పురోహితో హితోప దేష్టాఽసి। కిం చ తే జ్యోతిస్తేజో విభు మహత్ అదాభ్యం కేనాపి అహింస్యమ్॥ చ ॥

(ఋక్ 8-101-12)

వాక్యాన్వయము :

హేసూర్య! త్వం శ్రవసా మహాన్ అసి బట్। హే దేవ దేవానాం మహ్నా మహాన్ అసి। సత్రా। త్వం అసుర్యః, పురోహితః। తవ విభు జ్యోతి అదాభ్యమ్॥

ప్రతిపదార్థము :

హే సూర్య! త్వం నీవు, శ్రవసా అన్నముచే ధనముచే కీర్తిచేతను, మహాన్ = సర్వాధికుడవు, అసి = అగుచున్నావు. బట్ = ఈ మాట సత్యము. హేదేవ = ఓ దీప్తిశాలి!, దేవానాం = దేవతలకు కూడ, (దేవతల మధ్య), మహ్నా = మహిమచేత, మహాన్ అసి = సర్వాధికుడవగు చున్నావు. సత్రా = అది సత్యము. త్వమ్= నీవు, అసుర్యః = ప్రజ్ఞాశాలివి. రాక్షసులను నాశనము చేయు వాడవు. పురోహితః = దేవతలకు, మానవులకు సర్వశ్రేయో భిలాషివి. అట్టి నీ యొక్క, విభు = అత్యధికమగు, జ్యోతిః = తేజస్సు, అదాభ్యమ్ = ఇతరులచే ఎదుర్కొనలేనిది. హింసింపరానిది.

సర్వలోక ప్రకాశక! ఓ సూర్య! నీవు జీవాధారమగు అన్నాద్యోషధీ దానము చేతను, ఐశ్వర్యదానము చేతను ప్రసిద్ధుడవైతివి. ఇది సత్యము. దేవ తల మధ్య నీవు మహత్త్వముచే మహాత్ముడ వైతివి. ఈ మా మాటయు సత్యమే. నీవు ప్రజ్ఞాశాలివి. సాత్త్విక స్వభావముగల్గిన మానవుల హింసించు రాక్షసులను నాశనము చేయువాడవు. సర్వలోక హితైషివి. నీ యొక్క ఆధిక్య తను, తేజస్సును ఎవరును ఎదుర్కొనలేరు. నిన్ను ఎవరును బాధించలేరు. నీవు అజేయుడవు. అనభి భూతుడవు. ఇది సత్యము.

సత్యదేవ! సూర్య! నీకు నమస్కారము.

(37)

# మహాసౌర మంత్రము 38.

నమో మిత్రస్య వరుణస్య చక్షసే మహో దేవాయ తదృతం సపర్యత।
దూరే దృశే దేవజాతాయ కేతవే దివస్పుత్రాయ సూర్యాయ శంసత॥

**పదపాఠము :**

నమః । మిత్రస్య । వరుణస్య । చక్షసే । మహః । దేవాయ । తత్ । ఋతమ్ । సపర్యత । దూరే-దృశే । దేవ-జాతాయ । కేతవే । దివః । పుత్రాయ । సూర్యాయ । శంసత ॥

**సాయణ భాష్యము :**

హే ఋత్విజో యూయం మిత్రస్య వరుణస్య మిత్రా వరుణయో శ్చక్షసే ద్రష్ట్రే మహో మహతే దేవాయ ద్యోతమానాయ దూరేదృశే దూరే సంతమపి పశ్యతే దేవజాతాయ దేవేషుజాతాయ, దేవార్థముత్ప న్నాయ కేతవే విశ్వస్య ప్రజ్ఞాపకాయ, దివః పుత్రాయ పుత్ర భూతాయ దివి జాయమానత్వాత్ తత్పుత్రత్వ వ్యపదేశః సూర్యాయ సూర్యార్థం నమః కృత్వా తద్విహితం ఋతం యాగాది లక్షణం కర్మ సపర్యత. పూజయత శంసత స్తుతిమపి కురుత॥

(ఋక్ 10-37-1)

వాక్యాన్వయము :

(హే ఋత్విజః!) మిత్రస్య వరుణస్య చక్షసే మహః దేవాయ తత్ ఋతం సపర్యత । దూరే దృశే దేవజాతాయ కేతవే దివస్పుత్రాయ శంసత॥

ప్రతిపదార్థము :

హే ఋత్విజః = ఓ ఋత్విజులార! (యజ్ఞయాగాది కర్మలనాచరించు యజమానులార!) మిత్రస్య వరుణస్య = మిత్రావరుణుల యొక్క (కు), చక్షసే = చక్షు స్థానీయుడగు (తేజస్సు నొసంగెడి), మహః = మహోత్కృడగు, దేవాయ = ద్యోతనశీలియగు సూర్యుని కొరకు, తత్ ఋతం = ఆ సత్యబద్ధమైన కర్మను, శాస్త్రవిహితమగు యజ్ఞయాగాది కర్మలను, హవిరాదికమునెల్ల, సపర్యత = ఆచరించుడు, దూరే దృశే = మిక్కిలి దూరమునుండి చూచునట్టియు (చూడ బడునట్టియు), దేవజాతాయ = దేవతల మధ్య జన్మించినట్టియు, కేతవే = ప్రజ్ఞాపకుండుగు, దివస్పుత్రాయ = ద్యులోక పుత్రుడగు సూర్యునికొరకు, శంసత = స్తోత్రములు చేయుడు.

ఓ ఋత్విజులార! అహరభిమానియగు మిత్రునకు, సర్వారిష్ట నివారకుం డును, రాత్ర్యభిమానియగు వరుణునకు గూడ చక్షుస్థానీయుడై, ప్రకాశమును కల్గించు నట్టియు, మహత్త్వ సంపన్నుడు, ద్యోతన శీలియగు సూర్యుని విధి విహి తములగు యాగాది కర్మల నాచరించుట ద్వార ఆరాధింపుడు. ఈ ఆదిత్యుడు సుదూరము నుండియు మిక్కిలి దూరముగనున్న సమస్తజీవులను చూచువాడు. దేవతాగణముల కొరకై ఉదయించు వాడు. తన రశ్మలనె ప్రజ్ఞాపకములగు ధ్వజములుగ చేసి, సమస్త లోకములకు తమ విధులను జ్ఞాపకము చేసి, వారి నాయాకర్మలందు ప్రేరేపించువాడు. ద్యులోకపుత్రుడు. అట్టి ఈ సూర్యుని కర్మలనాచరించుట వలననె గాక, స్త్రోత్రములచే కూడ నారాధింపుడు.

(38)

## మహాసౌర మంత్రము 39

సా మా సత్యోక్తిః పరిపాతు విశ్వతో ద్యావా చ యత్ర తతనన్నహాని చ।
విశ్వమన్యన్నివిశతే యదేజతి విశ్వాహాపో విశ్వాహోదేతి సూర్యః॥

**పదపాఠము :**

సా । మా । సత్య-ఉక్తిః । పరి । పాతు । విశ్వతః । ద్యావా । చ ।
యత్ర । తతనన్ । అహాని । చ । విశ్వమ్ । అన్యత్ । ని । విశతే ।
యత్ । ఏజతి । విశ్వాహా । ఆపః । విశ్వాహా । ఉత్ । ఏతి । సూర్యః ॥

**సాయణ భాష్యము :**

సా సత్యోక్తిః తత్సత్యవచనం మా మాం విశ్వతః సర్వతః పరిపాతు, పరిరక్షతు । యయా సత్యోక్త్యా యత్ర యస్మిన్దేశే ద్యావాచ ద్యావా పృథివ్యా వహాని రాత్రయశ్చ తతనన్ అతన్వన్ తత్ర విశ్వం సత్యమన్యత్ భూతజాతం నివిశతే । యదేతద్భూతజాత మేజతి కంపతే । విశ్వాహా సర్వదా ఆపశ్చ స్యందతే విశ్వాహా సర్వదా సూర్యశ్చోదేతి । సా సత్యోక్తిర్మాం పరిపాత్విత్యర్థః॥

(ఋక్ 10-37-2)

వాక్యాన్వయము :

సా సత్యోక్తిః మా విశ్వతః పరిపాతు । యత్ర ద్యావా చ అహానిచ తతనన్ । (తత్ర) విశ్వమన్యత్ నివిశతే యదేజతి విశ్వాహా అపః చ విశ్వాహా సూర్యః ఉదేది॥

ప్రతిపదార్థము :

సా సత్యోక్తిః = ఈ చెప్పబోవు సత్యవాక్కు, మా = నన్ను, విశ్వతః = అన్నివైపుల నుండి, పరిపాతు = రక్షించుగాక, ఆ సత్యవాక్కులచే, యత్ర = ఎచట (అంతటను) అనగ, ద్యావాచ = ద్యావా పృథ్వ్యులు, అహానిచ = అహోరాత్రములు, తతనన్ = విస్తరిల్లుచున్నవి. అచట, విశ్వమన్యత్ = సమస్త భూతజాతము, నివిశతే = విశ్రమించుచున్నది. (సుఖముగ జీవించుచున్నది) యత్ = ఈ భూతజాతము, ఏజతి = కంపించుచున్నది. విశ్వాహా = ఎల్లపుడు, అపశ్చ= ఉదకములు కూడ (కంపించుచున్నవి - ప్రవహించుచున్నవి) విశ్వాహా = అంతటను, సూర్యః = సూర్యుడును, ఉదేతి = ఉదయించుచున్నాడు.

ఓ జనులార! నేను సత్యము చెప్పుచున్నాను. ఈ భూమ్యాకాశములు, రాత్రింబవళ్ళు సూర్యుని వలనె వృద్ధి పొందుచున్నవి. సమస్త భూతజాతమును ఆయా కాలములందు ఆయా స్థానములలో విశ్రమించుచున్నవి. ఈ సూర్యుని చూచి సర్వులు భయపడుచున్నారు. ఈ జలములు కూడ నిలకడ లేకుండ ఎల్లపుడు ప్రవహించుచునే యున్నవి. ఈ విధముగ సర్వజగత్తును నియమనము చేయుచు, సూర్యుడు నిత్యమునుదయించు చున్నాడు. ఇది సత్యము. ఈ సత్యమును తెలిసి, నే చెప్పిన ఈ సత్యవాక్కులు నన్నెల్లపుడు అన్ని విధములుగను రక్షించుగాక.

ఓ ఆదిత్య! భాస్కర! ప్రభాకర! సూర్యా! నీకు నమస్కారము

## మహాసౌర మంత్రము 40

న తే అదేవః ప్రదివో నివాసతే యదేతశేభిః పతరై రథర్యసి।
ప్రాచీన మన్య దనువర్తతే రజ ఉదన్యేన జ్యోతిషా యాసి సూర్య॥

**పదపాఠము :**

న । తే । అదేవః । ప్ర-దివః । ని । వాసతే । యత్ । ఏతశేభిః । పతరైః । రథర్యసి । ప్రాచీనమ్ । అన్యత్ । అను । వర్తతే । రజః । ఉత్ । అన్యేన । జ్యోతిషా । యాసి । సూర్య ॥

**సాయణ భాష్యము :**

హే సూర్య తే తవ సమీపే ప్రదివః ప్రత్నః పురాతనః కశ్చిదదేవః అసురో రాక్షసోవా న నివాసతే న వివసతి । కదేత్యత అహ । యద్యదా త్వ పతరైర్గమన శీలై రేతశేభిః అశ్వైః రథర్యసి రథం కామయసే యోక్తుమ్ । కించ ప్రాచీన మన్యత్ త్వదీయం జ్యోతిః రజ ఉదకమనువర్తతే । అన్యేన తేన జ్యోతిషా ఉద్యాసి ఉదేషి । యద్వా ప్రాచీన మన్య ద్రజశ్చంద్రా మాఖ్యం జ్యోతిస్త్వామను వర్తతే । తతస్త్వమన్యేన జ్యోతిషా సహోదేషీత్యర్థః॥

(ఋక్ 10-37-3)

వాక్యాన్వయము :

హే సూర్య! యత్ పతద్భిః ఏతశేభిః రథర్యసి (తదా) తే ప్రదివః అదేవం న నివాసతే । (తథాపి) ప్రాచీన మన్యత్ (వర్తతే) యద్రజః (త్వాం) అనువర్తతే । (ఏవం త్వం) అన్యేన జ్యోతిషా (అను వర్తమానః) ఉద్యాసి॥

ప్రతిపదార్థము :

హే సూర్య! = ఓ ఆదిత్య, యత్ = ఎప్పుడైతే, పతద్భిః = నిత్యగమన శీలులగు, ఏతశేభిః = హరిత వర్ణములగు అశ్వములతో కూడిన, రథర్యసి = రథముపై వెళ్ళుదువో, (తదా = అపుడు) తే = నీ సమీపమున, ప్రదివః = పురాతనములు, అదేవం = కాంతి హీనములైనట్టి దేదియును, న నివాసతే = ఉండదు. అయినను, ప్రాచీనమ్ = తూర్పు దిక్కున, అన్యత్ = వేరొకటి (నీ కంటె భిన్నమైనది) ఒకటి కలదు. అది ఏదియనిన, యత్ రజః = ఏ (అ) ఉదకము. అది నిన్ను, అనువర్తతే = అనుసరించి యుండును. ఈ విధముగ నీవు, అన్యేన జ్యోతిషా = వేరొక కాంతి మండలముచ్చే, అనుసరింపబడుచు, ఉద్యాసి = ఉదయించుచుంటివి.

ఓ సూర్యభగవాన్! నీవు ఉదయించు నపుడు నీ సరసన నీకంటె ప్రకాశవంతమగు తేజోరాశి వేరెదియు లేదు. అది నిజమే. కాని తూర్పుదిక్కున నీవు ఉదయించునపుడు వేరొక వింత జరుగుచున్నది. ఉదకము (కూడ) లేదా ఉదక స్థానమగు చంద్రమండలము, తేజో రూపమున నిన్ననుసరించి వచ్చుచున్నది. లేదా నీ జ్యోతి నాశ్రయించి వచ్చు ఆ వేరొక జ్యోతిని సామాన్యులు గ్రహించలేరు. అది నీ తేజస్సు నందడంగి యుండును. అయినను అది సత్యము. నీ తేజస్సు ననుసరించుచు వేరొక జ్యోతిశ్చక్రము వచ్చుచున్నది.

అట్టి ఓ సూర్య! నీకు నమస్కారము.

(40)

యేన సూర్య జ్యోతిషా బాధసే తమో జగచ్చ విశ్వముదియర్షి భానునా।
తేనాస్మ ద్విశ్వామని రామనాహూతి మపామీవా మపదుష్ష్వప్న్యం సువ॥

పదపాఠము :

యేన । సూర్య । జ్యోతిషా । బాధసే । తమః । జగత్ । చ । విశ్వమ్ । ఉత్-ఇయర్షి । భానునా । తేన । అస్మత్ । విశ్వామ్ । అనిరామ్ । అనాహూతిమ్ । అప । అమీవామ్ । అప । దుః-స్వప్న్యమ్ । సువ ॥

సాయణ భాష్యము :

హే సూర్య త్వం యేన జ్యోతిషా తేజసా తమోన్ధకారం, బాధసే, నివారయసి, యేన చ భానునా తేజసా విశ్వం సర్వం జగత్ జంగమమం ఉదియర్షి ఉద్గమయసి తేన జ్యోతిషా అస్మదస్మత్తః విశ్వాసం సర్వాం అనిరాం అన్నాభావం అనాహూతిం అహోమం చామీవాం రోగజాతం చాపసువ అపగమయ దుఃస్వప్న్యం దుఃస్వప్నప్రభవ మరిష్టం చాపసువ॥

(ఋక్ 10-37-4)

వాక్యాన్వయము :

హే సూర్య! యేన జ్యోతిషా తమః బాధసే విశ్వం జగత్ చ ఉదియర్షి। తేన భానునా అస్మత్ విశ్వామనిరాం అనాహుతిం అమీవాంశ్చ అపసువ। దుఃస్వప్న్యం చ (అపసువ) ॥

ప్రతిపదార్థము

హే సూర్య = ఓ సూర్య!, యేన జ్యోతిషా = ఏ తేజస్సుతో (నీవు), తమః = తమస్సును, చీకట్లను, బాధసే = పోగొట్టు చుంటివో, విశ్వం జగత్ చ = సమస్త సృష్టియు,ఉదియర్షి = ప్రకాశింప చేయుచు, ఉదయించు చుంటివో, తేన = ఆకాంతిచే, అస్మత్ = మాయొక్క, విశ్వాం = సమస్తమగు, అనిరామ్= అన్నా భావము (దుర్భిక్షము), అనాహుతిమ్ = హోమా భావము (కాష్టలోపము), అమీవాన్ చ = రోగ బాధలను, అపసువ = పరిహరింపు, దుఃస్వప్న్యం = దుస్స్వప్నదోషములను కూడ (పరిహరింపుము).

ఓ సూర్యదేవ! నీవు నీ తేజస్సుతో మాకు రాత్రి బాధను తొలగించు చున్నావు. చీకట్లను, శీతల బాధను పారద్రోలు చున్నావు. అదే తేజస్సుతో సర్వలోకములందు పరిభ్రమించు చున్నావు. కనుక నో ప్రభు! అదే తేజోమండల ప్రభావముతో మాకు ఆహారమునకు లోపము లేకుండునట్లు, నీ సేవలో మా యజ్ఞయాగాది క్రియలకు కాష్టలోపము లేకుండునట్లు అనుగ్రహించుము. మరియు రోగ సముదాయము మమ్ము చేరకుండునట్లుగ దూరముగ తొలగింపుము. మాకు దుఃస్వప్నములు రారాదు. ఒక వేళ దుఃస్వప్నములు వచ్చినను, వానిచే సూచింపబడు దుష్ఫలితములు మమ్ము చేరకుండునట్లు అనుగ్రహింపుము.

ఈ విధముగ ఆయురారోగ్యైశ్వర్యములను కూర్చెడి ఓ సూర్య! నీకు నమస్కారము

(41)

## మహాసౌర మంత్రము 42.

విశ్వస్య హి ప్రేషితో రక్షసి వ్రతమహేళయ న్నుచ్చరసి స్వధా అను। యదద్య త్వా సూర్యో పబ్రవామహై తం నో దేవా అనుమంసీరత క్రతుమ్॥

పదపాఠము :

విశ్వస్య । హి । ప్ర-ఇషితః । రక్షసి । వ్రతమ్ । అహేళయన్ । ఉత్-చరసి । స్వధాః । అను । యత్ । అద్య । త్వా । సూర్య । ఉప-బ్రవామహై । తత్ । నః । దేవాః । అను । మంసీరత । క్రతుమ్ ॥

సాయణ భాష్యము :

హే సూర్య ప్రేషితః ప్రేరితః త్వమహేళయన్ అక్రుధ్యన్ విశ్వస్య సర్వస్య యజమానస్య వ్రతం కర్మ రక్షసి హి యజ్ఞవిధ్వంసకేభ్యో రాక్షసేభ్యః పాలయసి। స్వధాహ్యేధింష్యను ఉచ్చరసి ఉద్గచ్ఛసి। ప్రాతర్హోమే నివృత్తే సతి పశ్చాదుద్గచ్ఛసీత్యర్థః। తథాచ యద్యదాద్యస్మిన్ అహని త్వా త్వాం ఉపబ్రవామహై ఉపబ్రూమః, తదా నోఽస్మాకం తం క్రతుం తత్కర్మ దేవా ఇంద్రాదఽనుమంసీరత అనుమన్యన్తామ్॥

(ఋక్ 10-37-5)

**వాక్యాన్వయము :**

హే సూర్య ప్రేషితః అహేళయన్ విశ్వస్య వ్రతం రక్షసి। స్వధా అను అచ్చరసి। యదద్య త్వాం ఉపబ్రవామహై తత్ నః క్రతుం దేవాః మంసీరత॥

**ప్రతిపదార్థము :**

హే సూర్య! నీవు, ప్రేషితః = పంపబడిన వాడవగుచు, (ప్రేరేపింప బడిన వాడవై), అహేళయన్ = కోపములేకుండ, విశ్వస్య = లోకముయొక్క, వ్రతం = యాగాది కర్మను, జీవన క్రమమును, రక్షసి = రక్షించు చుంటివి. స్వధాః అను = స్వాహాకారములతో నీయబడు హవిస్సుల ననుసరించుచు, ఉచ్చ రసి = ఆకాశమున మిక్కిలిపైకి పోవుచున్నావు. అద్య = ఇప్పుడు, యత్ త్వాం = అట్టి నిన్ను, ఉపబ్రవామహై = ప్రార్థించుచున్నాము. తత్ = అట్టి మా ప్రార్థనను, నః క్రతుం = మా యొక్క యజ్ఞకర్మను, దేవాః = ఇంద్రాది దేవతలు, మంసీరత= ఆమోదింతురుగాక.

ఓ సూర్య! బహువిధముల మాచే ప్రేరేపించబడియు (మాచే పిలవ బడు చున్నను) మాపై కోపింపక, మేము చేయు సర్వయజ్ఞ కార్యములను రాక్షసాది దుష్టుల నుండి రక్షించుచున్నావు. మా ప్రాతః సవనాది హవిర్దానముల తరు వాతనె నీవు ఉదయించుచున్నావు. మరియు మేము చేయు జపహోమ దానాది కార్యములను ఇంద్రాది దేవతలు ప్రీతులై గ్రహింతురు గాక. మా కార్యములను ఆమోదింతురుగాక- అని నిన్ను ప్రార్థించుచున్నాము.

సర్వ దేవతలకు తేజస్సును సూర్యుడె ఇచ్చుచున్నాడు. కనుక వారితని మాటను గౌరవించి ఆచరింతురు. కనుక సూర్యుని ప్రార్థించినచో ఇతరులను వేరుగ ప్రార్థించ నక్కరలేదు.

కనుక అట్టి ఓ ఆదిత్య! నీకు నమస్కారము.

(42)

తం నో ద్యావా పృథివీ తన్న ఆప ఇంద్రః
శృణ్వన్తుమరుతో హవం వచః।
మా శూనే భూమ సూర్యస్య సందృశి
భద్రం జీవన్తో జరణామశీమహి।

పదపాఠము :

తమ్ । నః । ద్యావా పృథివీ ఇతి । తత్ । నః । అపః । ఇన్ద్రః ।
శృణ్వన్తు । మరుతః । హవమ్ । వచః । మా । శూనే । భూమ । సూర్యస్య ।
సమ్-దృశి । భద్రమ్ । జీవన్తః । జరణామ్ । అశీమహి ॥

సాయణ భాష్యము :

ద్యావా పృథివీ ద్యావా పృథివ్యౌ ఆపశ్చ ఇన్ద్రశ్చ మరుతశ్చ నోఽస్మాకం తంహవమాహ్వానం నోఽస్మాకం తద్వచః స్తుతిరూపం వాక్యం చ। న ఇతి ద్విరుక్తి రాదరార్థా। శృణ్వన్తు। కించ వయం సూర్యస్య సందృశి సందర్శనే శూనే ప్రవృద్ధాయ దుఃఖాయ మా భూమ మైవ భవేమ। కిన్తు జీవన్తః చిరం ప్రాణాన్ ధారయన్తో వయం భద్రం కల్యాణం జరణా వృద్ధ త్వమమరత్వం చాశీమహి ప్రాప్నవామ॥

(ఋక్ 10-37-6)

వాక్యాన్వయము :

ద్యావా పృధివీ ఆపః ఇంద్రః మరుతః నః తం హవం, నః తం వచః శృణ్వన్తు, సూర్యస్య సందృశి శూనే మాభూమ। జీవన్తః భద్రం జరణా మశీమహి॥

ప్రతిపదార్థము :

ధ్యావాపృథివీ = భూమ్యాకాశములు, ఆపః = ఉదకములు, ఇంద్రః = ఇంద్రుడు, మరుతః= మరుద్దేవతలు, వీరందరు, నః= మాయొక్క తం హవం = ఆ (మా) ఆహ్వానమును, నః= మాయొక్క, తం వచః = ఆ స్తుతులను, శృణ్వన్తు = ప్రీతితో విందురుగాక, మరియు మేము, సూర్యస్య = ఆదిత్యుని, సందృశి= చూచుటయందు, శూనే= రోగగ్రస్తులము, మాభూమ = కాకుందుముగాక. మరియు మేము, జీవన్తం= చిరకాలము జీవించు, భద్రమ్ = కల్యాణమును, జరణామ్= వృద్ధిని (వార్ధక్యమును) కూడ, అశీమహి = అనుభవింతుముగాక.

ఓ ద్యావాపృథివీ దేవతలార! ఉదక ఇంద్ర మరుత్తులార! మేమిచ్చు హవిస్సులను గ్రహించి మా ఆహ్వానములను స్తోత్రములను సాదరముగ గ్రహింపుడు. అట్లే సూర్యుని దర్శించుటలో మాకు బాధలు లేకుండుగాక. మాకు దృష్టిదోషము వాటిల్లకుండుగాక. సూర్యుడు (నేత్ర) ప్రకాశకుడు కనుక నేత్ర సంబంధ రోగములను వారించును. ఆ విధముగ దేవతానుగ్రహమునకు పాత్రులమగు మేము యావజ్జీవితము కళ్యాణము నొందుచు, అన్ని విధముల వర్ధిల్లుచు, మేము వృద్ధాప్యము ననుభవింతుముగాక, అనగ ఓ సూర్య నీవు మాకు సుఖమయమగు చిరజీవనమును ప్రసాదింపుమని భావము.

ఇట్టి సుఖజీవము నొసంగెడి ఓ సూర్య! నీకు నమస్కారము.

(43)

## మహాసౌర మంత్రము - 44

విశ్వాహా త్వా సుమనసః సుచక్షసః ప్రజావంతో అనమీవా అనాగసః।
ఉద్యన్తం త్వా మిత్రమహో దివే దివే జ్యోగ్జీవాః ప్రతి పశ్యేమ సూర్య॥

**పదపాఠము :**

విశ్వాహా । త్వా । సు-మనసః । సు-చక్షసః । ప్రజా-వన్తః । అనమీవాః । అనాగస । ఉత్ - యన్తమ్ । త్వా । మిత్ర-మహః ॥ దివే - దివే । జ్యోక్ । జీవాః । ప్రతి । పశ్యేమ । సూర్య ॥

**సాయణ భాష్యము :**

హే సూర్య! త్వా త్వాం సుమనః ప్రీతియుక్త మనస్కాః సుచక్షః సుదర్శనాః ప్రజావన్తః పుత్రాద్యుపేతాః అనమీవాః రోగ రహితాః అనాగస అపరాధవర్జితా శ్చ వయం విశ్వాహా సర్వదా యజేమేతి శేషః। కించ హే మిత్రమహాః మిత్రాణాం పూజయితః సూర్య దివేదివే ప్రతి దినం ఉద్యన్త ముదయం ప్రాప్నువన్తమ్, త్వా త్వామ్ జ్యోక్ చిరం జీవా జీవన్తో వయం ప్రతిపశ్యేమ॥

(ఋక్ 10-37-7)

వాక్యాన్వయము :

హేసూర్య! త్వా సుమనసః సుచక్షసః ప్రజావన్తః అనమీవాః అనాగసః విశ్వాహా (యజేమ)। హేమిత్రమహః దివే దివే ఉద్యన్తం త్వా జ్యోక్ జీవా ప్రతి పశ్యేమ॥

ప్రతిపదార్థము :

హే సూర్య! త్వా= నిన్ను, వయమ్= మేము, సుమనసః= శుచియగు మనస్సు కలవారమై (సంతుష్టి చెందిన మనసు కలవారమై), సుచక్షసః = మంచి (రోగరహితములగు) నేత్రములను గలవారమై, ప్రజావన్తః = సంతానవంతులమగుచు, అనమీవాః = రోగరహితులమగుచు, అనాగసః = పాపరహితులమై, పరిశుద్ధులమై, విశ్వాహా = ప్రతినిత్యము (పూజింతుముగాక), హే మిత్రమహః = సుమనస్కులగు సర్వులకు పూజ్యుడవగు, ఓ సూర్య! దివేదివే = ప్రతిదినము, ఉద్యన్తమ్= ఉదయించుచుండెడి, త్వా = నిన్ను జ్యోక్ = చిరకాలము, జీవాః= జీవించువారలమగుచు మేము, ప్రతిపశ్యేమ= ఎదురు చూచెదము గాక.

ఓ సూర్య! మేము సంతుష్టి చెందిన మనసు కలవారము. నీదయచే మంచి నేత్ర దృష్టి గలవారము. సంతానవంతులము. రోగరహితులము. పాపములు లేని పరిశుద్ధులము. అట్టి మేము, సర్వులకు సర్వదా పూజ్యుడవగు నిన్ను ఉదయించుచుండగ చూచుచున్నాము. ఇట్లే నీ కొరకై మేము ప్రతి నిత్యము జీవితాంతమును ఎదురుచూచు చుందుము. అట్టి దీర్ఘ జీవితమును, నిన్ను దర్శించగల స్పష్టమగు దృష్టిని ఆయురారోగ్యైశ్వర్యములను ప్రసాదింపుము అని భావము.

అట్లు మమ్ము అనుగ్రహించు ఓ సూర్యదేవ! నీకు నమస్కారము.

(44)

మహి జ్యోతి ర్బిభ్రతం త్వా విచక్షణ భాస్వన్తం చక్షుషే చక్షుషే మయః।
ఆరోహన్తం బృహతః పాజ సస్పరి వయం జీవాః ప్రతి పశ్యేమ సూర్య॥

పదపాఠము :

మహి । జ్యోతిః । బిభ్రతమ్ । త్వా । వి-చక్షణ । భాస్వన్తమ్ । చక్షుషే- చక్షుషే । మయః । ఆ-రోహన్తమ్ । బృహతః । పాజసః । పరి । వయమ్ । జీవాః । ప్రతి । పశ్యేమ । సూర్య ॥

సాయణ భాష్యము :

హే విచక్షణ విద్రష్టః సూర్య మహి మహత్ జ్యోతిః తేజః బిభ్రతం ధారయన్తం భాస్వన్తం దీప్తిమన్తం చక్షుషే చక్షుషే సర్వేషాం ద్రష్టౄనాం చక్షుషే మయః సుఖకరం బృహతో మహతః పాజసో బలవంతః పరి మహతో బలవతః సాముద్ర స్యోదకస్యోపరిత్యర్థః । ఆరోహన్తం త్వా త్వాం జీవాశ్చిం జీవంతో వయం ప్రతి ప్రతిదినం పశ్యేమ ॥

(ఋక్ 10-37-8)

వాక్యాన్వయము :

హే విచక్షణ సూర్య మహోజ్యోతిః బిభ్రతం భాస్వన్తం చక్షుషే చక్షుషే మయః బృహతః పాజసః పరి ఆరోహన్తం త్వా వయం జీవాః ప్రతి పశ్యేమ ॥

ప్రతిపదార్థము :

హే విచక్షణ సూర్య! = విశిష్ట ప్రకాశకుండవగు ఓ సూర్య! మహో జ్యోతిః = గొప్ప తేజస్సును, బిభ్రతం= ధరించుచున్నట్టి, భాస్వన్తమ్= మిక్కిలిగ ప్రకాశించుచున్నటెయు, చక్షుషే చక్షుషే = ప్రతినేత్రమునందు - సర్వజనులనేత్ర ములకు మయః= సుఖకరుడ వగునట్టియు, బృహతః పాజః = మిగుల బలిష్ఠమగు సముద్రమునకు మీదుగ, ఆరోహన్తమ్ = గగనమండలమునధిరోహించెడి, త్వా= నిన్ను, జీవాః వయమ్ = చిరకాలజీవనము గల్గిన మేము, ప్రతిపశ్యేమ = అనుదినము చూతుము గాక.

విశేష ప్రకాశముగల ఓ ఆదిత్య! మహోన్నమగు తేజస్సును గలిగి, మిక్కిలిగ వెలుగొందుచు, నిన్నారాధించు సర్వజీవులకు నేత్రానందము కల్గించుచు, మహా బలవత్తరమగు సముద్ర జలముల నుండి పైపైకి ఉదయించు చుండెడి నిన్ను మేము (యావజ్జీవము) చిరకాలము, ప్రతినిత్యము దర్శించుదుము గాక.

ఈ విధముగ ఉపాసకుడు సుఖకరమగు చిరజీవనమును కోరుకొనుచు న్నాడు.

ఇట్లు ఉపాసకుల ననుగ్రహించెడి ఓ సూర్య! నీకు నమస్కారము.

(45)

# మహాసౌర మంత్రము 46

యస్య తే విశ్వా భువనాని కేతునా ప్రచేరతే ని చ విశంతే అక్తుభిః ।
అనాగాస్త్వేన హరికేశ సూర్యాహ్నాహ్నా నో వస్యసా వస్యసోదిహి ॥

పదపాఠము :

యస్య । తే । విశ్వా । భువనాని । కేతునా । ప్ర । చ । ఈరతే ।
ని । చ । విశన్తే । అక్తు-భిః । అనాగాః -త్వేన । హరి-కేశ ।
సూర్య । అహ్నా-అహ్నా । నః । వస్యసా-వస్యసా । ఉత్ । ఇహి ॥

సాయణ భాష్యము :

హే హరికేశ! హరితవర్ణ కేశ సూర్య యస్యతే తవ కేతునా ప్రజ్ఞానేన విశ్వా విశ్వాని భువనాని భూతజాతాని ప్రచేరతే ప్రకర్షేణ గచ్ఛన్తి అక్తుభిః రాత్రిభిః నివశన్తే చ విశ్రామ్యన్తి । చ స్వపన్తీత్యర్థః । సత్యం నోఽస్మాకం అనాగాస్త్వేన అపరాధవర్జితత్వేన వస్యసా అత్యన్తశ్రేయస్కరేణ వసుమత్తరేణ వా అహ్నాహ్నా తేన తేన దివసేన ఉదిహి ఉద్గచ్ఛ ॥

(ఋక్ 10-37-9)

వాక్యాన్వయము :

హే హరికేశ! సూర్య! యస్యతే కేతునా విశ్వా భువనాని ప్రచేరతే, అక్తుభిః నివిశన్తే (సః త్వం) నః అనాగస్త్వేన వస్యసా వస్యసా అహ్నో అహ్నో ఉదిహి ॥

ప్రతిపదార్థము :

హే హరికేశ = హరితవర్ణ కేశములు కల్గిన, సూర్య= సర్వ ప్రేరకుండవగు ఓ ఆదిత్య! యస్య తే= అట్టి నీ యొక్క, కేతునా= ప్రజ్ఞాపనచే (తేజస్సుచే) విశ్వా= విశ్వాని= సమస్త, భువనాని= లోకములు (సర్వప్రాణులు) ప్రచేరతే = మిక్కిలి సుఖముగ చరించుచున్నవి. జీవించుచున్నవి. అక్తుభి, నివశిన్తే= రాత్రులలో విశ్రమింప చేయుచున్నావు. అట్టినీవు, నః = మా కొరకు అనాగస్త్వేన= పరిశుద్ధముగ, వస్యసా వస్యసా=అత్యంతశ్రేయస్కరమగు ఐశ్వర్యముతోను, అహ్నో అహ్నో= ప్రతిదినము, ఉదిహి = ఉదయింపుము.

హరితకేశుండవగు ఓ సూర్య! నీయొక్క భాస్వంతమగు అజ్ఞాపనములచే సమస్త లోకములందలి సర్వజీవ జాలము తమ తమ కర్మలను సుఖముగ చేసుకొనుచున్నవి. అట్లే రాత్రులందు సుఖముగ నిద్రించి విశ్రాంతిని పొందుచున్నవి. అట్టి ప్రజ్ఞాశీలివగు నీవు ప్రతిదినము మమ్ము పాప ముక్తులుగ చేయుచు, అనంత శ్రేయస్కరములు, పోష్టికరములనగు ఐశ్వర్యమును వెంటగొని ఉపాసకుల కిచ్చుటకు ఉదయింపుము.

ఇట్లు నీభక్తులను బ్రోవు ఓ సూర్య! నీకు నమస్కారము.

(46)

## మహాసౌర మంత్రము - 47

శం నో భవ చక్షసా శం నో అహ్నా శం భానునా శం హిమా శం ఘృణేన ।
యథా శమధ్వ చ్ఛమస ద్దురోణే తత్సూర్య ద్రవిణం ధేహి చిత్రమ్ ॥

**పదపాఠము :**

శమ్ । నః । భవ । చక్షసా । శమ్ । నః । అహ్నా । శమ్ । భానునా । శమ్ । హిమా । శమ్ । ఘృణేన । యథా । శమ్ । అధ్వన్ । శమ్ । అసత్ । దురోణే । తత్ । సూర్య । ద్రవిణమ్ । ధేహి । చిత్రమ్ ॥

**సాయణ భాష్యము :**

హే సూర్య త్వం చక్షసా తేజసా నోఽస్మాకం శం సుఖకరో భవ । అహ్నా దివసేనచ శం సుఖకరో నోఽస్మాకం భవ । భానునా రశ్మినా చ భవ । అస్మాకం సుఖకరో భవ । హిమా శైత్యేన చ శం భవ । ఘృణేన ఔష్ణ్యేన చ శంకరో భవ । యథా యాదృశేన నో అస్మాకం అధ్వన్ అధ్వని మార్గే భవతి దురోణే గృహే చ శం శం సుఖమస్మద్భవతి తచ్చిత్రం పూజనీయం ద్రవిణం ధనం ధేహ్యస్మభ్యం ప్రయచ్ఛ ॥

(ఋక్ 10-37-10)

వాక్యాన్వయము :-

హే సూర్య! (త్వం) నః చక్షసా శం భవ నః అహ్నా శం (భవ) భానునా శం (భవ) హిమా శం (భవ) ఘృణేన శం (భవ) యథా న అధ్వన్ శం భవతి దురోణే చ శం అసత, తత్ చిత్రం ద్రవిణం ధేహి ।

ప్రతిపదార్థము :

హే సూర్య! నీవు మాకు, చక్షసా = తేజస్సుచే, శంభవ= సుఖకరుడవు అగుము. (సుఖము కల్గింపుము) అహ్నా = పగటియందు, శంభవ = శ్రేయస్కరుడ వగుము. హిమా = శీతలముచే (రాత్రులందును,) శంభవ। ఘృణేన = ఉష్ణత (వేడిమి) తో కూడ, శంభవ । యథా= ఏవిధముగ, నః= మాకు (మాయొక్క) అధ్వన్= మార్గము, శంభవతి= మంగళకరమగునో, దురోణే చ = గృహమందు కూడ శమ్= సుఖము కల్గునో, తత్= అట్లు (నీవు మాకు) అట్టి, చిత్రం ద్రవిణం= నానావిధములగు (చిత్రవిచిత్రములగు) ఐశ్వర్యములను, ధేహి= ఇమ్ము, ప్రసాదింపుము. సమకూర్చుము.

ఓ సూర్య! నీ తేజస్సు మాకు సుఖకరమగుగాక, దినమంతయు, శుభములు కలుగుగాక. నీయొక్క కాంతులు మాకు సుఖమును కూర్చుగాక. శీతాతపములు సుఖకరమమ్ములై యుండుగాక, ఇవి యవి యన నేల, మేము నడుచు (చరించు) మార్గము (సర్వప్రదేశము) మేము నివసించు గృహములు కూడ మంగళకరములు, సుఖకరములగునట్లు నీవు నానావిధైశ్వర్యమును మాకు ప్రసాదింపుము.

ఓ భాస్కర నీకు నమస్కారము.

(47)

## మహాసౌర మంత్రము - 48

అస్మాకం దేవా ఉభయాయ జన్మనే శర్మ యచ్ఛత ద్విపదే చతుష్పదే।
అదత్పిబదూర్జయమానమాశితం తదస్మే శం యో రరపో దధాతన॥

**పదపాఠము :**

అస్మాకమ్ । దేవాః । ఉభయాయ । జన్మనే । శర్మ । యచ్ఛత । ద్వి-పదే । చతుః-పదే । అదత్ । పిబత్ । ఊర్జయమానమ్ । ఆశితమ్ । అస్మే ఇతి । శమ్ । యోః । అరపః । దధాతన ॥

**సాయణ భాష్యము:**

హే దేవాః సూర్యేణాభ్యను జ్ఞాతాః యూయమస్మాకం ద్విపదే మనుష్యాత్మకాయ, చతుష్పదే పశ్వాత్మకాయ, చోభయాయ ఉభయ విధాయ జన్మనే భూతజాతాయ శర్మ సుఖం యచ్ఛ చ । దత్త । కించ యథాస్మత్పుత్రాదికం అదత్ భక్షణీయం, భక్షయత్, పిబత్ పానీయం పిబచ్చ ఊర్జయమానం బలవంతమివాత్మాన మాచరదాశితం సుహితం చ భవతి. తథా అస్మే అస్మాకం యత్ శం రోగశాంతి నిమిత్తకం సుఖం యోర్విషయయోగ జనితం సుఖం చ అరపః అపాపంచ దధాతన ప్రయచ్ఛత ॥

(ఋక్ 10-37-11)

వాక్యాన్వయము :

హే దేవాః అస్మాకం ద్విపదే చతుష్పదే ఉభయాయ జన్మనే శర్మ యచ్ఛత। (తత్) అదత్ పిబత్ ఊర్జయమానం ఆశితః యోః అరపః తదస్మే శం దధాతన॥

ప్రతిపదార్థము :

హే దేవాః = ఓ ఇంద్ర మిత్ర వరుణాగ్న్యాది సర్వ దేవతలార!, అస్మాకమ్ = మా యొక్క, ద్విపదే = ద్విపాదులగు బంధుజాలమునకు, ఇతర జంతుజాలమునకు, చతుష్పదే = చతుష్పాత్తులగు గో మహిషాది పశు సంపదకు, ఉభయాయ జన్మనే = ద్విజన్ములకు (అండజములగు పక్ష్యాది జీవరాశికిని) శర్మ = సుఖమును, యచ్ఛత = ప్రసాదింపుము మరియు, అదత్ = భక్షణ యోగ్యమగు ఆహారము, పిబత్ = పానయోగ్యమగు జలములు, ఊర్జయ మానమ్ = బలకరము, పుష్టికరము అగుగాక. అశితమ్ = మాకు హితకరములగు గాక. యోః = సుఖము (దేహేన్ద్రియ, విషయేన్ద్రియ జనితమగు సుఖము) అరపః = పాపరహితమైనది అగునట్లు, తత్ అస్మే = దానిని మాకు, దధాతన = ఇచ్చెదవు గాక (ప్రసాదింపుము).

ఓ ఇంద్రాది సమస్త దేవతలార! మీరందరు సూర్యునిచే అనుజ్ఞాతులై, ఈ సృష్టిలోని ద్విపాదులు, చతుష్పాదులు, అండజములు నగు సమస్త జీవరాశియు సుఖమును శాంతిని పొందునట్లు అనుగ్రహింపుడు. మేము గ్రహించు ఆహారము, మేముగ్రోలు పానీయములు కూడ మాకు తుష్టిని, పుష్టిని కల్గించుగాక. ఓ దేవతలార! రోగరహితుల మగుచు, మే మనుభవించు విషయేన్ద్రియ సర్వసుఖములు ధర్మబద్ధములై, కల్యాణ దాయకములై, సౌభాగ్య ప్రదములగునట్లు వానిని మీరు మాకు ప్రసాదింపుడు.

సర్వదేవతల నాజ్ఞాపించ గల్గిన ఓ సూర్య! నీకు నమస్కారము.

(48)

యద్వో దేవాశ్చకృమ జిహ్వయా గురు మనసో వా ప్రయుతీ దేవ-హేళనమ్।

అరావా యే నో అభి దుచ్ఛునాయతే తస్మిన్తదేనో వసవో నిధేతన॥

పదపాఠము :

యత్ । వః । దేవాః । చకృమ । జిహ్వయా । గురు । మనసః । వా । ప్ర-యుతీ । దేవ-హేలనమ్ । అరావా । యః । నః । అభి । దుచ్ఛున-యతే । తస్మిన్ । తత్ । ఏనః । వసవః । ని ధేతన ॥

సాయణ భాష్యము :

హే వసవో వాసయితారో దేవాః వో యుష్మాకం వయం జిహ్వయా వాచా మనసః ప్రయుతీ ప్రయుత్యా ప్రయోగేణ ఉరు మహద్దేవహేళనం దేవక్రోధనం చ యదేనశ్చకృమ అకార్ష్మ యోఽస్మచ్ఛ త్రు ర్నోఽస్మానభిప్రతి అరావా గమనవాన్ భూత్వా, దుచ్ఛునాయతే పాపాన్యాచరతి అస్మానుద్వేజయతి, వా తస్మిన్ అస్మచ్ఛత్రౌ తదేనోఽస్మాభిః కృతం పాపం నిధేతన సూర్యస్యాజ్ఞయా నిధత్త స్థాపయతేత్యర్థః ॥

(ఋక్ 10-37-12)

వాక్యాన్వయము :

హే దేవా వసవః (వయం) జిహ్వయా మనసః ప్రయుతీ గురు దేవహేళనం చకృమ। (తజ్జనితం మర్షణం) ఏనః యః నః అరావా యదు చ్ఛునాయతే తస్మిన్ నిధేతన॥

ప్రతిపదార్థము :

హే వసవః దేవాః = సుఖవాసము కూర్చెడి ఓ దేవతలార! వః = మీకు, వయమ్ = మేము, జిహ్వయా = వాక్కుచే, మనసః = మనసు ద్వార, ప్రయుతీ = కర్మ చేతను, గురు = అధికమగు, దేవహేళనమ్ = దేవతాపచారమును, చకృమ = చేసి యుందము. కనుక అందువలన మాకు కలుగు, ఏనః = పాపమును, నః= మమ్ముద్దేశించి, యః = ఎవడు, అరావా = శత్రు భావముతో, దుచ్ఛునాయతే = కీడు కల్గించు చుండునో (పాపము నాచరించు చుండెనో), తస్మిన్ = అట్టివానియందు, తత్ = దానిని, మేము మీ యెడ నాచరించిన అపచారముచే మాకు కలుగు పాపమును, లేక మీకు కలుగు క్రోధమును, నిధేతన = ఉంచుడు. ప్రదర్శింపుడు.

మాకు సుఖవాసమును కూర్చెడి ఓ దేవతలార! మేము మీపట్ల మనో వాక్కాయ కర్మలచే తెలిసియో తెలియకయో అపచారము చేసి యుందుము. ఫలితముగ మాకు పాపము వచ్చును. అట్లే మీకు మాపై కోపము కూడ గల్గును. కాని ప్రభూ! దేవతలార! మీరా కోపమును, మా పాపమును కూడ మాకు తగులనీయకుడు. మాపై చూపకుడు. దానినంతయు మమ్ము దుర్మార్గ మున నెదుర్కొనుచు, మమ్ముద్వేజితులుగా చేయు మా శత్రువులపై ప్రదర్శిం పుడు. అపుడు ఆవేగో ద్వేగములను చెందని మేము స్థిరచిత్తములు కలవారమై, మీ సేవయందు అపచారము నాచరించకుందుము. అపచారము జరుగనీయమని భావము.

ఈ విధముగ ఆశీర్వదించు ఓ సూర్య! నీకు నమస్కారము

(49)

## మహాసౌర మంత్రము 50

సూర్యో నో దివస్పాతు వాతో అన్తరిక్షాత్।
అగ్నిర్నః పార్థివేభ్యః॥

**పదపాఠము :**

సూర్యః । నః । దివః । పాతు । వాతః । అన్తరిక్షాత్ । అగ్నిః । నః । పార్థివే భ్యః ॥

**సాయణ భాష్యము :**

సూర్యః సర్వస్య ప్రేరకః శోభనీయో వా దేవో ద్యులోకాత్ ద్యులోక వర్తినో జనాన్నోఽ స్మాన్పాతు। రక్షతు। వాతో వాయుశ్చాన్త రిక్షాన్మధ్యమ స్థాన గతా ద్బాధకాదస్మాన్పాతు రక్షతు। తథా పృథివీ స్థానోఽగ్నిశ్చ పార్థివేభ్యః పృథివ్యాం వర్తమానేభ్యః శత్రుభ్యోనోఽస్మాన్రక్షతు॥

(ఋక్ 10-158-1)

**వాక్యాన్వయము :**

సూర్యః। నః। దివః। పాతు। వాతః। అన్తరిక్షాత్। అగ్నిః। నః। పార్థివే భ్యః॥

**ప్రతిపదార్థము :**

సూర్యః = సర్వజీవప్రేరకుండగు ఆదిత్యుడు, నః = మనలను, సర్వ, దివః = ద్యులోకమునుండి (వచ్చు ఆపదల నుండి) పాతు = రక్షించుగాక. వాయుః = వాయువు, అన్తరిక్షమునుండి వచ్చు ఆపదల నుండి రక్షించును. నః = మనలను, అగ్నిః = అగ్ని దేవుడు, పార్థివేభ్యః, = పృథ్వీ సంబంధములగు ఆపదల నుండి రక్షించుగాక।

సర్వలోక ప్రేరకుడు, శోభనీయుడునగు సూర్యుడు మనలను ద్యులోకమునుండి సంభవించు ప్రమాదముల నుండి రక్షించును. వాయువు అన్తరిక్షలోకము నుండి సంభవించు ఉల్కాది పాతములు పిడుగు (పాతములు) వంటి ఆపదలనుండి రక్షించుగాక. పృథ్వీ దేవత యగు అగ్ని భూమిపై నుండు రాక్షసాది క్రూరుల వలన సంభవించు ప్రమాదముల నుండి రక్షించుగాక.

ఈ విధముగ ముల్లోకాధిపతులగు సూర్యవాయ్వగ్నులు మనలను త్రిలోకముల నుండి సంభవించు ఉపద్రవముల నుండి రక్షింతురు గాక.

ఇట్టి నియమము చేయు ఓ సూర్య! నీకు నమస్కారము.

(50)

## మహాసౌర మంత్రము 51

జోషా సవితర్యస్య తే హరః శతం సవాగుం అర్హతి।
పాహి నో దిద్యుతః పతంత్యాః ॥

### పదపాఠము :

జోష । సవితః । యస్య । తే । హరః । శతమ్ । సవాన్ ।
అర్హతి । పాహి । నః । దిద్యుతః । పతంత్యాః ॥

### సాయణ భాష్యము :

హే సవితః సర్వస్య ప్రేరకః సూర్య! జోష అస్మత్ స్తుత్యాదికం సేవస్వ। యస్యతే తవ హరో రసహరణ శీలం తేజః శతః సవాన్ బహూ న్యజ్ఞాన్ ప్రత్యర్హతి యోగ్యం భవతి। యద్వా। ప్రకాశనాది ద్వారా పూజయతి। స త్వం నోऽ స్మా న్పతంత్యా నిపతంత్యాః శత్రుభిరస్మాసు క్షిప్యమాణా యా దిద్యుతః। వజ్రనామైతత్। ద్యోతమానాయాః శక్తే రాయుధాత్పాహి ॥రక్ష॥

(ఋక్ 10-158-2)

వాక్యాన్వయము :

హే సవితః జోష। యస్య తే హరః శతం సవాన్
అర్హతి। పతంత్యా దిద్యుతః నః పాహి ॥

ప్రతిపదార్థము :

హే సవితః = ఓ సూర్య! జోష = సేవస్వ = పాలింపుము. యస్య తే = అట్టి నీయొక్క, హరః = రసహరణసమర్థమగు తేజస్సు, శతం సవాన్ = నూరు ( అనేక) యాగములను, శతమనునది కేవలము అనేకము అను నర్థమునకు ఉపలక్షణము.

అర్హతి = పొందుటకు తగియున్నది. మరియు, పతంత్యాః = మీద నుండి (మాపై) పడెడి, దిద్యుతః = ప్రకాశవంతమగు, శక్తివంతమగు (ఆయుధ ప్రమాదముల నుండి) నః = మమ్ము, పాహి = రక్షస్వ = రక్షింపుము.

సర్వజీవప్రేరకుండవగు ఓ సూర్య! మేము చేయు హోమాది క్రియలను స్తోత్రములను గ్రహించి మమ్ము పాలింపుము. సర్వజలధుల నుండి రసగ్రహణ మందు శక్తి వంతములగు నీ తేజస్సులు మా నుంచి పరశ్శతములుగ స్తోత్రము లను, సేవలను పొందుటకు అర్హములైనవి. కనుక ఓ ప్రభు! మా శత్రువులు మాపై ప్రయోగించు శక్తివంతములు, ప్రకాశవంతములునగు ఆయుధములనుండి, అట్లే ఊర్ధ్వలోకముల నుండి మాపై పడెడు పిడుగులు, ఉల్కాదిపాతములనుం డియు మమ్ము రక్షింపుము.

ఇట్లు సర్వరక్షకుడవగు ఓ సూర్య! నీకు నమస్కారము.

(51)

## మహాసౌర మంత్రము - 52

చక్షుర్నో దేవః సవితా చక్షుర్న ఉత పర్వతః।
చక్షుర్ధాతా దధాతు నః॥

### పదపాఠము :

చక్షుః । నః । దేవః । సవితా । చక్షుః । నః । ఉత । పర్వతః । చక్షుః । ధాతా । దధాతు । నః ॥

### సాయణ భాష్యము :

సవితా ప్రేరకో దేవః నోఽస్మాకం చక్షుః ప్రకాశక మిన్ద్రియం, ఇంద్రియాను గ్రాహకం తేజో వా దధాతు। ఉతా పిచ పర్వత ఇంద్రసహచరః పర్వతాఖ్యోపి దేవో నోఽస్మాకం చక్షుర్దదాతు। ధాతా సర్వస్య విధాతా ఽదిత్యానా మన్యతమః చ నోఽస్మాకం చక్షుర్విదధాతు॥

(ఋక్ 10-158-3)

వాక్యాన్వయము :

దేవః సవితా నః చక్షుః ఉత పర్వతః నః చక్షుః।
ధాతా నః చక్షుః దధాతు॥

ప్రతిపదార్థము :

దేవః = మిక్కిలిగ ప్రకాశించునట్టి, సవితా = ప్రేరకుండగు సూర్యుడు, నః = మనకు, చక్షుః = తేజస్సును, దర్శన శక్తిని నేత్రశక్తిని, దధాతు = ఇచ్చుగాక, ఉత = మరియు, పర్వతః = ఇంద్రసహచరుండగు పర్వతుడను దేవత, నః = మనకు, చక్షుః = నేత్రదార్ఢ్యమును (ఇచ్చుగాక). ధాతా = ద్వాదశాదిత్యులలో నొకడగు విధాత, లేక సృష్టి కర్తయగు బ్రహ్మ, చక్షుః = అక్షీణదర్శన శక్తిగల్గిన నేత్రదృష్టిని, దధాతు = ఇచ్చుగాక.

సర్వమును ప్రకాశింపచేయువాడు. సర్వులను ప్రేరేపించువాడు. ద్యోతన శీలియునగు సూర్యుడు మనకు నేత్రములను అనగా దృష్టికి ప్రధానమగు తేజస్సును అక్షీణమగు దర్శన శక్తి గల నేత్రములను ఇచ్చుగాక. అట్లే ఇంద్ర సహచరుడగు పర్వతుడను నతడు మనకు నేత్రముల నిచ్చి రక్షించుగాక. అట్లే ద్వాదశాదిత్యులలో నొకడగు విధాత లేదా సృష్టికర్తయగు బ్రహ్మ మనకు అక్షీణమగు నేత్ర శక్తిని ఇచ్చుగాక.

ఈ మా ప్రార్థనను సఫలము చేయు ఓ సూర్య! నీకు నమస్కారము.

(52)

## మహాసౌర మంత్రము - 53

చక్షుర్నో ధేహి చక్షుషే చక్షుర్విఖ్యై తనూభ్యః।
సం చేదం వి చ పశ్యేమ॥

**పదపాఠము :**

చక్షుః । నః । ధేహి । చక్షుషే । చక్షుః । విఖ్యై । తనూభ్యః । సమ్ । చ । ఇదమ్ । వి । చ । పశ్యేమ ॥

**సాయణ భాష్యము :**

నోఽస్మాకం చక్షుషే రూపోపలబ్ధి కారణాయేన్ద్రియాయ, చక్షుః ప్రకాశకం తదాను గ్రాహకం తేజో హే సూర్య ధేహి । విధేహి। కురు। యద్వా॥ న ఇతి వ్యత్యయేన బహువచనమ్। చక్షుషే చక్షుః సంజ్ఞాయ నో మహ్యం చక్షురిన్ద్రియం వా తేజో వా హే సూర్య ధేహి। ప్రయచ్ఛ। తనూభ్యోస్మాకం శరీరేభ్యః తనయేభ్యో.వా విఖ్యై విఖ్యానాయ ప్రకాశనాయ చక్షుస్త్వదీయం ప్రకాశం విధేహి। యత ఏవం తస్మా త్కారణాత్త్వదీయేన తేజసా వయం చేదం సర్వం జగత్సం పశ్యేమ॥ సమ్యగ్ద్రష్టారో భవేమ। విపశ్యేమ చ। వివిధం చ సవిశేషం ద్రష్టారో భవేమ॥

(ఋక్ 10-158-4)

వాక్యాన్వయము :

హే సూర్య। నః చక్షుషే చక్షుః ధేహి। తనూభ్యః విఖ్యై
చక్షుః (ధేహి)। సమ్ (వయం) చ ఇదం పశ్యేమ। విపశ్యేమ॥

ప్రతిపదార్థము :

హే సూర్య! = ఓ సూర్య!, నః = మాకు, చక్షుషే = రూపోపలబ్ధికి కారణమగు ఇంద్రియమునకు (కన్నులకు), చక్షుః = ప్రకాశమును రూపగ్రహణము చేయు తేజస్సును, ధేహి = ఇమ్ము, విధింపుము. తనూభ్యః = మా శరీరముల నుండి, లేక పుత్రుల నుండి, విఖ్యై = మిక్కలి ప్రకాశించుటకు, చక్షుః = నీదియగు ప్రకాశన శక్తి గల తేజస్సును (ధేహి). వయం చ = మేమును, ఇదమ్ = దృశ్యా దృశ్యమగు సర్వజగత్తును, సంపశ్యేమ = సమ్యక్పశ్యేమ = చక్కగ చూతుముగాక, మరియు, విపశ్యేమ = విచక్షణాపూర్వముగను, విశ్లేషణాత్మకముగను చూచెదము గాక.

సర్వతేజో మయుడవగు ఓ సూర్యదేవ! మా చక్షురిన్ద్రియములు శక్తివంతములగునట్లు, రూపదర్శన కారకములగు నీయొక్క తేజస్సులను, ప్రకాశమును మా కండ్లకిమ్ము. మా శరీరములు, అట్లే మాసంతానములు కూడ కాంతివంతమై, తేజోమూర్తమై, ఆహ్లాదకరముగ నుండునట్లు నీ యొక్క తేజస్సును మా యందు ప్రవేశపెట్టుము. ఈ విధముగ నీ తేజస్సుచే అనుగ్రహింపబడిన మేము సర్వలోకమును దోష రహితముగ, నిశ్చయముగ, విమర్శనాపూర్వకముగ, విశ్లేషణాత్మకముగ దర్శించగలము. అట్లు మమ్ము సమర్థులుగ చేయుచు ధీశక్తిని, దర్శన శక్తిని మాకు ప్రసాదింపుము.

ఇట్లు ప్రార్థితుడవగు ఓ సూర్య! నీకు నమస్కారము.

(53)

## మహాసౌర మంత్రము 54

సు సందృశం త్వా వయం ప్రతి పశ్యేమ సూర్య!
విపశ్యేమ నృచక్షసః॥

**పదపాఠము :**

సు - సందృశమ్ । త్వా । వయమ్ । ప్రతి । పశ్యేమ । సూర్య!
వి । పశ్యేమ । నృ-చక్షసః ॥

**సాయణ భాష్యము :**

హే సూర్య! సుసందృశం సుష్ఠు సంద్రష్టారం త్వాత్వాం వయం ప్రతి పశ్యేమ। ప్రత్యేకం ద్రష్టారో భూయాస్మ। తథా నృచక్షసో నృభిః మనుష్యైరః అస్మాభిర్దర్శిష్టవ్యాన్ పదార్థాన్ విపశ్యేమ। విద్రష్టారో భవేమ। యద్వా। నృచక్షసో నృణాం శత్రుమనుష్యాణాం హింసకాః సన్తః వయం విశిష్టజ్ఞానాః భవేమ॥

(ఋక్ 10-158-5)

వాక్యాన్వయము .

హే సూర్య । వయం సు సంధృశం త్వా ప్రతిపశ్యేమ। నృచక్షసః విపశ్యేమ॥

ప్రతిపదార్థము :

హే సూర్య= ఓ సూర్య! వయమ్= మేము, సుసంధృశమ్= సర్వమును చక్కగ దర్శించునట్టి, త్వా= నిన్ను, ప్రతిపశ్యేమ= ప్రత్యేకముగ (అనుకరించుచు చూతుముగాక). నృచక్షసః= మాచే చూడయోగ్యములగు పదార్థములన్నింటిని, విపశ్యేమ= విశేషముగ, విచక్షణతో చూడగలుగుదుముగాక. (లేదా) విపశ్యేమ = విశేషముగ గ్రహింపగల్గుదుము గాక.॥

ఓ సూర్య! పూర్వము మేము నీయొక్క తేజస్సును మా నేత్రము లందు ప్రవేశపెట్టుమని కోరితిమి. ఆ విధమగు సుదృఢమగు దృష్టిని కల్గిన మేము, నిన్ను నీయొక్క వివిధ స్థాయీ గతులను , మహిమలను వివిధములుగ దర్శించగలము. మానవులమగు మేము మాచే దర్శనీయములగు సర్వమును దర్శించెదము. అట్లే నీ భక్తులమగు మేము దుష్ట చిత్తులగు మా శత్రువులను వారి వ్యూహములను చక్కగ గుర్తించగల్గుదుము.

పూర్వ మంత్రమున కోరిన నేత్ర శక్తి కేవలము బాహ్యేన్ద్రియమగు నేత్రములకే గాక, అంతరింద్రియములకు శక్తిని కోరుట జరిగినది. కనుక కేవ లము చర్మ చక్షువులకు గోచరించు బాహ్యద్రవ్యములనె గాక, జ్ఞాన చక్షువునకు వ్యక్తుల మనస్సు లందలి ఆలోచనా స్వభావమునులను కూడ గ్రహించు సమర్థత యుండును.

అట్టి శక్తిని ప్రసాదించెడి ఓ సూర్య! నీకు నమస్కారము.

(54)

**విభ్రాడ్బృహ త్పిబతు సోమ్యం మధ్వాయుర్దధద్యజ్ఞ పతా వవిహ్రుతమ్।**
**వాతజూతో యో అభిరక్షతి త్మనా ప్రజాః పుపోష పురుధా విరాజతి**

పదపాఠము

విభ్రాట్ । బృహత్ । పిబతు । సోమ్యమ్ । మధు । అయుః । దధత్ ।
యజ్ఞ-పతౌ । అవి-హ్రుతమ్ । వాత-జూతః । యః । అభి-రక్షతి ।
త్మనా । ప్ర-జాః పుపోష । పురుధా । వి । రాజతి ॥

సాయణ భాష్యము :

విభ్రాట్ విభ్రాజమానో విశేషేణ దీవ్యమానః సూర్యో బృహత్ మహత్ పరివృఢం సోమః సోమమయః మధు పిబతు। కిం కుర్వన్? । యజ్ఞపతౌ। యజమానేఽ విహ్రుత మకుటిల మాయుర్దధత్ కుర్వన్। యః సూర్యో వాత జూతో వాతేన మహా వాయునా ప్రేర్యమాణః సంస్త్మనాత్మనా స్వయమేవాభి రక్షతి। సర్వం జగదభిపశ్యన్పాలయతి। రాశిచక్రస్య వాయు ప్రేర్యత్వాత్ సూర్య స్యాపి తత్ప్రేర్యత్వమ్। ససూర్యః ప్రజాః పుపోష। వృష్ట్యాది ప్రదానేన పోషయతి। పురుధా బహుధా వి రాజతి। విశేషణ దీప్యతే ప్రదానేన పోషయతి। పురుధా బహుధా వి రాజతి। విశేషణ దీప్యతే చ॥

(ఋక్ 10-170-1)

**వాక్యాన్వయము:**

విభ్రాట్ సూర్యః యజ్ఞపతౌ అవిహ్రుతం ఆయుః దధత్ బృహత్సోమ్యం మధు పిబతు। యః వాతజూతో త్మనా అభిరక్షతి (సూర్యః) ప్రజాః పుపోష పురుధా విరాజతి॥

**ప్రతిపదార్థము :**

విభ్రాట్ = విశేషతేజశ్శాలియగు, సూర్యః = సూర్యుడు, యజ్ఞపతౌ= యజ్ఞపతియందు, (యాగము చేయు యజమానిని), అవిహ్రుతమ్= మధ్యలో హరించి పోనటువంటి (దీర్ఘమగు), ఆయుః = ఆయువును, దధత్= ఇచ్చుచు, బృహత్ = మిక్కిలిగ (వృద్ధిపొందింపబడిన), సోమ్యమ్= సోమరసముతో కూడిన, మధు= తేనెను, పిబతు= గ్రోలుగాక॥ యః ఏ సూర్యుడైతే, వాతజూతః= మహా వాయువుచే ప్రేరేపింపబడినవాడై, త్మనా= ఆత్మనా= స్వయముగనె, అభిరక్షతి= సర్వజగత్తును రక్షించుచుండెనో, అట్టి ఆ సూర్యుడు, ప్రజాః= సర్వజీవులను, పుపోష- వృద్ధినొందించుచు, మిక్కిలిగ పోషించుచున్నాడు. మరియు, పురుధా= నానావిధములుగ (అతడు కూడ) విరాజతి- దీప్తినొందుచున్నాడు॥

మిక్కిలిగ వెలుగొందు తేజోమండలముతో దేదీప్యమానముగ ప్రకాశించు సూర్యుడు యాగాది నిర్వాహకులకు, యజమానులకు సుదీర్ఘమగు సదాయువు నిచ్చుచు, వారిచే మిక్కిలిగ వృద్ధి పొందింపబడిన సోమరసముతో గూడిన తేనెను ఆస్వాదించుగాక. మహావాయువుచే ప్రేరేపింపబడిన ఆ సూర్యుడు స్వయముగ సమస్త జగత్తును పరిశీలించి, రక్షించుచు పాలించుచుండెను. వర్షాదిదానముచే సర్వజీవులను వృద్ధిపొందించు చుండెను. మరియు తానును నానావిధములగు తేజస్సుతో అనేక ప్రకారముల ప్రకాశించు చుండెను.

ఇంతటి దయాశాలివగు ఓ సూర్య! నీకు నమస్కారము.

(55)

## మహాసౌర మంత్రము 56

విభ్రాడ్ బృహత్సుభృతం వాజసాతమం
ధర్మన్దివో ధరుణే సత్య మర్పితమ్।
అమిత్రహా వృత్రహా దస్యుహన్తమం
జ్యోతిర్జజ్ఞే అసురహా సపత్నహా॥

**పదపాఠము :**

విభ్రాట్ । బృహత్ । సం-భృతమ్ । వాజ-సాతమమ్ । ధర్మన్ । దివః । ధరుణే । సత్యమ్ । అర్పితమ్ । అమిత్ర-హా । వృత్ర-హా । దస్యుహన్-తమమ్ । జ్యోతిః । జజ్ఞే । అసుర-హా । సపత్న-హా ॥

**సాయణ భాష్యము :**

విభ్రాట్ విభ్రాజమానం, బృహత్ ప్రౌఢం సుభృతం సుపుష్టం వాజసాతమం వాజస్య అన్నస్య బలస్య వా దాతృతమం ధర్మన్ ధర్మణి వాయునా ధారయితవ్యే దివో ద్యులోకస్య ధరుణే ధారకే సూర్యమండలే అర్పితం సత్యమవినశ్వరం అమిత్రహా మిత్రాణామప్రియాణాం హంతౄ, వృత్రహా వృత్రాణా మావృణ్వతాం హంతౄ, దస్యుహన్తమం దస్యూనాముపక్షయి తౄణాం, హన్తృతమం, అసురాణాం క్షేప్తౄణాం ఘాతకం, సపత్నహా సపత్నానాం సహజ శత్రూణామపి ఘాతకం, ఈదృగ్భూతం జ్యోతిః సౌరం తేజః జజ్ఞే ప్రాదుర్భవతి॥

(ఋక్10-170-2)

వాక్యాన్వయము :

విభ్రాట్ బృహత్ సుభృతం వాజసాతమం ధర్మన్ దివఃధరుణే అర్పితం
అమిత్రహా వృత్రహా దస్యుహన్తమం అసురహా సపత్నహా జ్యోతిః జజ్ఞే॥

ప్రతిపదార్థము

విభ్రాట్ = విశేషముగ ప్రకాశించు నట్టియు, బృహత్ = దృఢమగు, సుభృతమ్ = మిక్కిలి వృద్ధిపొంది నట్టియు, వాజసాతమమ్ = అన్నమును, బలము నిచ్చునట్టియు, ధర్మన్ = వాయువుచే ప్రేరేపించ బడినట్టి తేజస్సు, దివః = ద్యులోకముయొక్క, ధరుణే = ధారకమగు సూర్యమండలమందు, అర్పితమ్ = నిక్షిప్తమై యున్నది. సత్యము. ఈ తేజస్సు నాశరహితమైనది. మరియు ఈ సూర్యుని తేజస్సు అమిత్రహా = శత్రువులను హతమార్చును. వృత్రహా = ఆవరించి యుండు (చీకట్లను, మేఘములను) వానిని హరించునది. దస్యుహన్తమమ్ = సాధువులను హింసించెడి నీచులను నాశనము చేయును, అసురహా = రాక్షసనాశని, సపత్నహా = శత్రువినాశని, మిత్రద్రోహుల నశింపచేయును. అట్టి విశిష్టమగు, జ్యోతిః = సూర్యతేజము, జజ్ఞే = పుట్టినది.

చీకట్లను చీల్చుకొని పైకెగసి వచ్చు సూర్యుని వర్ణించుచున్నారు.

ఈ తేజస్సు విశేషముగ వెలుగులు చిమ్ముచున్నది. దృఢమైనది. గాఢముగ నున్నది. ఆరాధించువారికి అత్యధికముగ ఆహారమును బలమును కూర్చునది. వాయువుచే ప్రేరేపించబడి ద్యులోకధారియగు సూర్యునిమండలమున ఈ తేజస్సు స్థిరముగ నున్నది. ఈ తేజస్సే తన యొక్క, తన భక్తుల యొక్క శత్రువులను నాశనము చేయును. తన గమనమును అవరోధించు వారిని, మిత్రద్రోహులను, సాధుజన హింసకులగుచు, రాక్షస ప్రవృత్తిగలవారిని, యాజ్ఞకుల యొక్క బాహ్యాన్తః శ్శత్రువులను నశింప చేయును. అట్టి మహత్తర శక్తివంతమగు సూర్యతేజస్సు ఉదయించు చున్నది.

ఇట్లు ఉదయించుచున్న ఓ సూర్య! నీకు నమస్కారము.

(56)

## మహాసౌర మంత్రము 57

ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరుత్తమం
విశ్వజి ద్ధనజి దుచ్యతే బృహత్।
విశ్వభ్రాడ్ భ్రాజో మహి సూర్యో దృశ
ఉరు పప్రథే సహఓజో అచ్యుతమ్॥

**పదపాఠము :**

ఇదమ్ । శ్రేష్ఠమ్ । జ్యోతిషామ్ । జ్యోతిః । ఉత్-తమమ్ । విశ్వజిత్ । ధన-జిత్ । ఉచ్యతే । బృహత్ । విశ్వ-భ్రాట్ । భ్రాజః । మహి । సూర్యః । దృశే । ఉరు । పప్రథే । సహః । ఓజః । అచ్యుతమ్ ॥

**సాయణ భాష్యము :**

ఇదం సౌరం తేజః శ్రేష్ఠ ప్రశస్యతమం జ్యోతిషామన్యేషాం గ్రహనక్షత్రాదీనామపి జ్యోతిః ప్రకాశకం అత ఏవోత్తమముత్కృష్టం విశ్వజిద్విశ్వస్య సర్వస్య జేతృ ధనజిద్ధనస్య చ జేతృ, బృహత్ ప్రభూతమ ముచ్యతే। ఏవం గుణ విశిష్టమితి సర్వైరభిధీయతే। అపిచ విశ్వభ్రాడ్విశ్వస్యప్రకాశయితా భ్రాజో భ్రాజమానో మహిమహాన్సూర్యః దృశే దర్శనాయోరు విస్తీర్ణం సహస్తమసోఽభిభవిత్రచ్యుతం చ్యుతి రహితమవినాశ మోజస్తేజో రూపం బలం ప్రపథే। విస్తారయతి॥

(ఋక్ 10-170-3)

వాక్యాన్వయము :

ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిః ఉత్తమం విశ్వజిత్ ధనజిత్ బృహత్ ఉచ్యతే విశ్వభ్రాట్ భ్రాజః మహి సూర్యః దృశే ఉరుసహః అచ్యుతం ఓజః పప్రథే॥

ప్రతిపదార్థము

ఇదమ్ = ఈ సూర్యతేజస్సు, శ్రేష్ఠమ్ = మిక్కిలి శ్రేష్ఠమైనది. జ్యోతిషామ్ = గ్రహనక్షత్రాదులకు, జ్యోతిః = ప్రకాశకము. కనుకనే, ఉత్తమమ్ = ఉత్కృష్టమైనది, విశ్వజిత్ = సృష్టినంతను జయించునది, ధనజిత్ = ధనముచే ఐశ్వర్యముచే జయించునది అని, బృహత్ = గొప్పగ బిగ్గరగ, ఉచ్యతే = చెప్పబడుచున్నది, విశ్వభ్రాట్ = విశ్వమునకు వెలుగునిచ్చునట్టియు, భ్రాజః = ప్రకాశకుండగు, మహిసూర్యః = మహాత్ముడగు సూర్యుడు, దృశే = లోకదర్శనము కొరకై, ఉరు = విస్తృతముగ, సహః = చీకట్ల నెదుర్కొనువాడు, అచ్యుతమ్ = నాశనములేనట్టి, ఓజః = (తేజోరూపమగు) బలమును, పప్రథే = సర్వత్ర విస్తరింప చేయు చున్నాడు.

పూర్వమంత్రమందు చెప్పిన ఆ సూర్యతేజస్సు ప్రశస్తమైనది. గ్రహనక్షత్రాది వెలుగుచుక్కలను కూడ వెలిగించునది. కనుకనె ఇది ఉత్కృష్టమైనది. సమస్తమును జయించ గల్గిన శక్తి గలది. సర్వ సంపదలను జయించి యిచ్చునది. అందులకె ఋషులచే బహు ప్రకారముల కొనియాడబడినది. సర్వలోక ప్రకాశకుడు, దీప్తిమంతుడు, మహాత్ముడునగు సూర్యుడు సృష్టియందలి ప్రాణిజాతమునంతటిని స్పష్టముగ చూచుటకై అజీర్యమనంతబలిష్ఠమును, మహత్తరమునగు తేజస్సును వృద్ధి చేసికొనుచు, చీకట్లను పారద్రోలుచు, ఆకసమునందంతటను కాంతిని వెదజల్లుచు వెలుగులతో నింపుచున్నాడు.

ఇట్టి ఓ సూర్యనారాయణ! నీకు నమస్కారము.

(57)

## మహాసౌర మంత్రము 58

విభ్రాజం జ్యోతిషా స్వరగచ్ఛో రోచనం దివః।
యేనేమా విశ్వా భువనాన్యాభృతా విశ్వకర్మణా విశ్వదేవ్యావతా॥

### పదపాఠము

వి-భ్రాజన్ । జ్యోతిషా । స్వః । అగచ్ఛః । రోచనమ్ । దివః । యేన । విశ్వా । భువనాని । ఆ-భృతా । విశ్వ-కర్మణా । విశ్వదేవ్య- వతా ॥

### సాయణ భాష్యము

హేసూర్య। జ్యోతిషా తేజసా స్వః సర్గం జగద్విభ్రాజయన్దివః సంబంధి రోచనం స్థానమగచ్ఛ। ప్రాప్నోః। విశ్వకర్మణా సర్వవ్యాపార హేతునా విశ్వదేవ్యావతా। విశ్వేషాం దేవానాం హితో యాగాదిర్విశ్వ దేవ్యః। తద్వతా యేన సారేణ తేజసేమేమాని పరిదృశ్యమానాని విశ్వాసర్వాణి భువనాన్యుదకాని భౌమాన్యాభృతా ఘర్మకాల అభృతాని భవంతి। యద్వా। సర్వాణి భూత జాతాన్యాభృతా సమన్తాద్భృతాని పోషితాని భవన్తి। తేన జ్యోతిషా ఇత్యన్వయః॥

(ఋక్ 10-170-4)

వాక్యాన్వయము :

విశ్వకర్మణా విశ్వదేవ్యావతా యేన జ్యోతిషా ఇమా విశ్వా భువనాని ఆభృతా తేన జ్యోతిషా హే సూర్య! స్వః విభ్రాజన్ దివః రోచనం అగచ్ఛః॥

ప్రతిపదార్థము

విశ్వకర్మణా = సర్వవ్యాపార హేతువైనట్టియు, (సమస్త కర్మలను చేయించునట్టి) విశ్వదేవ్యావతా = సర్వదేవతలకు హితకరమగు యాగాదులను కల్గినట్టి (చేయించునట్టి), యేన జ్యోతిషా = ఏ తేజస్సుచే, ఇమా విశ్వాభువనాని = ఈ సమస్తలోకములు, ఆభృతా = పోషింపబడుచుండెనో, తేన తేజసా = ఆతేజస్సుతోనె, హేసూర్య = ఓ సూర్య! నీవు, స్వః = స్వర్లోకమును, విభ్రాజన్ = విశేషముగ వెల్గొందించుచు, దివః = ద్యులోకమున, రోచనం = దివ్యమగు నీ స్థానమును, అగచ్ఛః = చేరుము.

ఓ సూర్యదేవ! నీ తేజస్సు లోకమందలి సర్వవ్యాపారములకు మూలము. లోకమున దేవతా ప్రీత్యర్థము జరుగు యజ్ఞయాగాది క్రియలనన్నిటిని క్రమముగ ప్రవర్తింపచేయునది నీ తేజస్సేగద. ఆ తేజస్సే సమస్తలోకములకు ఉదకాన్నరూపమగు సమస్తాహారమును కూర్చుట ద్వార పోషించుచున్నది. అట్టి మహత్తరమగు తేజస్సుతో, ఓ ఆదిత్య! నీవు స్వర్గాదిలోకములను కూడ ప్రకాశింపచేయుచు, ద్యులోకమందలి నీ స్థానమును చేరుము.

ఇట్లు స్వస్థానమునకు పోవుచున్న ఓ! సూర్య! నీకు నమస్కారము.

(58)

## మహాసౌర మంత్రము 59

అయం గౌః పృశ్ని రక్రమీ దసదన్మాతరం పురః।
పితరం చ ప్రయన్స్వః॥

**పదపాఠము :**

ఆ । అయమ్ । గౌః । పృశ్నిః । అక్రమీత్ । మాతరమ్ । పురః । పితరమ్ । చ । ప్ర-యన్ । స్వరితిస్వః ॥

**సాయణ భాష్యము :**

గౌర్గమనశీలః పృశ్నిః ప్రాష్టవర్ణః ప్రాప్తతేజా అయం సూర్య అక్రమీత్। ఆక్రాంతవాన్। ఉదయాచలం ప్రాప్తవానిత్యర్థః। అక్రమ్య చ పురః పురస్తాత్ పూర్వస్యాం దిశి మాతరం సర్వభూతజాతస్య నిర్మాత్రీం పృధివీమసదత్। ఆసీదతి। ప్రాప్నోతి॥ తతః పితరం పాలకం ద్యులోకం చ శబ్దాదన్తరిక్షంచ ప్రయన్ ప్రకర్షేణ శీఘ్రం గచ్ఛన్ స్వః స్వరణః శోభనగమనో భవతి। యద్వా। పితరం స్వర్గలోకం ప్రయన్వర్తతే॥

(ఋక్ 10-189-1)

వాక్యాన్వయము:

గాః పృశ్నిః అయం (సూర్యః) అక్రమీత్ । (సః) పురః మాతరం అసదత్ । పితరం స్వః చ ప్రయన్ (వర్తతే) ॥

ప్రతిపదార్థము

గాః = గమనశీలియు, పృశ్నిః = తేజో విరాజింతుడునగు, అయం = ఈతడు (సూర్యుడు), అక్రమీత్ = (సర్వమును) ఆక్రమించెను. ఆ ఆక్రమణ స్వరూపమెట్లున్నది? పురః = ముందుగ, ప్రథమమున, మాతరమ్ = సర్వ జీవ జాలమునకు మాతృ స్థానీయమగు, పృథివిని, అసదత్ = పొందెను. తన వెలుగులచే నింపెనని భావము. తర్వాత, పితరమ్ = పితృ స్థానీయమగు స్వః = స్వర్లోకమును, చ = కూడ అనగ అన్తరిక్షలోకమును గూర్చియు, ప్రయన్ = వేగముగ పోవుచున్నాడు.

నిర్విరామ గమనశీలియు, నిత్యస్తోత్రపాఠ హవిర్దాన, యజ్ఞయాగాది క్రతు పరివృద్ధ తేజోవిరాజి తుండునగు సూర్యుడు సముద్ర గర్భమునుంచి ఉదయించుచు, క్రమముగ సర్వమును ఆక్రమించి తన వెలుగు రేకలతో నింపుచున్నాడు. అందు ముందుగ సర్వజీవ ప్రాణదాత్రియు మాతృ స్థానీయమునగు భూమండలము నావరించెను. తరువాత పితృస్థానీయము-అనగ సర్వజీవులకు వర్షాదికముల నొసగి పోషించి పాలించెడి దేవతా నివాసస్థానమగు స్వర్లోకమును, అట్లే అంతరిక్షమును కూడ తన తేజస్సుతో ఆక్రమించుటకై మిక్కిలి వేగముగ పోవుచున్నాడు.

ఇట్లు అతిరయముగ పోవు ఓ సూర్య! నీకు నమస్కారము

(59)

అన్తశ్చరతి రోచనాస్య ప్రాణా దపానతీ ।
వ్యఖ్యన్మ హిషో దివమ్॥

**పదపాఠము :**

అన్తరితి । చరతి । రోచనా । అస్య । ప్రాణాత్ । అప-అనతీ । వి । అఖ్యత్ । మహిషః । దివమ్ ॥

**సాయణ భాష్యము :**

అస్య సూర్యస్య రోచనా రోచమానా దీప్తిరంతః శరీరమధ్యే ముఖ్యప్రాణాత్మనా చరతి । వర్తతే । కిం కుర్వతీ । ప్రాణాదపానతీ । ముఖ్యప్రాణస్య ప్రాణాద్యాః పంచ వృత్తయః । తత్ర ప్రాణనం నాడీభిరూర్ధ్వం వాయోర్నిర్గమనమ్ । తథావిధాత్ప్రాణాత్ ప్రాణనాదనంతర మపానతీ । అపాననం నాడీభిరవాఙ్ముఖం వాయోర్నయనం । తత్కుర్వతీ ॥ యద్వా । అన్తర్ద్యావా పృథివ్యోర్మధ్యే అస్య సూర్యస్య రోచనా రోచమానా దీప్తిశ్చరతి । గచ్ఛతి । కిం కుర్వతీ । ప్రాణాత్ప్రాణనాత్ ఉదయానంతరమపానతీ సాయం సమయేఽస్తం గచ్ఛతీ । ఈదృశ్యాదీప్త్యాయుక్తః । త ఏవ మహిషో మహాన్ సూర్యో దివమన్తరిక్షం ఉదయాస్తమయయోర్మధ్యే వ్యఖ్యత్ విచష్టే । ప్రకాశయతి ॥

(ఋక్ 10-189-2)

వాక్యాన్వయము :

అస్య రోచనా ప్రాణాదపానతీ అన్తశ్చరతి మహిషః దివం వ్యఖ్యత్ ॥

ప్రతిపదార్థము

అస్య = ఈతని యొక్క, (ఈ సూర్యుని యొక్క), రోచనా = ప్రకాశవంతమగు కాంతి, అన్తః = శరీర మధ్యయందు, ద్యావా పృథివీ = అన్తరిక్షమందు, ప్రాణాత్ = ప్రాణస్థానమునుండి (ప్రాణాపాన సమానోదాన వ్యదానాత్మకమగు పంచప్రాణములలో మొదటిదగు ప్రాణస్థానము నుండి-లేక ఉదయమునుండి) అపానతి = అపాన స్థానమువరకు (అస్తమయము నొందు వరకు) క్రమముగ, చరతి = చరించుచున్నది. మహిషః = మహా శక్తియుతు డగు ఈ సూర్యుడు, దివమ్ = ద్యులోకమును, వ్యఖ్యత్ = ప్రకాశింపచేసెను.

ఈ సూర్యుని తేజస్సు లేక శక్తి ఒకే కాలమున రెండు పనులను చేయు చున్నది.

ఈ సూర్యుడు జీవుల శరీరమందు ప్రాణాపానాది వాయు రూపమున చరించుచున్నాడు. అదే సమయమున అతడు ద్యులోకమునకూడ ప్రకాశించు చున్నాడు.

ఈ సూర్యుని యొక్క శక్తివంతమగు తేజస్సు స్వర్లోక భూ లోకముల నడుమనున్న అంతరిక్షమున సూర్యోదయ సూర్యాస్తమయ రూపమున చరించు చున్నది. తర్వాత మహాసత్త్వ సంపన్నుడగు సూర్యుడు ద్యులోకమున కూడ ప్రకాశించు .చున్నాడు.

ఇట్లు విశిష్టత నొందిన ఓ ఆదిత్య! నీకు నమస్కారము.

(60)

# మహాసౌర మంత్రము 61

త్రింశద్ధామ విరాజతి వాక్పతంగాయ ధీయతే।
ప్రతి వస్తో రహ ద్యుభిః॥

## పదపాఠము

త్రింశత్ । ధామ । వి । రాజతి । వాక్ । పతంగాయ । ధీయతే।
ప్రతి । వస్తోః । అహ । ద్యు-భిః॥

## సాయణ భాష్యము

త్రింశత్ ధామ ధామాని స్థానాని । వచన వ్యత్యయః । వస్తోర్వ్యాసరస్య అహోరాత్రస్య అవయవ భూతాని । అహశబ్దోఽవధారణే । ద్యుభిః సూర్యస్య దీప్తిభి రేవ విరాజతి । విరాజంతే । విశేషేణ దీప్యన్తే । వ్యత్యయేనైకవచనమ్ । ముహూర్తాన్యత్ర ధామాన్యు చ్యన్తే । పంచ దశ రాత్రేః పంచదశాహ్నః । పతంగాయ । పతతి గచ్ఛతీతి పతంగః సూర్యః । తస్మై శ్రుతు రూపా వాక్ ప్రతి ధీయతే । ప్రతి ముఖం స్తో తృభ్యః క్రియతే । యద్వా । వస్తో రహని త్రింశద్ధామాని । ఘటికాభిప్రాయ మేతత్ । త్రింశత్ ఘటికాభిః । ఏతావన్తం కాలం దీప్తి భిః ద్యుభిరసౌ సూర్యో విరాజతి । విశేషణ దీప్యతే । తస్మింశ్చ సమయే త్రయీ రూపా తస్మై సూర్యరూపాయ పతంగాయ ప్రతి ధీయతే ప్రతి ముఖం ధార్యతే । స్తూయతే సూర్యః సర్వత ఇత్యర్థః । శ్రూయతే హి । ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయతే యజుర్వేదే తిష్ఠతి మధ్యే అహ్నః ఇత్యాది॥ (తై.బ్రా. 3-12-9-1)॥

(ఋక్ 10-189-3)

వాక్యాన్వయము:

వస్తోః త్రింశద్ధామ ద్యుభిః విరాజతి । పతంగాయ వాక్ ధీయతే ॥

ప్రతిపదార్థము:

వస్తోః = దినము యొక్క (రాత్రింబవళ్ళ యొక్క), త్రింశత్ ధామ = ధామాని = ముప్పది (ముహూర్తరూప) స్థానములు, ద్యుభిః = సూర్యుని యొక్క దీప్తులచే, విరాజతి = విరాజంతే = విశేషముగ ప్రకాశించు చున్నవి. (లేదా వస్తోః = పగటి యొక్క త్రింశత్ ధామ = ముప్పది ఘడియల -ఘటికా కాలములు - ఇవే స్థానములుగ దీవ్యస్తే). అట్లు సూర్యుని చే అహో రాత్ర వ్యవస్థ కల్పింపబడు సమయమున, పతంగాయ = గమన శీలియగు సూర్యుని కొరకు, వాక్ = యజమానులయొక్క స్తోత్ర రూపమగు వైదిక వాక్కు, ధీయతే = ఉంచబడుచున్నది. గానము చేయబడుచున్నది॥

ముప్పది ముహూర్త కాలముల పరిమితమైనది దినము. అందు పదునైదు ముహూర్తములు పగటి ప్రమాణము. 15-ముహూర్తములు రాత్రికాలము. ఈ ముహూర్తములే ధామ (స్థానములని) అలంకారికముగ చెప్పబడెను. ఆ కాల విభజన, రాత్రింబవళ్ళ కల్పన - సూర్యుని యొక్క దీప్తి మంతమగు తేజః కిర ణముల వలననె జరుగు చున్నది. ఇచట ధామ శబ్దమునకు "ఘటిక" (గడియ) అనికూడ అర్థము చెప్పవచ్చును. అట్లైనచో పగలు 30ఘటికలు, రాత్రి 30 ఘటికలు అగును. అపుడు వస్తోః = పగటి యొక్క లేక రాత్రి యొక్క అని అర్థము. ధామ శబ్దమునకు, వస్తోః పదమునకు నేయర్థము చెప్పినను కాలగణనము సూర్యుని తేజస్సును బట్టి యె జరుగుచున్నది. అట్టి ఈ కాలములందు సూర్యుని తత్తద్రూపమును ఉపాసకులు వైదిక మంత్రములతో గానము చేయుచున్నారు.

ఈవిధముగ స్తుతింపబడు ఓ సూర్య! నీకు నమస్కారము.

(61)

# మహాసౌర మంత్రము 62

ఋతం చ సత్యం చాభీద్ధా త్తపసోఽ ధ్య జాయత ।
తతో రాత్ర్య జాయత తతః సముద్రో అర్ణవః॥

## పదపాఠము

ఋతమ్ । చ । సత్యమ్ । చ । అభీద్ధాత్ । తపసః । అధి । అజాయత।
తతః । రాత్రి । అజాయత । తతః । సముద్రః । అర్ణవః॥

## సాయణ భాష్యము

ఋత మితి సత్యనామ । ఋతం మానసం యధార్ధ సంకల్పనం సత్యం యధార్ధ భాషణమ్ । చకారాభ్యాం అన్యదపి శాస్త్రీయం ధర్మ జాతం సముచ్చీయతే । తత్సర్వమభీద్ధా దభి తప్తా ద్బ్రహ్మణా పురా సృష్ట్యర్ధం కృతాత్తపసోఽధి । అధి = ఉపర్యర్థే । ఉపర్య జాయత । ఉదపద్యత । తపస్తప్త్వా ఇదం సర్వమసృజత ॥ (తై.అ. 8-6 ) ఇతి శ్రుతేః । తపశ్చాత్ర స్రష్టవ్య పర్యాలోచన లక్షణమ్। యస్యజ్ఞానమయం తపః । (ముం.ఉ 1-1-9)॥ ఇతి శ్రుత్యంతరాత్॥

యద్వా । అభీద్ధాత్ = అభితః ప్రకాశమానాత్ పరమాత్మనః మాయాధిష్ఠాన రూపాపాదాన భూతాదృతం సత్యం చాజాయత । ఇతి ప్రకృతే రుపాదాన సంజ్ఞా । తతః తస్మాదేవ ఈశ్వరాత్ రాత్రి । ఉపలక్షణమేతత్ । అహోఽపి । అహశ్చ రాత్రిశ్చ అజాయత । తతః తస్మా దేవేశ్వరా దర్ణవోఽ ర్ణసోదకేన యుక్తః సముద్రశ్చాజాయత । సముద్ర శబ్దోఽన్తరిక్షో దధ్యోః సాధారణ ఇత్యధి మతార్ధస్య ప్రకాశనాయార్ణవ శబ్దేన విశేష్యతే॥

(ఋక్ 10-190-1)

వాక్యాన్వయము

అభీద్ధాత్తపసః అధి ఋతం సత్య మజాయత । తతః రాత్ర్యజాయత ।
తతః అర్ణవః సముద్రః (అజాయత)

ప్రతిపదార్థము

అభీద్ధాత్ = తీవ్రమైన, నిష్ఠురమైన, తపసః అధి = తపస్సు నుండి ఋతమ్ = మానసిక మగు యథార్థ భావన, సత్యమ్ = వాగ్రూపమగు యదార్థ భాషణమును, అజాయత = ఆవిర్భవించెను. తతః = పిమ్మట, రాత్రి = రాత్రి, అల్లే పగలు, అజాయత = పుట్టెను. తతః = పిమ్మట, అర్ణవః = వర్షోదకములచే నిండిన, సముద్రః = జలధియు (అజాయత = పుట్టెను).

సృష్ట్యారంభమున, చతుర్ముఖ బ్రహ్మ విరాడ్జిహ్మయగు-విరాట్స్వరూపుండగు-పరమేశ్వరు నుద్దేశించి ఏకాగ్రదీక్షతో కఠోరమగు తపస్సు చేసెను. తత్ఫలితముగ ప్రథమమున మానసికమగు యదార్థ భావనయు, పిమ్మట వాగ్రూపమగు యదార్థ భాషణమును పుట్టినవి. ఋతమనగ ధర్మవిహితమగు ఆలోచనలు. సత్యమనగ ధర్మ నిబద్ధములగు భాషణములు. తదనన్తరము, అహోరాత్రులు పుట్టినవి. అనగ దివారాత్రములను గుర్తించుటకు కారణమగు సూర్యుడు జన్మించెనని భావము. అటు పిమ్మట వర్షోదకములచే నిండిన సముద్రము ఉద్భవించెను.

(62)

## మహాసౌర మంత్రము 63

సముద్రా దర్ణవాదధి సంవత్సరో అజాయత । అహోరాత్రాణి విదధ ద్విశ్వస్య మిషతో వశీ ॥

### పదచ్ఛేదము :

సముద్రాత్ । అర్ణవాత్ । అధి । సంవత్సరః । అజాయత । అహో-రాత్రాణి । విదధత్ । విశ్వస్య । మిషతః । వశీ॥

### సాయణ భాష్యము :

అర్ణవాత్ = సముద్రాత్ సృష్టాదధ్యూర్ధ్వం సంవత్సరః సంవత్సరోపలక్షితః సర్వః కాలో అజాయత । శ్రూయతే హి । సర్వేనిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధికలా ముహూర్తాః కాష్ఠాశ్చ॥ (తై.ఆ.10-1-2) ॥ ఇతి । సచేశ్వరః అహోరాత్రాణ్యేతదుపలక్షితాని సర్వాణి భూతాని విదధత్ కుర్వన్ సృజన్ ॥ తతః, మిషతః నిమిషాది యుక్తస్య విశ్వస్య సర్వస్య ప్రాణిజాతస్య వశీ స్వామీ భూత్వా వర్తతే ॥

(ఋక్ 10-190-2)

పదపాఠముగ అదే మంత్రము పునః పఠితమైనది. కనుక పదచ్ఛేదమును చూపితిమి. పూర్వమంత్రమున కూడ ఇట్లేయని గ్రహించవలెను.

వాక్యాన్వయము:

సముద్రా దర్ణవా దధి సంవత్సరః అజాయత । అహోరాత్రాణి విదధత్
విశ్వస్య. మిషతః వశీ (అభూత్) ॥

ప్రతిపదార్థము:

సముద్రాత్ అర్ణవాత్ అధి = వర్షోదక పూరితమగు జలధి ఆవిర్భవించిన తదుపరి, సంవత్సరః = సంవత్సరము (సర్వ కాల విభాగము), అజాయత = పుట్టెను. తర్వాత, అహోరాత్రాణి = దివారాత్రములు, విదధత్ = విభాగము చేయుచు, మిషతః = నిమిషాదియుక్తమగు, విశ్వస్య = ఈ సర్వస్వమునకు (సూర్యుడు), వశీ = అధిపతి ప్రభువు అయ్యెను.

వర్షోదక పూరితములగు జలధి ఉద్భవించిన తర్వాత, కాలము పుట్టెను. ఋక్కునందలి సంవత్సర పదము కాలమున కుపలక్షణము. తదనంతరము సమస్త భూత రాశియు (సర్వజీవజాలము) పుట్టెను. మంత్రమందలి అహోరాత్ర శబ్దములచే సర్వభూతజాతము నుపలక్షితమగును. ఈవిధముగా ఆ పరమేశ్వరుడు ఈ సమస్త సృష్టిని కాలాధీనము చేసి దానికి తానధిపతియై విరాజిల్లుచుండెను.

ఈసందర్భమున "సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషా దధి కలా ముహూర్తాః కాష్ఠాః" ఇత్యాదిగ నున్న తైత్తిరీయ అరణ్యకము (10-1-2) చూడుడు॥

(63)

వాక్యాన్వయము :

సూర్యాచన్ద్రమసౌ యథాపూర్వమకల్పయత్ । దివం చ పృథివీంచ అన్త రిక్ష మథోస్వః ॥

ప్రతిపదార్థము :

అథో = అతః = పిమ్మట, ధాతా = చతుర్ముఖ బ్రహ్మ, సూర్యా చన్ద్రమసౌ = సూర్యచంద్రులను, యథాపూర్వమ్ = పూర్వకల్పమందువలె, అకల్పయత్ = కల్పించెను, సృష్టించెను. అట్లే, స్వః దివం చ = సుఖస్థా నముగు స్వర్లోకమును, పృథివీమ్ చ = భూలోకమును, అన్తరిక్షమ్ = అన్త రిక్షమును, ధాతాయథాపూర్వమకల్పయత్ = పూర్వకల్పమందున్నట్లుగనే ఈ కల్పమందును బ్రహ్మ సృజించెను.॥

విధాతయగు చతుర్ముఖ బ్రహ్మ పూర్వకల్పమందు సూర్యచంద్రులను, భూమిని, సుఖస్థానమగు స్వర్గమును, అన్తరిక్షమును సృజించిన విధముగనె, ఈ కల్పమందును (బ్రహ్మ) వానిని ఆ విధముగనె సృజించెను. ప్రస్తుతము శ్వేతవరాహ కల్పము నడుచున్నది.

ప్రతి కల్పాంతమందు ఈ సృష్టియంతయు నశించిపోవును. మదల కల్పా దియందు బ్రహ్మ పునః సృష్టి చేయవలెను. ఆ సృష్టి ఎల్లప్పుడు నొకే విధముగ నుండును. కనుకనే మంత్రమున "యథాపూర్వమ్ = పూర్వమందున్నట్లుగనె" అని చెప్పబడినది.

(64)

సవితా పశ్చాతా త్సవితా పురస్తాత్
సవితో త్త రాత్తా త్సవితా ఽ ధరా త్తాత్ ।
సవితా నః సువతు సర్వతాతిం
సవితా నో రాసతాం దీర్ఘమాయుః॥

## పదపాఠము:

సవితా। పశ్చాతాత్ । సవితా । పురస్తాత్। సవితా । ఉత్తరాత్తాత్। సవితా । అధరాత్తాత్ । సవితా । నః । సువతు । సర్వ-తాతిమ్ । సవితా । నః । రాసతామ్ । దీర్ఘమ్ । అయుః॥

## సాయణ భాష్యము:

పశ్చాతాత్ పశ్చిమతః స్థితః సవితా, పురస్తాత్ పూర్వతశ్చ, స్థితః, సవితా ఉత్తరాత్తాత్ = ఉత్తరతః స్థితశ్చ సవితా నోఽ స్మాకం సర్వతాతిం సర్వమభిలషితం ధనాధికం సువతు। ప్రేరయతు। కించ సవితైవ నోఽస్మభ్యం దీర్ఘం బహుకాలీనమాయూరాసతామ్। దధాతు। బహుధా సవితృపదగ్రహణ మత్యం తమాదరార్థమ్॥

(ఋక్ 10-36-14)

సమాప్తమిదం మన్త్రార్థ వివరణమ్॥

వాక్యాన్వయము:

సవితా నః పశ్చాతాత్, సవితా పురస్తాత్, సవితా ఉత్తరా త్తాత్, సవితా అధరాత్తాత్ సవితా నః సువతు। సర్వతాతిం సవితా(నః) దీర్ఘమాయుః రాసతాత్॥

ప్రతిపదార్థము:

సవితా= సూర్యుడు, నః = మనలను, పశ్చాతాత్ = వెనుకనుండి, పురస్తాత్ = ముందునుండి, ఉత్తరాత్తాత్ = మీదనుండియు, అధరాత్తాత్ = క్రిందు భాగమునుండియు (రక్షించుచు), సర్వతాతిమ్= మనచే నభిలషితమగు సర్వ సంపదలను, సువతు= ప్రేరేపించుగాక, పొందించుగాక, సవితా నః = సూర్యుడు మనలకు, దీర్ఘం అయుః= దీర్ఘాయువును, రాసతాత్= ఇచ్చుగాక॥

ఇంతవరకు (64 ఋక్కులలో) సూర్యుని మహత్తును, శక్తిని ఘనముగ స్తుతించి, భక్తుడు చివరగ ఆ సూర్యుడు తనను రక్షించవలసిన విధానమును, ఉపసంహారముగ ఈ ఒక్క మంత్రమునందు కోరుకొనుచున్నాడు.

మహాతేజోయుత! శక్తిమాన్ ! సహస్రకిరణ, సవిత ! నీవు మమ్ము, మాయొక్క కుడిప్రైపు నుండియు, ఎడమప్రక్కనుండి, మీదనుం,చి క్రిందనుం చియు అనగ అన్నివైపులనుండి ఆపదలు రాకుండ రక్షించుము. ఓ ప్రభు! నీవు మాకు అన్నివైపులనుండి శుభములు, ఐశ్వర్యములు కలుగునట్లు అనుగ్రహిం పుము. వీనినంతయు అనుభవించుటకు వలయు దీర్ఘమగు ఆయురారోగ్యములను మాకు ప్రసాదింపుము. అనంత దీప్తి వలయుండగు సూర్యుని (సూర్యకవచ మును) అధిగమించి ఏ దుష్ట శక్తియు మమ్ము చేరజాలదు.

ఈవిధముగ అనంతమగు అయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించెడి ఓ సూర్య! నీకిదె మా అనంతములగు నమస్సుమాంజలులు.

(65)

ఇంతటితో మహాసౌర మన్త్రార్థవివరణము ముగిసెను.

# 9. సూర్యాష్టకము.

అస్య శ్రీసూర్యాష్టకమహా మన్త్రస్య సాంబః ఋషిః।
సూర్యోదేవతా॥ అనుష్టుప్ఛందః॥ శ్రీ సూర్యనారాయణ
ప్రీత్యర్థం శ్రీసూర్యాష్టక మహామంత్రపారాయణం కరిష్యే॥

ఓమ్

1. ఆదిదేవ నమస్తుభ్యం ప్రసీద మమ భాస్కర।
దివాకర నమస్తుభ్యం ప్రభాకర నమోస్తు తే॥

2. సప్తాశ్వరథమారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్।
శ్వేత పద్మధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

3. లోహితం రథ మారూఢం సర్వలోక పితామహమ్।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

4. త్రైగుణ్యం చ మహాశూరం బ్రహ్మావిష్ణు మహేశ్వరమ్।
మహాపాపహరందేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

5. బృంహితాం తేజసాంపుంజం వాయుమాకాశమేవచ।
ప్రభుస్త్వం సర్వలోకానాం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

6. బంధూక పుష్పసంకాశం హారకుండల భూషితమ్।
ఏకచక్ర ధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

7. విశ్వేశం విశ్వకర్తారం మహాతేజః ప్రదీపనమ్।
మహాపాపహరందేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

8. శ్రీవిష్ణుం జగతాం నాథం జ్ఞాన విజ్ఞాన మోక్షదమ్।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్॥

ఫలశ్రుతి :

సూర్యాష్టకం పఠేన్నిత్యం గ్రహపీడా ప్రణాశనమ్।
అపుత్రో లభతే పుత్రం దరిద్రో ధనవాన్ భవేత్॥

నియమములు :

అమిషం మధుపానం చ యః కరోతి రవేర్దినే।
సప్తజన్మ భవేద్రోగీ జన్మజన్మ దరిద్రతా॥
స్త్రీ తైల మధుమాంసాని యస్త్యజేత్తు రవేర్దినే।
న వ్యాధి శోక దారిద్ర్యం సూర్యలోకం స గచ్ఛతి॥
[గుహ్యాతి గుహ్య గోప్తా త్వం గృహాణాస్మత్కృతం జపం
సిద్ధిర్భవతు మే దేవ త్వత్ప్రసాదా న్మహేశ్వర॥
ఏ తత్ఫలం శ్రీ సూర్యనారాయణ దేవతార్పణమస్తు॥]
హరిః ఓం తత్సత్॥

గమనిక :

ఆదివారమునాడు మాంసము తినుట, కల్లు మొదలగు మాదక ద్రవము సేవించుట, స్త్రీ .సంభోగాదులను చేయరాదు.

# 10. శ్రీ భాస్కరాష్టకము.

శ్లో. 1. శ్రీ పద్మినీశ మరుణోజ్జ్వల కాంతిమంతం
మౌనీంద్రబృంద సురవన్దిత పాదపద్మం ।
నీరేజ సంభవ ముకున్ద శివ స్వరూపం
శ్రీ భాస్కరం భువన బాంధవ మాశ్రయామి॥

2. మార్తాణ్డ మీశ మఖిలాత్మక మంశుమంతం
ఆనన్దరూప మణిమాదిక సిద్ధిదం చ।
ఆద్యన్త మధ్య రహితం చ శివప్రదం త్వాం
శ్రీ భాస్కరం నతజనాశ్రయ మాశ్రయామి॥

3. సప్తాశ్వ మభ్రమణి మాశ్రిత పారిజాతం
జాంబూనదాభ మతి నిర్మల దృష్టిదం చ।
దివ్యాంబరా భరణ భూషిత చారుమూర్తిం
శ్రీ భాస్కరం గ్రహగణాధిప మాశ్రయామి॥

4. పాపార్తి రోగ భయ దుఃఖహారం శరణ్యం
సంసార గాఢతమ సాగర తారకం చ।
హంసాత్మకం నిగమవేద్య మహస్కరం త్వాం
శ్రీ భాస్కరం కమల బాంధవ మాశ్రయామి॥

5. ప్రత్యక్ష దైవ మచలాత్మక మచ్యుతం చ
భక్తప్రియం సకల సాక్షిణ మప్రమేయం
సర్వాత్మకం సకల రోగహారం ప్రసన్నం
శ్రీ భాస్కరం జగదధీశ్వర మాశ్రయామి॥

6. జ్యోతి స్స్వరూప మఘసంచయ నాశకం చ
తాపత్రయాంతక మనంత శుభప్రదం చ।
కాలాత్మకం గ్రహగణేన సుసేవితం చ
శ్రీ భాస్కరం భువన రక్షక మాశ్రయామి॥

7. సృష్టి స్థితి ప్రళయకారణ మీశ్వరం చ
దృష్టిప్రదం పరమ తుష్టిద మాశ్రితానాం।
ఇష్టార్థదం సకలకష్ట నివారకం చ
శ్రీ భాస్కరం మృగపతీశ్వర మాశ్రయామి॥

8. ఆదిత్య మార్తజనరక్షక మవ్యయం చ
ఛాయాధవం కనక రేతసమ గ్నిగర్భం।
సూర్యం కృపాళు మఖిలాశ్రయ మాదిదేవం
లక్ష్మీ నృసింహ కవిపాలక మాశ్రయామి॥

* శ్రీ భాస్కరాష్టక మిదం పరమం పవిత్రం
యత్ర శ్రుతం చ పఠితం సతతం స్మృతం చ।
తత్ర స్థిరాణి కమలాప్త కృపా విలాసైః
దీర్ఘాయు రర్థ బల వీర్య సుతాదికాని॥

ఓం తత్సత్

# 11. శ్రీ సూర్య కవచము

హరిః ఓమ్

ఆచమ్య । దేశకాలౌ సంకీర్త్య ---------పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ। శ్రీ సూర్యనారయణ దేవతాముద్దిశ్య । । శ్రీ సూర్యనారాయణ దేవతా ప్రీత్యర్థం మమ సర్వవిధోపద్రవేభ్యః రక్షణార్థం, శ్రీ సూర్యకవచ స్తోత్ర మహామంత్ర పారాయణ మహం కరిష్యే।

అస్య శ్రీ సూర్యకవచ మహామన్త్రస్య ఈశ్వరః ఋషిః। అనుష్టుప్ఛందః। శ్రీ సూర్యనారాయణో దేవతా। హ్రాం బీజం। హ్రీం శక్తిః। హ్రూం కీలకం। శ్రీసూర్యనారాయణ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః।

హ్రాం - అంగుష్ఠాభ్యాం నమః। హ్రీం - తర్జనీభ్యాం నమః। హ్రూం మధ్యమాభ్యాం నమః। హ్రైం - అనామికాభ్యాం నమః। హ్రౌం - కనిష్ఠికాభ్యాం నమః। హ్రః - కరతలకరపృష్ఠా భ్యాం నమః॥

హ్రాం - హృదయాయ నమః । హ్రీం - శిరసే స్వాహా। హ్రూం - శిఖాయై వషత్। హ్రైం - కవచాయహుం । హ్రౌం - నేత్రత్రయాయ వౌషట్। హ్రః - అస్త్రాయఫట్ । భూర్భువ స్సువరోమితి దిగ్బంధః॥

ధ్యానమ్: నమస్సవిత్రే జగదేక చక్షుషే
జగత్ప్రసూతి స్థితినాశ హేతవే।
త్రయీ మయాయ త్రిగుణాత్మధారిణే
విరించి నారాయణ శంకరాత్మనే॥

ఓమ్ -

లం - పృథ్వీ తత్త్వాత్మనే శ్రీసూర్యనారాయణ స్వామినేనమః
గంధం పరికల్పయామి.

హం - ఆకాశ తత్త్వాత్మనే శ్రీసూర్యనారాయణ స్వామినేనమః
పుష్పం పరికల్పయామి।

యం - వాయు తత్త్వాత్మనే శ్రీ సూర్యనారాయణ స్వామినే నమః।

ధూపం పరి కల్పయామి।

రం - తేజస్తత్త్వాత్మనే శ్రీ సూర్యనారాయణ స్వామినే నమః।
దీపం పరి కల్పయామి.

వం - అమృతతత్త్వాత్మనే శ్రీ. సూర్యనారాయణ స్వామినే నమః
అమృతోపహార నైవేద్యం పరి కల్పయామి।

సం - సర్వతత్త్వాత్మనే శ్రీ సూర్యనారాయణ స్వామినే నమః
తాంబూలాది సర్వోపచార పూజాం పరి కల్పయామి॥
గురుర్బ్రహ్మ గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షా త్పర బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః॥

ఓం

దేవా సురైస్సదా వంద్యై గ్రహైశ్చ పరివేష్టితమ్।
ధ్యేయం పఠేత్సువర్ణాభం యత్సూర్య కవచం ముదా॥

అఘనాశం ప్రవక్ష్యామి కవచం సర్వ కామదమ్।
ఇదం తు కవచం బధ్వా విచరస్వ గత జ్వరః॥

ఘృణిః పాతు శిరోదేశం సూర్యః ఫాలం చ పాతు మే।
ఆదిత్యో మే దృశౌ పాతు శ్రుతీ పాతు దివాకరః॥

ఘ్రాణం పాతు సదా భానుః అర్కః పాతు ముఖం తథా
జిహ్వాం పాతు జగన్నేత్రః కంఠం పాతు విభావసుః॥.

స్కంధౌ గ్రహపతిః పాతు భుజౌ పాతు ప్రభాకరః।
కరౌ తీవ్రకరః పాతు హృదయం పాతు భానుమాన్॥

మధ్యం మే పాతు సప్తాశ్వో నాభిం పాతు నభోమణిః।
ద్వాదశాత్మా కటిం పాతు సవితా పాతు సంధినీ॥

ఊరూ పాతు సురశ్రేష్ఠో జానునీ పాతు భాస్కరః।
జంఘే మే పాతు మార్తాండో గుల్ఫౌ పాతు ఉషాపతిః॥
పాదౌ బ్రధ్నస్సదా పాతు పాతు మిత్రోz ఖిలం వపుః॥

ఇద మే తత్కృతం గౌరి చింతితాఖిలం కామదం।
సర్వరోగ భయా త్త్రాతు ముచ్యతే నాత్ర సంశయః॥

సర్వసిద్ధి మవాప్నోతి విష్ణులోకే మహీయతే।
సతతం ప్రాతరుత్థాయ పఠే ద్రోగా ద్విముచ్యతే॥

ఆదిత్య కవచం పుణ్యమభేద్యం వజ్రసన్నిభమ్।
సంవత్సర ముపాసిత్వా సువర్ణ సదృశీ తనుః॥

ఓం

హ్రాం-హృదయాయనమః హ్రీం - శిరసే స్వాహా।
హ్రూం - శిఖాయై వషట్। హ్రైం - కవచాయ హూమ్।
హ్రౌం - నేత్ర త్రయాయ వౌషట్ । హ్రః -అస్త్రాయఫట్।
భూర్భువస్సువరోమితి దిగ్విమోకః॥

ధ్యానమ్: నమస్సవిత్రే జగదేక...............తస్మై శ్రీగురవే నమః॥

అనేన మయా కృతేన శ్రీసూర్యకవచ మహామన్త్ర పారాయణేన భగవాన్ సర్వాత్మకః శ్రీ సూర్యనారాయణ స్సుప్రీతో ప్రసన్నోవరదో భవతు॥

ఏ తత్పారాయణఫలం శ్రీ సూర్యనారాయణ దేవతార్పణమస్తు॥

ఓం తత్సత్॥

## 12. మహాసౌర మంత్రములు - అకారాదిక్రమము

| మంత్ర సంఖ్య | మంత్ర (ఋక్) స్వరూపము | ఋగ్వేదమున ఋక్సంఖ్య మం-సూ-ఋ |
|---|---|---|
| 3 | అదృశ్రమస్యకేతవో విరశ్మయో... | 1-50-3 |
| 19 | అద్యాదేవా ఉదితా సూర్యస్య... | 1-115-6 |
| 60 | అంతశ్చరతి రోచనా అస్య... | 10-189-2 |
| 02 | అపత్యేతాయవో యథా... | 1-50-2 |
| 09 | అయుక్త సప్త శున్ధ్యువః సూరో... | 1-50-9 |
| 48 | అస్మాకం దేవా ఉభయాయ జన్మనే... | 10-37-11 |
| 59 | ఆయంగౌః పృశ్నిరక్రమీ... | 10-189-1 |
| 57 | ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతి... | 10-170-3 |
| 20 | ఇన్ద్రం మిత్రం వరుణమగ్ని... | 1-164-46 |
| 25 | ఉత్సూర్య బృహదర్చీ ష్యశ్రేత్పురు... | 7-62-1 |
| 13 | ఉదగాదయ మాదిత్యో విశ్వేన... | 1-50-13 |
| 33 | ఉదుత్యద్దర్శతం వపుర్దివ... | 7-66-14 |
| 01 | ఉదుత్యం జాతవేదసం దేవం... | 1-50-1 |
| 11 | ఉద్యన్నద్య మిత్రమహ... | 1-50-11 |
| 10 | ఉద్వయం తమసస్పరి జ్యోతిష్పశ్యన్త... | 1-50-10 |
| 29 | ఉద్వేతి ప్రసవీతా జనానాం... | 7-63-2 |
| 28 | ఉద్వేతి సుభగో విశ్వచక్షా... | 7-63-1 |
| 62 | ఋతం చ సత్యం చాభీద్దా... | 10-190-1 |
| 21 | కృష్ణం నియానం హరయః సుపర్ణా... | 1-164-47 |
| 52 | చక్షుర్నోదేవస్సవితా చక్షుర్న... | 10-158-3 |
| 53 | చక్షుర్నోధేహి చక్షుషే... | 10-158-4 |
| 14 | చిత్రం దేవానా ముదగాదనీకం... | 1-115-1 |
| 51 | జోషా సవితర్యస్య తే హరః... | 10-158-2 |

| | | |
|---|---|---|
| 35 | తచ్చక్షుర్దేవహితం శుక్రముచ్చరత్... | 7-66-16 |
| 43 | తం నో ద్యావా పృథివీ తన్న... | 10-37-6 |
| 18 | తన్మిత్రస్య వరుణస్యాభి చక్షే... | 1-115-5 |
| 17 | తత్సూర్య దేవత్వం తన్మహిత్వం | 1-115-4 |
| 04 | తరణిర్విశ్వదర్శతో జ్యోతిష్కృదసి | 1-50-4 |
| 61 | త్రింశద్ధామ విరాజతి వాక్పతంగాయ | 10-189-3 |
| 31 | దివోరుక్మ ఉరు చక్షా | 7-63-4 |
| 40 | నతే అదేవః ప్రదివో | 10-37-3 |
| 38 | నమో మిత్రస్యవరుణస్య చక్షసే | 10-37-1 |
| 05 | ప్రత్యఙ్ దేవానాం విశః | 1-50-5 |
| 37 | బట్ సూర్యశ్రవసామహాఁ | 8-101-12 |
| 36 | బణ్మహాఁ అసి సూర్య | 8-101-11 |
| 16 | భద్రా అశ్వాహరితః | 1-115-3 |
| 45 | మహాఁజ్యోతిరిబభ్రతం | 10-37-8 |
| 32 | యత్రా చక్రరమృతా | 7-63-5 |
| 23 | యత్త్వా సూర్యస్వర్భాను | 5-40-5 |
| 24 | యదద్యసూర్యబ్రవోఽ నాగా | 7-60-1 |
| 49 | యద్వోదేవాశ్చకృమ | 10-37-12 |
| 46 | యస్యతే విశ్వా భువనాని | 10-37-9 |
| 41 | యేన సూర్యజ్యోతిషా బాధసే | 10-37-4 |
| 06 | యేనా పావక చక్షసా భురణ్యన్తం | 1-50-6 |
| 07 | విద్యామేషి రజస్పృథ్వాహాఁ | 1-50-7 |
| 58 | విభ్రాజ జ్యోతిషా స్వరగచ్ఛో | 10-170-4 |
| 30 | విభ్రాజమాన ముషసా ముపస్థా | 7-63-3 |
| 55 | విభ్రాడ్బృహ త్పిబతు | 10-170-1 |
| 56 | విభ్రాట్ బృహత్సుభృతం | 10-170-2 |
| 27 | వినః సహస్రం శురుధో రక్షసి | 7-62-3 |
| 42 | విశ్వస్య హి ప్రేషితో రక్షసి | 10-37-5 |

| | | |
|---|---|---|
| 44 | విశ్వాహా త్వా సుమనసః | 10-37-7 |
| 45 | శం నో భవ చక్షసా శం | 10-37-10 |
| 34 | శీర్ష్ణః శీర్ష్ణో జగతస్తస్థు | 7-66-15 |
| 12 | శుకేషు మే హరిమాణం | 1-50-12 |
| 08 | సప్త త్వా హరితో రథే | 1-50-8 |
| 63 | సముద్రాదర్ణవాదధి... | 10-190-2 |
| 65 | సవితా పశ్చా తాత్సవితా | 10-36-14 |
| 26 | స సూర్య ప్రతిపురోన | 7-62-2 |
| 39 | సా మా సత్యోక్తిః పరి | 10-37-2 |
| 54 | స సందృశం త్వా వయం | 10-158-5 |
| 64 | సూర్యా చంద్రమసౌ ధాతా | 10-190-3 |
| 15 | సూర్యో దేవీ ముషసం | 1-115-2 |
| 50 | సూర్యో నో దివస్పాతు | 10-58-1 |
| 22 | హంసశ్శుచిషద్వసురంత | 4-40-5 |

* * *

ఋగ్వేదాన్తర్గతమగు సూర్యదేవతాక మంత్రభాగముల నుద్ధరిం మన పెద్దలందించిన మహా సౌరము అను భాగమునకు సాయణ భాష్యముతో పాటు, సులలిత సరళ తెలుగు వివరణముతో కూడ శ్రీమాన్ వేదము సుబ్రహ్మణ్యం గారందించే ఈ కోశము అద్భుతమైన రీతిలో తయారయినది

శ్రీమత్త్రిదండి చిన్న జియర్ స్వామి వారు.
వేద విశ్వవిద్యాలయము - సీతానగరము - 522501

వైదికమైన మంత్రములతో కల్పోక్తమైన పద్ధతులతో ఆచరించే సూర్యోపాసనా ప్రక్రియకే "సౌరము" లేక "మహా సౌరము" అని పేరు... ....... ఈ ప్రక్రియను ఆచరిస్తే ఆయురారోగ్యైశ్వర్యాది సకల సంపదలు సమకూరును, ముఖ్యముగ ఆరోగ్యభాగ్యాన్ని ఇది అవ్యాహతమే. సందేహంలేదు

సాహిత్యవిశారద అప్పల్ల సోమేశ్వర శర్మ.

సౌర జపపారాయణలు చేసుకొనలేని, చేయించుకోలేని బడుగు వర్గాల వారి కొరకై ధ్యాన శ్లోకాలను, సూర్యాష్టకం, భాస్కరాష్టకం, సూర్యకవచాన్ని ఈ గ్రంథంలో చేర్చడం ఎంతయు ముదావహము.

ఆచార్య పోచంచర్ల శ్రీరామమూర్తి.

ఆయురారోగ్యముల కాయువుపట్టు మహాసౌరము. అందలి మంత్రములకు అర్థ తాత్పర్యములను మనలోని ప్రతి ఒక్కరు తెలుసుకోవాలి. అందుకు ఈ గ్రంథము ఉత్తమ సాధనము. ఇందలి వివరణము శిష్టవ్యావహారిక ఆంధ్రము నందుండుట గ్రంథమునకొక విశిష్టతను చేకూర్చినది.

పో. తి గు. వేంకట రంగాచార్యులు
కేంద్ర సచివులు. విశ్వ సంస్కృత ప్రతిష్ఠాన్.